# శాసనములు.



చెరుకువాడ వేంకటనరసింహముగారిచే
వ్రాయబడినది.





మొదటి ముద్రణము 1000 ప్రతులు

---



1923 ఆగస్టు.

వెల రు 0—10—0

# స్వ రా జ్య ప త్రి క.

ఇది బెజవాడనుండి వెలువడుచున్న తెలుగువార పత్రిక. కీయ సాంఘికాది విషయములను నిర్భయముగాను స్వతంత్రః విమర్శించుచుండును. సంపాదకుడు శ్రీయుత ముద్దిరాల ద్రయ్యచౌదరీ గారు. స్వరాజ్యకాంక్షులందరును చదువవలయును. సంవత్సరము చందా రు 5—0—0

వలయువారు :—

మానేజరు, స్వరాజ్యపత్రిక

బెజవాడ

అని వ్రాయవలెను.

ఇందు 1 నుండి 56; 73 నుండి 80; 89 నుండి 104 పేజీలు, కృష్ణా స్వదేశీ ప్రెస్ నందును మిగిలినది సుధర్మ ముద్రణాలయము నందును బందరులో ముద్రితమయ్యెను.

# ఉపోద్ఘాతము

ఈ పుస్తకమునందు గత మూడు సంవత్సరముల ముచ్చటలును వివరింపబడియున్నవి. ఆంధ్రరాష్ట్రీయ సంఘమువారు ఈ కార్యమును బూనుకొని మాంటుఫర్డు సంస్కరణలు ఎట్లు విఫలము లయినవో సంగ్రహముగ నాంధ్రులకు దెలియజేయుటకు చిన్న పొత్తము నొకదానిని రచించుటకు నొక యుపసంఘమును నియమించి యున్నారు. ఆ యుపసంఘములో నేనొక సభ్యుడనై యుండి పుస్తకరచనకు వలయు సామగ్రిని సమకూర్చి యుండగా శ్రీ చెరుకువాడ వేంకట నరసింహముగారుగూడ నిట్టికార్యమునే తలపెట్టి, ఆయనయు గొంత గ్రంథ సామాగ్రి సిద్ధము జేసికొంటినని చెప్పెను. లోగడ నీయనరచించిన స్వరాజ్యదర్పణ మెంతయు రంజకమై, కొంత వరకు వ్యాపకము జెంది యుండుటచేతను, పుస్తకరచన ధనరీత్యా లాభకరమగు కార్యము గాకపోవుటచేతను ఏక కాలమందు రెండు ప్రయత్నములు తలపెట్టుటకంటె రెంటిని గలిపి యొక కార్యమునకే యుపచరింపజేయుట యుక్తమని తలంచి రాష్ట్రీయసంఘము పక్షమున ప్రత్యేకముగా పుస్తకము వ్రాయుట సంక్షేపించితిని. శాసనసభల త్రైవార్షిక వృత్తాంతమును సవిస్తరముగ దెల్పు నీగ్రంథము సమగ్రమైనదై గతించిన మూడేండ్లలో జరిగిన రాజకీయ సందర్భముల నెల్ల తులదూచి సక్రమముగ విమర్శించినది. మనము స్వరాజ్యమని తెలుపు భావమునే ఆంగ్లమున ప్రజాయత్త పరిపాలనము లేక బాధ్యతాయుత పరిపాలనము అని వాడుచున్నారు. ఎప్పుడు స్వరాజ్యము ప్రజాయత్తపరిపాలనగా నుండునో అప్పుడు ప్రజలచే నది నిర్వర్తింపబడుటయే గాక ఏతత్స్థాపనము గూడ ప్రజచేలతనే గావింపబడవలెను. అందుకు గాను ప్రజలకు రాజకీయసమస్యలనుగూర్చియు, సంస్కరణములనుగూర్చియు,

సంపూర్ణమగునట్టి ప్రబోధము గావింపవలసిన విధి ప్రజాప్రముఖులదై యున్నది. ఇట్టి విధిని యీచిన్న పొత్తము కొంతవరకు నిర్వర్తింప గలదని గట్టిగ నమ్ముచు ఆంధ్రదేశమునందలి కాంగ్రెసు సభ్యులెల్లరును, కనీసము కాంగ్రెసు సంఘములెల్ల దీనిని కొని పఠించి జీర్ణము చేసికొందురుగాక యని యాశపడుచున్నాను.

బందరు,
1. 8. 23.

ఇట్లు,
భో. పట్టాభిసీతారామయ్య.



# శాసనసభలు.



ఇప్పటికిసుమారు 225 సంవత్సరముల క్రిందట అనగా క్రీ. శ. 1600 సం॥ లో ఇంగ్లీషువారు మనదేశముతో కేవలము వర్తకము జేయునుద్దేశ్యము బెట్టుకొని 'ఈస్టు ఇండియాకంపెనీ' అనుపేర నొక వర్తకసంఘమును స్థాపించి యిచటికివచ్చి కొంతకాలము వర్తకము బాగుగ సాగినతర్వాత క్రమ క్రమముగా నిచట కొంతరాజ్యమును సంపాదించి పరిపాలించుచు తుదకీదేశమును వారెట్లు వశము జేసికొనిరో, పిదప 1858 వ సంవత్సరములో నీకుంభిణీవారు తమ యిండియారాజ్యమును ఎట్లు బ్రిటిషుగవర్నమెంటువారి పరము జేసిపోయిరో యీ కథాక్రమమంతయు సంగ్రహముగ నా "స్వరాజ్యదర్పణము"ను పుస్తకములోని మొదటిప్రకరణమున వ్రాయబడి యుండుటచే నిపుడాసంగతులనే యిచట మరల వ్రాయక, కంపెనీవారి హయాములోను పిదప రాణిగారిస్వాధీనములోనికి వచ్చిన తర్వాతను ఈ దేశపరిపాలనావిషయములో అప్పటికప్పుడు జరుగుచు వచ్చిన రాజ్యాంగపరిణామముల నీ ప్రకరణములో క్లుప్తముగా వివరింతును.

శాసననిర్మాణ - కార్యనిర్వాహక విభాగములు.

అసలు రాజ్యాంగసభలు రెండువిధములు. ఒకటి శాసననిర్మాణసభ, దీనినే యింగ్లీషులో లెజెస్లేటివ్ కౌన్సిలు అందురు. రెండవది కార్యనిర్వాహకసభ, దీనికి ఎక్సిక్యూటివుకౌన్సిలు అని పేరు. ఏ దేశపరిపాలనకైనను ఈ రెండురాజ్యాంగసంస్థలును ఉండితీరవలయును. అయితే దేశకాల పాత్రాదిభేదములనుబట్టి

యీసంస్థలఅంగనిర్మాణముల్లోను,నియమాధికారములలోను,భేదము లుండునేగాని యేదోరూపములో నీ సంస్థలు విడివిడిగానో లేక రెండును గలిసియో, యుండిననేగాని యేరాజ్యపరిపాలనయు జరుగ నేరదు. నిరంకుశ ప్రభు స్వామికములో సహితము నీరెండు ధర్మము లును సర్వాధికారసమన్వితుడైన చక్రవర్తి యొక్కనియందే యుండును. ఇప్పుడు ప్రపంచములో నున్న నియతప్రభుస్వామిక ములలోనేమి, ప్రజాస్వామికములలోనేమి, యివిరెండును విడి విడి సంస్థలుగానే యున్నవి.

## శాసనసభలు

దేశములోని ప్రజల క్షేమాభివృద్ధిసంరక్షణల కావశ్యకమైన శాసనములను లేక చట్టములను, విధి నిషేధ నియమాదులను నిర్మిం చుటయే యీశాసనసభల యొక్క ముఖ్యధర్మము. మన దేశములో పూర్వకాలమునందు సర్వసంగపరిత్యాగులై, పర్ణాని లోదకభక్షులై వనాశ్రమవాసులై యుండు మహాఋషులు లోకసంగ్రహార్థమై యీ కార్యమును గావించుచుండిరి. వీనికే స్మృతులనిపేరు. ఆ కాలపురాజుల కివియే శాసనములు. ఇప్పుడీ శాసననిర్మాణకార్య మును సాధారణముగా అన్నిదేశములలోను ఆయా దేశప్రజలు ఎన్నుకొనిపంపిన ప్రజాప్రతినిధులందరునుగలిసి వారి యిష్టమువచ్చి నట్లు జేసికొనుచున్నారు. ఈ ప్రజాప్రతినిధులందరును గలిసియున్న సంఘమునకే శాసననిర్మాణసభయని పేరు. ఈ సభకే వివిధదేశ ములలో వేరు వేరు పేర్లుగలవు. మనదేశములో శాసననిర్మాణ సభయందురు, ఇంగ్లాండులో పార్లమెంటుమహాసభ, జర్మనీలో 'రీచ్‌స్టాగ్' 'రష్యాలో' 'డీయిట్' అందురు.

## కార్యనిర్వాహకసభ.

ఈశాసనసభవారు నిర్ణయించిన చట్టమునో లేక తీర్మానము నో దేశమునందు కార్యరూపమున అమలులో బెట్టునధికారముగల

ప్రభుత్వోద్యోగ వర్గమునకు కార్య నిర్వాహకసభ అనిపేరు. దీనికే మంత్రాలోచన సంఘమనిగాని మంత్రివర్గమనిగాని లేక మఱియొకటిగాని ఒక్కొక దేశములో నొక్కొక పేరుగలదు. ఇంగ్లీషులో 'ఎక్సిక్యూటివ్ కౌన్సిలు' మొత్తమున దేశపరిపాలనా కార్యమునొనర్చు కార్యనిర్వాహకవర్గము సర్వవిషయములలోను శాసనసభవారికి లోబడి వారియాజ్ఞాను వర్తులైయుండవలయును.

## స్వరాజ్యమన నేమి?

దేశములోనిబహుజనాభిప్రాయానుసారముగా శాసనములను నిర్మించెడి ప్రజాప్రతినిధులతో గూడినశాసనసభయు, అట్టిశాసనసభాధికారమునకు సంపూర్ణముగలోబడి రాజ్యపరిపాలన మొనర్చు కార్యనిర్వాహక వర్గమును, ఏదేశమునందుండునో ఆదేశము స్వరాజ్యమనుభవించుచున్నదన్నమాట. ఈకాలపు రాజ్యాంగ సిద్ధాంతములను బట్టి స్వరాజ్యశబ్దమునకు సంగ్రహనిర్వచన మిదియే. మనదేశమునకు రాజకీయ స్వాతంత్ర్యము కావలెనని తెంటాలుజుత్తు సర్వపక్షముల వారియొక్క ఆదర్శము నిదియే. అయితే యీయాదర్శప్రాప్తికై యవలంబింప బడుచున్న మార్గవిధానములు మాత్రము భిన్నభిన్నముగానున్నవి. కడచిన యిరువదిసంవత్సరములనుండి బ్రిటిషుప్రభుత్వము వారొసంగుచు వచ్చినరాజ్యాంగ సంస్కరణలవలన మనదేశమునకు పైనవివరించిన స్వరాజ్యమెంత వరకు సిద్ధించినదో విచారించుకొందము. న్యాయమునకు మొదటిపని శాసనమునునిర్మించుట, రెండవది దానిని ఆచరణలో బెట్టుట. కాబట్టిశాసననిర్మాణసభ మొదటబుట్టిన తర్వాత కార్యనిర్వాహకసభ బుట్టియుండుననియు వారి యనుజ్ఞాధికారములతోనే వీరు పని జేయుచున్నారనియు సాధారణముగా మనమూహింతుము. కాని మనదేశములో మాత్రము దీనికితలక్రిందుగా మార్పులు జరుగుచున్నవి. అనగా కార్యనిర్వాహక వర్గమువారు శాసనసభ వారినడిగి తమయధికార స్వాతంత్ర్యములను వృద్ధి జేసికొనుటకు బదులు, శాసనసభవారే కార్యనిర్వాహక వర్గము

వారి గుమ్మముకడ నిలుచుండి దీనముగా తమకధికార స్వాతంత్ర్య ములనొసంగుడని వేడుకొనుచున్నారు. ఎవరియొద్దనుండి తమకధి కారములు కావలెనని మన శాసనసభవారు పెనగులాడుచున్నారో, ఆ కార్య నిర్వాహకవర్గము మీదనే వారిచ్చిన యధికార బలము తోనే పెత్తనము చలాయించవలెనని వీరి యుద్దేశ్యము. కార్య నిర్వాహక వర్గమువారు జుట్టువదలి కాళ్ళుపట్టుకొనే స్థితిలోనికి బుద్ధి పూర్వకముగా స్వప్రయత్నముతో రావలెనన్నమాట. ఇది కేవలము మానవ ప్రకృతికి విరుద్ధము. అందుచేతనే మనమెంత గందరగోళముచేసి గోలబెట్టినను, ఎప్పుడెవరే రాజ్యాంగ సంస్కరణములను బ్రిసాదించినను, దేశకాల పరిస్థితులను బట్టి తప్పనిసరిగా యొసంగి తీరవలసిన యవకాశములను మాత్రమే వీలైనంతతక్కువగా నొసంగి మొక్కు దీర్చుకొను చున్నారుగాని న్యాయ సూత్రముల ననుసరించి మనము పొందదగిన స్వాతంత్ర్యాధి కారములను బొందజాల కున్నాము.

## కంపెనీ హయాము

1757న సంవత్సరము వరకు నీదేశములో కంపెనీవారు కేవలము వర్తకమునే జేయుచుండిరి. అప్పటినుండియే యిచట వారు రాజ్య పరిపాలన జేయుటకుగూడ కొంచెముగా మొదలుబెట్టిరి. కంపెనీ వర్తకము నీదేశములో సాగించుచున్నవారి యేజంట్లకే కొన్ని విశేషాధికారముల నిచ్చి యింగ్లాండులోనున్న యాకంపెనీడైరక్టర్లు వీదోవిధముగా వారిద్వారానే స్వల్పముగానున్న రాజ్యపరిపాలనా కార్యమును గూడ నిర్వర్తించు కొనుచుండిరి. మద్రాసు, బొంబయి, కలకత్తా, ఇవిమూడును కంపెనీవారి ముఖ్య వర్తకస్థానములు. ఈ ప్రదేశము లందుండే వారి యేజంట్లలో నొక్కొక ముఖ్యుడు యా ప్రాంతములకు గవర్నరుగాను కంపెనీరాజ్య వ్యవహారములను బాగుగ నిర్వర్తించుటకై ముగ్గురునలుగురు సభ్యులుగల యొక మంత్రాలో చన సంఘము యాతనకు తోడుగా నుండునట్లు నేర్పాటుజేసిరి. ఇవియే

కాలక్రమమున గవర్నరు ఇన్ కౌన్సిలుగా (కార్యనిర్వాహక సభతో గూడిన రాష్ట్రాధిపతి) మారిపోయినవి.

అసలీ కంపెనీవారు మొట్టమొదట ఇంగ్లాండు గవర్నమెంటు వారియొద్దనుండి ఇండియా దేశవ్యాపారమును తామొక్కరే జేసి కొనునట్లు హక్కుపత్రకాలుదీసికొని తమ కంపెనీని ఆదేశములో రిజష్టరు జేసికొనివచ్చిరి. అందుచే నీకంపెనీ కీదేశములో రాజ్యపరిపాలనా బాధ్యత లభించినప్పుడు వారుదానిని సరిగా నిర్వర్తింపజేయవలసిన జవాబుదారియు, ఆవశ్యకతయు తమదేయని యింగ్లాండు గవర్నమెంటువారుభావించి క్రమ క్రమముగా కంపెనీవ్యవహారములలో జోక్యము కలిగించుకొనజొచ్చిరి.

1772 వ సంవత్సరములో బ్రిటిషు పార్లమెంటువారీవిషయమై 'రెగ్యులేటింగుఆక్టు' అనుపేర నొకచట్టమునుజేసిరి. దీనిప్రకారము కలకత్తాలోనుండు గవర్నరుగారే ఇండియాలోని కంపెనీవారి రాజ్యమునకెల్ల గవర్నరు జనరలుగానుండునట్లును మరి నలుగురు సభ్యులతోగూడిన మంత్రాలోచనసంఘమొకటి యీయనకు సహాయముగానుండునట్లును, తక్కిన బొంబాయి, మద్రాసుప్రాంతములందున్న గవర్నర్లును, వారి యాలోచనసభలును ఈ గవర్నరు జనరల్ గారి యధికారమునకులోబడి కంపెనీవ్యవహారములను పాలించు చుండునట్లును ప్రజలలో పరస్పరముగానుండు తగాదాలను కంపెనీ వారితో ప్రజలకుగలిగే లావాదేవీలను విచారించి పరిష్కారము జేయుటకై కలకత్తాలో నొక ఉత్తమన్యాయస్థానమును నెలకొల్పు నట్లును ఏర్పాటుగావించిరి. ఈ గవర్నర్లు గవర్నరుజనరలు, న్యాయస్థానాధిపతులు దప్పుజేసినయెడల వారినివిచారించి, శిక్షించేయధికారము ఇంగ్లాండులోని 'కింగ్సుబెంచి' అనే ముఖ్యన్యాయస్థానము నకుమాత్రమేగలదు. ఇదియే శాసననిర్మాణాధికారముగలిగియున్న ఇండియా కార్యనిర్వాహకసభయొక్క ప్రారంభచరిత్ర.

కంపెనీవారిచట జేయుచుండిన వర్తకవ్యాపారములును, రాజ్యపరిపాలనయు దరహాముమీద ఇంగ్లాండుదేశముయొక్క ప్రయోజనమునకును, ప్రతిష్ఠకును ముఖ్యముగా సంబంధించి యుండుటచే యింగ్లాండుపార్లమెంటువారే కంపెనీవారి చేతిలో నున్న యీ దేశపరిపాలనతో జోక్యముకల్పించుకొని పైనవివరించిన గవర్నరుజనరల్ గారికి శాసననిర్మాణా ద్యధికారముల నొసంగిరి. అనగా ఇండియాదేశపుప్రజలను పాలించుటకవసరమగు శాసనాదులనునిర్మించే యధికారమును ఇంగ్లండుప్రజలచే నెన్నుకొనబడిన పార్లమెంటుసభవారు తామిచటికిబంపే గవర్నరుకును, గవర్నరు జనరలుకును, ఒసంగుచున్నారు. మరింతవివులముగా దీని యర్థమేమంటే ఇంగ్లాండుప్రజల యిష్టప్రకారము వారి క్షేమలాభములకై యీ దేశపరిపాలన జరుగుచున్నది. ఇదియే శాసనపరాధీనతకు అంకురార్పణ. నేటికిని యీయాచారమే రూఢమైన సాంప్రదాయముగ, అనుల్లంఘనీయమైన శాస్త్రప్రమాణముగా నున్నది. 1772 వ సంవత్సరములో మనము నిద్రావస్థలో నున్నప్పుడు ఇంగ్లాండుప్రజలు వారికంపెనీపేరిట మెల్లగామనయొద్ద హరించిన మనజన్మహక్కును ఇప్పటికి మనముకన్నులుదెరచి తిరిగిపొంద జూచుచున్నాము. మన సంపాదనా ప్రయత్నము ఇంగ్లీషుప్రజలును వారి పార్లమెంటువారును చూచిచూచి యివ్వలేక యివ్వలేక అనేక అభ్యంతరములు జెప్పుచు, నానావిధములైన ప్రతీకారోపాయములను, ఉపసంహార మార్గములను కల్పించి, బంధించి శతాబ్దములు గడచినను సొంతముగాని వాయిదాలనేర్పరచి, తియ్యని ధర్మసిద్ధాంతములను ప్రకటించుచు నోటితో లేదనుటకు బదులు చేతితో లేదనుచు సక్రమానుగత రాజ్యాంగ సంస్కరణలని యొసంగుచుండిన మహోవరప్రసాదములివియే. ఈప్రయత్నములోవారు చతుర్విధోపాయముల నవలంబించి తమచే జిక్కినయధికారములను కాపాడుకొనుచు, మాహక్కులను మాకిచ్చివేయుడని గట్టిగానడిగినప్పుడు మనల రాజద్రోహులుగబట్టి

శిక్షింపుచుందురు. మావిమాకిచ్చుట మడిమాన్యములిచ్చుట యన్నట్లున్నది.

ఇండియా దేశమొత్తమునకు సంబంధించిన శాసనములను నిర్మించు మన ప్రస్తుతపు గవర్నరుజనరలుగారి ఇండియాశాసన నిర్మాణ సభ ఈ 1772 వ సంవత్సరముననే ప్రారంభమైనదన్నమాట. రాష్ట్రీయశాసనసభలు మాత్రమింతకు కొంచెము పూర్వమునుండియే ప్రారంభమయ్యెను- కానివీరెవరును పార్లమెంటువారి యధికారమునకుగాని, ఇంగ్లాండు శాసనములకుగాని, వ్యతిరేకముగ నేచట్టమును నిర్మించకూడదు. కంపెనీ వ్యవహారములను పాలించుటకు ఇండియాలో గవర్నర్లు, గవర్నరుజనరులు,గాక వీరందరిపైనను ఇంగ్లాండులో కంపెనీ భాగస్వాము లేర్పరుచుకొన్న కంపెనీడైరక్టర్లు అనే కార్యనిర్వాహక వర్గమొకటి యుండెను. ఇంగ్లాండు గవర్నమెంటువారు మొట్టమొదట కంపెనీవారికి మంజూరుజేసిన గుత్తకౌలు వరకపున్నదు కాలదోషముపట్టకుండా అప్పటికప్పుడు ప్రతిఇరువది సంవత్సరములకు నొకసారి కాలోచితమైన షరతులతో మార్పుజేసి తిరిగిమంజూరు పొందుచుండిరి.

1833 వ సంవత్సరములో ఇండియాగవర్నమెంటు ఆక్టు అను నొక చట్టమును బ్రిటీషుపార్లమెంటు వారు నిర్మించిరి. దీనిప్రకారము కంపెనీవారు ఇండియాలో సంపాదించినరాజ్యము ఇంగ్లాండురాజునకు జెందినదనియు, ఆయనకుగాను దానిని ప్రస్తుతము కంపెనీవారే తమస్వాధీన పరిపాలనములలో నుంచుకొనవలెననియు, పైనవివరించిన కంపెనీడైరక్టర్లుగాక బ్రిటిషుపార్లమెంటువారిచే నిర్ణయించబడిన కంట్రోలుబోర్డు అనునొక అజమాయిషీసంఘము ఇంగ్లాండులోనుండి బ్రిటిషుపార్లమెంటునకు జవాబుదారిగా కంపెనీవారియిండియా రాజ్యపరిపాలనమును సర్వాధికారములతో నడిపించుచుండవ

లెననియు శాసించిరి. ఈకంట్రోలుబోర్డే క్రమక్రమముగా నిప్పుడిం గ్లాండులో నున్న స్టేటుసెక్రటెరీగారి ఇండియా కౌన్సిలుగా మారిపోయి నది.

తరువాత 1858వ సంవత్సరములో మరియొక యిండియా గవర్నమెంటు ఆక్టు నిర్మింపబడినది. దీనిప్రకారము కంపెనీవారి పరిపాలనమును పూర్తిగా దీసివేసి అంతవరకును వారియాధీన భుక్తపరిపాలనలలో నున్న యిండియా రాజ్యమంతయు కంపెనీవారే శాసనములు, రాజ్యాంగవిధులు, షరతులు, ఇచ్చిపుచ్చుకొనే సకలమైన మర్యాద మామూళ్ళతో పాలించిరో ఆయా సర్వాధికారములతోను ఇంగ్లాండు రాణిగారే యిండియాకు చక్రవర్తినిగా నుండి పారంపర్య హక్కుతో ఇండియా దేశమును బ్రిటిషు సామ్రాజ్యములో గలిపికొని పాలించు నట్లేర్పాటు చేయబడెను. అప్పుడే ఇండియాదేశపు ఖర్చుతో 15మంది సభ్యులుగలిగిన ఇండియాకౌన్సిలు నేర్పాటుజేసి దీని కధ్యక్షుడుగా నొక స్టేటు సెక్రటరీ (రాజ్యాంగ మంత్రి)ని సర్వాధికార సమన్వితునిగానిర్మించిరి. ఈయనపైన బ్రిటీషుపార్లమెంటున కధికారము గలదుగాని అది కేవలము నామకార్థము.

పిదప 1861 వ సంవత్సరము ఆగస్టు 1వ తేదీని "ఇండియన్ కౌన్సిలు ఆక్టు" అనునదివచ్చెను. ఇంతవరకును శాసననిర్మాణ కార్యనిర్వాహక కార్యములు రెండును ఒక్కకౌన్సిలే జేయుచుండెను. శాసన నిర్మాణమును కార్య నిర్వాహకమునుండి వేరుగా జేయుటకిదియే మొదలు. ఈచట్టము ప్రకారము గవర్నరు జనరలుగా,

రికౌన్సిలులో అయిదుమంది సభ్యులుండవలెను. వీరిలో ముగ్గురు సభ్యులగుటకుముందు కనీసము పదేండ్లు ఈదేశములో ఇంగ్లీషుప్రభుత్వముక్రింద నుద్యోగముజేసిన వారైయుండవలెను. మిగిలినయిద్దరిలో నొకరు ధర్మశాస్త్రపండితుడగు బారిస్టరుగాను, రెండవవాడు సైన్యాధిపతిగా నుండవలెను. వీరే యీదేశమును పాలించు ఇండియాగవర్నమెంటు. ఇదియే మన ప్రస్తుతపు గవర్నరు జనరల్ గారి కార్యనిర్వాహకసభ. ఈ గవర్నరుజనరలుగారు, పైన చెప్పిన్న కార్యనిర్వాహకసభ్యులునుగాక శాసననిర్మాణకార్యమునందుమాత్రమే సహాయముగానుండుటకై ఆరుమందికి తక్కువగాకుండాను, పన్నెండుమందికి మించకుండాను తన యిష్టప్రకారము అధికముగా సభ్యులనునియోజించుకొని శాసనసభ నేర్పాటు జేయును. వీరికొక్క శాసననిర్మాణకార్యమునందే సంబంధము గలదు. వీరిలో సగముమందికి తక్కువలేకుండా అనుద్యోగులు (అనగా ప్రభుత్వోగములో లేనివారు) గానుండవలెను. ఈ శాసనసభ్యులెవరును ముందుగా గవర్నరుజనరలుగారి యనుమతి వడయకుండా నీక్రిందివిషయములనుగూర్చి తీర్మానముగాని, చట్టముగాని సభవారివిచారణకే దీసికొనిరాకూడదు.

(i) ఇండియాదేశమునకుగాని లేక దేశాదాయమునకు గాని సబంధించినవి.

(ii) ఇండియాదేశ ప్రజలమతమునకుగాని, మత స్వాతంత్ర్యమునకుగాని సంబంధించినవి.

(iii) ప్రభుత్వమువారి నావికాదళమునకు, సైన్యమునకు సంబంధించినవి.

(iv) విదేశరాజ్యములతో సంబంధించినవి.

అత్యవసరసందర్భములలో గవర్నరు జనరలుగారొక్కరే శాసనతుల్య ప్రమాణముగానుండు ఉత్తరువులను జారీచేయవచ్చును.

తరువాత ఈ కౌన్సిలునుగూర్చి 1865; 1869; 1870; 1871 1874; 1876; సంవత్సరములలో అప్పటప్పటికి కాలోచితముగ నావశ్యకమని తోచినమార్పులను విశేషాధికారములను గలిగించుచు కొన్ని చట్టములు నిర్మించబడినవి.

1892 వ సంవత్సరములో వచ్చిన ఇండియన్ కౌన్సిల్సుఆక్టు ప్రకారము గవర్నరుజనరలుగారి శాసనసభాసభ్యులు పదిమందికి తక్కువగాకుండగను, 16 మందికి మించకుండగను అవసరమునుబట్టి గవర్నరుజనరల్‌గారిచే నియోజింపబడవలెను. బొంబాయి, మద్రాసులలోని రాష్ట్రీయశాసనసభలకు 8 మందికి తక్కువలేకుండ, 20 మంది కెక్కువలేకుండగను అవసరమునుబట్టి ఆయా గవర్నర్లే నియమించుకొనవలెను. 1909 వ సం॥ లో మార్లేగారి సంస్కరణములు వచ్చేవరకు శాసనసభలలో శాస్త్రమునకైనను ప్రజాప్రతినిధులనదగిన యెన్నికసభ్యు లొక్కరునులేరు. అందరును ఉద్యోగులుగాని, అనుద్యోగులుగాని ప్రభుత్వనియోజితసభ్యులే. శాసనసభలలోనికి యెన్నికసభ్యులు స్వల్పసంఖ్యాకులుగానైన వెళ్లుటకు ప్రారంభించినది మార్లేసంస్కరణములు వచ్చినతర్వాతనే. అప్పుడైనను శాసనసభ్యులలో బహుజనులు ప్రభుత్వనియోజితులు.

## 1909 సంవత్సరపు మార్లెసంస్కరణములు

ఇండియాదేశపరిపాలనలో నేకొలదిగనో ప్రజాపక్షానుకూలమైన మార్పులప్పుడప్పుడు జరుగుచునేయున్నవి. కాని యెప్పుడేమార్పులు జేసినను, ఏతప్పులు సవరించుకొన్నను, దేశములో ప్రజలుగావించు ఆందోళనాద్యాటములకు లొంగిగాని, లేక ఇంగ్లాండు పార్లమెంటువారి వత్తిడివలనగాని, జేసినట్లు గవర్నమెంటువా రెప్పుడు నొప్పుకొనరు. ఇది వారిరాజనీతికిని, సాంప్రదాయాచారమునకును, కేవలము విరుద్ధము. అందుచేతనే యెప్పుడెక్కడేమి జరిగినను తమ నిర్హేతుక

జాయమానకటాక్ష వీక్షణముచే జరిగినట్లే భావించి ప్రకటించుకొనుట వారికి మామూలైనది.

1904 వ సంవత్సరములో కర్జనుప్రభువు మనకు వైసురాయిగానున్నపుడు ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగా బంగాళారాష్ట్ర విభజన జరిగినది. అందుమీద వంగదేశవాసులకు గలిగిన చిత్తసంక్షోభము వర్ణనాతీతము. ఇప్పుడు దేశమునందు నానాటికి విజృంభించుచున్న నూతన జాతీయోద్యమమున కిదియే ప్రారంభము. ఈబంగాళ విభజన కేవలమొక్క రాష్ట్రమునకు జెందిన దైనప్పటికిని అఖిల భారతదేశీయ విషయముగా మారి, దేశమునందెల్ల మహాందోళన జరిగినది. ప్రజాభీష్టమునకు విరుద్ధముగా దేశపరిపాలన జరుగుట యక్రమమని యెంచి ఈవిధానమును మార్పించుటకై ప్రజలు నానావిధముల గందరగోళము జేయుజొచ్చిరి.

తరువాత 1906 వ సంవత్సరమున కలకత్తాలో జరిగిన దేశీయమహాజన సభలో భారత పితామహుడు దాదాభాయి నౌరోజి స్వరాజ్య సంపాదనమె కాంగ్రెసుయొక్క పరమలక్ష్యమని శంఖనాదము జేసెను. ఇందుకు స్వదేశీవ్రతము అనగా స్వదేశవస్తు స్వీకరణదీక్ష, విదేశవస్తు బహిష్కారము, జాతీయవిద్య, అను వానిని సాధనములుగా గైకొని మహోత్సాహముతో దేశమందెల్ల నాందోళన గావించిరి.

అసహాయోద్యమములో స్వరాజ్యప్రాప్తికై మనమిప్పుడవలంబించుచున్న, ఖద్దరు వస్త్రధారణ, సర్కారుపాఠశాలల బహిష్కారము, మున్నగువాని మూలబీజములప్పుడే యస్పష్టముగా నంకురించినవి.

ఈప్రకారమప్పుడు బయలుదేరిన యాందోళనకు ఫలితముగా, గవర్నమెంటువారు క్రూరశాసనములను నిర్మించి ప్రయోగించిదారుణ శిక్షలచే నీజాతీయోద్యమమును నణచివేయుబూనిరి. అందుమీద

బ్రిటిషు జాతియొక్క న్యాయబుద్ధియందు విశ్వాసము క్షీణించి సక్రమ ప్రయత్నములచే లాభములేదని నిరాశజెందిన దేశీయయువకులు పెడత్రోవలనుబట్టి యక్రమమైన అరాచకపు సంఘములుగా గూడి, బాంబు ప్రయోగములు, దోపిడీలు, నరహత్యలు, మున్నగు దారుణకృత్యములకు గడంగిరి. ఆసందర్భములో నెందరో కారాగృహముల కేగిరి. ఆస్తినిగోల్పోయిరి. ద్వీపాంతరవాసములు, ఉరిశిక్షలు, మొదలైన మితిలేని కష్టములకు పాల్పైరి. బంగాళ విభజనసేయుట తప్పని తెలిసి యొప్పుకొన్న తరువాతగూడ దానినిదిద్దుకొనుట తమ ప్రతిష్టకు భంగకరమనియెంచి చాలకాలముగడపి, తుదకు1912వసంవత్సరమున ఢిల్లీలో జరిగిన చక్రవర్తిగారి పట్టాభిషేకమహోత్సవసమయమున దేశమునకొసంగిన మహావరప్రసాదముగా దానినిరద్దుజేయించిరి. 1905—1906 వ సంవత్సరములనుండి దేశములోజరిగిన ఆందోళమునకు ఫలితముగా నొకవైపున తమప్రభుత్వాధికార ప్రదర్శనముగా క్రూరశాసన ప్రయోగమును, రెండవవైపున తమఅవ్యాజానుగ్రహ సూచకముగా రాజ్యాంగ సంస్కరణములను 1909వ సంవత్సరములో నొసంగిరి. ఇవియే మార్లే సంస్కరణలు వీనివలన రాజ్యాంగములో జరిగినమార్పుల నీక్రింద సంగ్రహముగా వ్రాయుచున్నాము.

ఇండియాలోనున్న వైసురాయిగారును, ఇంగ్లాండులోని స్టేటు సెక్రటరీ (మార్లే) గారును యిండియాదేశ పరిపాలనలో జరుగవలసిన మార్పులనుగూర్చి ఉత్తర ప్రత్యుత్తరములు మూడు సంవత్సరములు హోరాహోరిగా జరుపుకొన్నతరువాత తుదకు 1909 వ సంవత్సరము నవంబరు 16వ తేదీని గావించిన ఇండియా గవర్నమెంటువారి తీర్మానముతో 1909వ సంవత్సరపు ఇండియన్ కౌన్సిల్సు ఆక్టు అనుమార్లే సంస్కరణము లీదేశమున అమలు జరుగ నారంభించెను. దీనిప్రకారము శాసనసభా నిర్మాణములో జరిగిన మార్పులీ క్రింది పట్టికవలన దెలియనగును. రాష్ట్రీయ శాసనసభలకు రాష్ట్రాధిప

తులుగానున్న గవర్నరు, లెఫ్టినెంటు గవర్నర్లును. సామ్రాజ్య (యిండియా) శాసనసభకు గవర్నరు జనరలును సభాధ్యక్షత వహించుచుండిరి. వీరును వీరి గార్యనిర్వాహక సభ్యులును తమయుద్యోగ ధర్మమును బట్టియే శాసన సభ్యులగుదురు. వీరినే ఎక్సఫిషి. యో మెంబర్లనిగాని ఉద్యోగరీత్యా సభ్యులనిగాని చెప్పుదురు. వీరు గాక ప్రత్యేకముగా కేవలము శాసననిర్మాణ కార్యములో దోడ్పడుటకై జేర్చుకొనబడువారు ఉద్యోగులుగాని, యనుద్యోగులుగాని, యెన్నిక సభ్యులుగాని, నియోజిత సభ్యులుగాని, మొత్తమున అధికసభ్యులు అనబడుదురు. అనగావీరికి కార్యనిర్వాహకముతో పనిలేదు. కేవలము శాసన నిర్మాణములో దోడ్పడుటకే అధికముగా జేర్చుకొనబడినవారు.

| | ఉద్యోగ రీత్యా సభ్యులు | అధిక సభ్యులు | వీరిలో యెన్నిక సభ్యులు | ఉద్యోగ నియోజితులు | అనుద్యోగ నియోజితులు | మొత్తం సభ్యులు |
|---|---|---|---|---|---|---|
| 1. ఇండియా శాసనసభలో | 8 | 60 | (27 | 28 | 5) | 68 |
| 2. మద్రాసు శాసనసభ | 4 | 45 | (21 | 17 | 7) | 49 |
| 3. బొంబాయి | 4 | 45 | (21 | 15 | 9) | 49 |
| 4. బంగాళము | 4 | 50 | (28 | 16 | 6) | 54 |
| 5. బీహారు | 4 | 41 | (21 | 15 | 5) | 45 |
| 6. యూ.పి. లేక ఆగ్రా, అయోధ్యా, పరగణాలు | 1 | 49 | (21 | 20 | 8) | 50 |
| 7. పంజాబు | 1 | 26 | (8 | 10 | 8) | 27 |
| 8. బర్మా | 1 | 17 | (1 | 6 | 10) | 18 |
| 9. అస్సాము | 1 | 25 | (11 | 9 | 5) | 26 |

1909 సం॥ పు మార్లే సంస్కరణములవలన యిండియా శాసనసభలోను, వివిధ రాష్ట్రములయొక్క రాష్ట్రీయ శాసనసభలలోను

గల్పించిన ప్రజాప్రాతి నిధ్యముయొక్క వివరముల నీపట్టికవలన దెలి యనగును. ఈయేర్పాటు 1920 వ సంవత్సరాంతమువరకు అమలులో నుండెను.

ఈపైపట్టికనించుక పరీక్షించిన యెడల గవర్నరు జనరలుగారి యుండి కూడా శాసనసభలో అనుద్యోగులకంటె ఉద్యోగసభ్యులే అధి క సంఖ్యాకులుగా నుండునట్లును, తక్కిన రాష్ట్రీయ శాసనసభ లలో అనుద్యోగు లధికసంఖ్యాకులుగానుండునట్లును, ఏర్పాటుజేసిరి. అనుద్యోగులంటే వారందరును, ఎన్నికసభ్యులని పాఠకులు పొరబడ రాదు. అసలు శాసనసభలలోనికి ఎన్నికసభ్యులను జేర్చుటకిదియే ప్రారంభము. అన్ని శాసన సభలలోను నియోజిత సభ్యులే అధిక సంఖ్యాకులు.

ఈలక్కగేదె యొకవేళ త్రెంచుకొనిపోయి యెప్పుడే యుప కారము జేయునోయని దాని నినుపగొలుసులతో బంధించి దొడ్డిచు ట్టును బ్రహ్మాండమైన కొండరాతిగోడను నిర్మించి బందోబస్తుగా తాళమువేసి సాయుధపాణులైన మొనగాండ్రి నేమరకుండునట్లు కా వలి యుంచిరి.

శాసనసభలలో ప్రభుత్వమునకు వ్యతిరేకముగా ప్రజాభి ప్రాయము సాగుటకే యెంతమాత్రము నవకాశములేదు. అట్టిశాసన సభా తీర్మానము కార్యనిర్వాహక వర్గమునకు కేవలము సలహాప్రా యమేగాని వారుదాని నమలు జరుపుటకే విధమైన నిర్బంధమును లేదు. కార్యనిర్వాక వర్గమునుగూడ ధిక్కరించి రాష్ట్రాధిపతిగాని, గవర్నరుజనరలుగాని తన యసాధారణాధికారమును వినియోగించి వారి తీర్మానము నొక్కపెట్టున త్రోసివేసి తన యిష్టప్రకారము పరిపాలన సాగించవచ్చును. దీనికే "వీటో" యధికారమని పేరు. వీరి నిర్ణయమునుగూడ రద్దుచేయుటకు చక్రవర్తిగారి కధికారము గలదు శాసనసభ లీ ప్రకార మష్టదిగ్బంధన గావింపడినవి.

## II అధ్యాయము.

### శాసన సభ్యులు

ఈ శాసనసభలలో నుండు సభ్యులు రెండువిధములు. ఒకటి నియోజితసభ్యులు రెండు ఎన్నికసభ్యులు, వీరిలో, యోజితసభ్యులను గవర్నమెంటే నియమించుచుందురు. ఈనియోజితులలోనే మూడంతర్భాగములు గలవు. నియోజితులు :—

(i) ఉద్యోగ రీత్యాసభ్యులు. (ఎక్సఫీషియో మెంబర్లు) వీరొక యుద్యోగములో నున్నందుచేతనే యాశాసన సభ్యులగుదురు. వీరిని ప్రభుత్వమువారు గూడ వేరే యిందు కొరకు నియమించ నక్కర లేదు.

(ii) ఉద్యోగ నియోజితులు (అఫీషల్ నామినేటెడ్ మెంబర్లు) గవర్నమెంటువారు తమ ఉద్యోగస్థులలో నుండి వీరిని ప్రత్యేకముగా నియమించు కొందురు

(iii) అనుద్యోగ నియోజితులు (నాన్ అఫీషియల్ నామినేటెడ్ మెంబర్లు) వీరు సర్కారుద్యోగులుకారు. కాని వీరు ప్రజలలో మోతుబరులు, పలుకుబడి గలవారు, గవర్నమెంటు ప్రాపకము మెుగ మోటమి నాశ్రయించు వారు నయియుందురు. తమకు లోకువగా నుండువారినే యేరి గవర్నమెంటువారిట్లు నియోజించు కొందురు. పేరునకు మాత్రము వీరు ప్రజలలోనివారుగాని, యదార్థమునకు గవర్నమెంటునకువ్యతిరేకముగా వీరెన్నడును చేయియెత్తజాలరు. ఈపైన వివరించిన మూడుతరగతుల వారును గవర్నమెంటు పక్షములోనివారే.

### ఎన్నిక సభ్యులు

ప్రజలచే నెన్నుకొనబడినవారికి ఎన్నిక సభ్యులు లేక (ఎలెక్టెడ్ మెంబర్లు) అనిపేరు. వీరందరు న్యాయమున కెప్పుడును ప్రజాపక్షముననే యుండవలెను. ఎన్నిక సమయములలో వీరందరు నిర్భ

యముగా ప్రజాపక్షముననే యుందుమని చెప్పి ప్రజలను నమ్మింతురు కాని, కౌన్సిలుకు వెళ్ళిన తోడనే వీరిలో జాలమంది స్వలాభాపేక్షతోనో, ధైర్యము లేకనో, గవర్నరుగారిని జూచి మోమోడియో, తెలివితక్కువ చేతనో, దేశముయొక్క ప్రారబ్ధముచేతనో, మరి యేకారణముచేతనో గాని, తరుచుగా సందిగ్ధ సమయములలో గవర్నమెంటు పక్షముననే జారిపోవుదురు. లేదా తటస్థులుగా నుందురు. ఈ రెండును ప్రజాపక్షమునకు నష్టములే గదా! మరి యునొక్కొక్కప్పుడు వీరు అనివార్యముగానో బుద్ధిపూర్వకముగానో క్లిష్టసందర్భములలో సభలకే హాజరుగాక పోవచ్చును. ఇదియొక నష్టము. ఈ యెన్నిక సభ్యులలో ఇంగ్లీషు వర్తకసంఘముల తరఫున వచ్చేవారు, ఐరోపియనుల ప్రతినిధులు, క్రైస్తవుల ప్రతినిధులు, జమీందార్ల ప్రతినిధులు, కాఫీ తేయాకు తోటలప్రతినిధులు, మున్నగువారు గొందరు సాధారణముగా నెప్పుడును గవర్నమెంటుపక్షముననే యుండి కొన్ని స్వల్పమైన ప్రత్యేకసౌకర్య ప్రయోజనములను బొందుచుందురు.

ఇట్టి కారణములవలన శాసనసభలలో ప్రభుత్వనియోజిత సభ్యులకంటె ప్రజాప్రతినిధి సభ్యులెన్నిరెట్లో యెక్కువమంది యుండిననేగాని, వివాదగ్రస్థమగు చిక్కుసందర్భములలో ప్రభుత్వవాదమును ధైర్యముతో ప్రతిఘటించి ప్రజాపక్షమును నెగ్గించుటకు వీలుండదు.

రాజకీయ స్వాతంత్ర్యమునకై మన మాందోళన జేసినప్పుడెల్ల మనవారు చల్లార్పుటకై ప్రభుత్వమువారు మనముందర నేదో యొక యాటబొమ్మనుబడవేయుట, దానితో మన పెద్దలు కొంత కాలమాడుకొనుచు కాలక్షేపము జేయుట మామూలైనది.

ఇదివరకిచ్చిన అన్ని బొమ్మలకంటె నీసారిదిమిక్కిలిచిత్రమైనది. కరచరణాద్యవయవనిర్మాణము రెంటికినిసమానమే. మునుపటిది కేవలము మొద్దుబొమ్మ. ఇప్పటిది యొకచోటనొక్కినచో యెరిగి

పడే కీలుబొమ్మ. రెంటికిని జీవములేదు. రెండును ఆటబొమ్మలే. కాని రెండవది దాని మరకీలువలన సజీవమని భ్రమపెట్టు చుండును. ఈ వివరములు మాంటాగ్యూసంస్కరణములను, ఆచరణలో గన్పించిన వాని ప్రయోజనములను, బరిశీలించినతర్వాత మరింత స్పష్టముగా ధృవపడగలవు.

మాంటాగ్యూసంస్కరణములకు పార్లమెంటువారి యుపోద్ఘాతము:-

( 23 డిసెంబరు 1919. )

"ఇండియాదేశపు పరిపాలనా శాఖలన్నిటిలోను ఇండియనుల నెక్కువగా జేర్చుకొనుచుండవలెననియు, బ్రిటిషుసామ్రాజ్యములో ప్రధానభాగముగానున్న బ్రిటిషుఇండియాలో క్రమానుగతముగా బాధ్యతాయుత ప్రభుత్వమును నెలకొల్పుటకై స్వపరిపాలనాసంస్కరణాలను నానాటికి వృద్ధిజేయవలయుననియు, స్పష్టముగా పార్లమెంటువారు ప్రకటించినారు.

ఈయుద్దేశ్యము క్రమముగా నెరవేరుటకై యిప్పుడే యిందుకు దగినపద్ధతులను ప్రారంభించవలెను.

ఇండియా దేశస్థుల క్షేమాభివృద్ధులకు బాధ్యులైయున్న బ్రిటీషుపార్లమెంటువారే ఎప్పటికప్పుడు దీనియభివృద్ధి క్రమములను నిర్ణయించుచుండవలయును.

ఇప్పుడు క్రొత్తగా దేశపరిపాలనోద్యోగములు లభించినవారొసంగెడి సహకారమునుబట్టియు, వారిబాధ్యతాజ్ఞానమునందు పార్లమెంటువారికి గలిగే నమ్మకమునుబట్టియు, పార్లమెంటువారీనిర్ణయమును జేయుచుందురు.

స్వపరిపాలనాసంస్థల క్రమాభివృద్ధి కనుగుణ్యముగా ఇండియా దేశములోని నానారాష్ట్రపరిపాలనా విషయములలో వీలైనంతయెక్కువ స్వాతంత్ర్యము నొసంగుట సమంజసము.

కాబట్టి బ్రిటీషుపార్లమెంటులో సమావేశమైన (ప్రభువర్గ ప్రజాప్రతినిధివర్గములు) ఉభయవర్గములయొక్క సలహాతోను ఆమోదముతోను చక్రవర్తిగారిక్రింది చట్టమును శాసించుచున్నారు."

ఇండియాదేశ పరిపాలన రెండుభాగములు. ఇండియా ప్రభుత్వము. రాష్ట్రీయప్రభుత్వములు. ఇప్పుడు యిండియాదేశమునెల్ల యెనిమిది ముఖ్యరాష్ట్రములుగా విభజించిరి- 1 మద్రాసు లేక చెన్నపురి 2 బొంబాయి 3 బంగాళము 4 సంయుక్త పరగణాలు 5 పంజాబు 6 బీహారు ఒరిస్సా, 7 మధ్యపరగణాలు 8 అస్సాము. ఇందు మొదటి రెంటికిని రాజధానులని పేరు. తక్కినవానికి రాష్ట్రములని పేరు, రాష్ట్రముకంటె రాజధాని కొంచెము పెద్దది. ఈయెనిమిది రాష్ట్రములకు నధిపతులుగా ఎనిమిదిమంది గవర్నర్లుగలరు. ప్రతి రాష్ట్రమునకు వేరువిడిగా ఒక కార్యనిర్వాహక సభ లేక (ఎక్సిక్యూటివ్ కౌన్సిలు) ఒకమంత్రివర్గము, ఒక శాసనసభయు గలవు. రాష్ట్రాధిపతియైన గవర్నరు తనరాష్ట్ర పరిపాలనలో గొంతభాగమును కార్యనిర్వాహక సంఘము వారి సహాయముతోను మిగిలిన కొంతభాగమును మంత్రివర్గ సహాయముతోను పాలించుచున్నాడు. అనగా రాష్ట్రపాలనకు సంబంధించిన పరిపాలనా శాఖలలో (డిపార్టుమెంటులు) ఎక్కువ బాధ్యతాను భవములతో నిర్వహించవలసిన ప్రధాన శాఖలను కార్యనిర్వాహక సంఘము చేతిలోనుంచి, మిగిలిన వానిని మంత్రివర్గము పరముజేసిరి. ప్రతిరాష్ట్రమునకు ప్రజాప్రతినిధులతోను నియోజిత సభ్యులతోను గూడిన శాసనసభ యొకటి గలదు. ఇందు కార్యనిర్వాహక సభ్యులుగూడ జేరియుందురు. గవర్నరుగారు మాత్రమిందు సభ్యుడుగాడు. కాని ఆయన యీసభ్యులనెల్ల రావించి లేక సమావేశపరచి వారితో మాట్లాడే యధికారముగలదు. ప్రతిరాష్ట్రీయ శాసనసభలో నుండవలసిన సభ్యుల వివరము నీక్రింది పట్టికవలన దెలిసికోనగును. ఏరాష్ట్రములోనైనా అచటి శాసన సభ్యులయొక్క మొత్తముసంఖ్యలో నూటికి ఇరువది

మందిచొప్పునకంటె నెక్కువగా ఉద్యోగు(official members) లుండరాదు. కనీసమునూటికి డెబ్బదిమందికి తక్కువలేకుండా యెన్నిక సభ్యులుండి తీరవలెను. ఈపై దామాయిషా నియమమునకు భంగములేకుండా యేశాసనసభా సభ్యులసంఖ్యనైన వృద్ధి జేయవచ్చును.

ఈమొదలైన వివరములన్నియు యిండియా గవర్నమెంటు ఆక్టులోను, దానికి సంబంధించిన నియమములలోను సవిస్తరముగా దెలియగలవు.

రాష్ట్రప్రభుత్వముయొక్క యధికారములో నున్న యీ చివర నుదహరించబడిన కొన్ని పరిపాలనా శాఖలను వేఱుజేసి మంత్రుల యధీనములో నుంచిరి. ప్రజలచే బంపబడిన యెన్నికసభ్యులలోనుండి యీ మంత్రులను గవర్నరుగారు నియోజించుకొందురు. ఈమంత్రులు తమయధీనము చేయబడిన శాఖలయొక్క పరిపాలన విషయములో శాసనసభవారికి బాధ్యులై యుండవలెను. ఈపరిపాలనా శాఖలకే ప్రజాయత్త శాఖలని (Transferred subjects) పేరు. ఈ ప్రజాయత్త శాఖలుగాక మిగిలిన ముఖ్యమైన శాఖలన్నియు కార్య నిర్వాహకవర్గము (Executive Council) వారియధీనములోనే యుంచుకొనిరి. వీని పరిపాలనపై శాసనసభ్యులకేమియు పెత్తనములేదు. రాష్ట్రముయొక్క ఆదాయమంతయు కార్య నిర్వాహక వర్గములోని గవర్నమెంటువారి ఆర్థికసభ్యుని (Finance member) యాధీనములో నుండును. ఆయనయే రాష్ట్రమునకు కోశాధిపతి. పోనీ ఈప్రజాయత్త శాఖలపరిపాలన కావశ్యకమైనధనమునైన సమృద్ధిగ నొసంగిరేమో యనుకొంటే యదియును సున్నయే. కార్యనిర్వాహక వర్గమువారు రాష్ట్రాదాయములో నుండి తమ శాఖలకు గావలసిన ధనమును తీసికోగా మిగిలిన యేస్వల్పమునో ఈప్రజాయత్త శాఖల కొసంగుచుందురు. ఎప్పటికప్పుడు మంత్రులు కార్యనిర్వాహక సభ్యులను మంచిమాట జేసికొని వారి యెడల యనువర్తనగా ప్రవర్తించి తమకుగావలసిన డబ్బును వీరై

నంతవరకు నుపాయముగ లాగికొను చుండవలయును. లేదాప్రజలపై శాసనసభ్యుల ద్వారా క్రొత్తపన్నులను విధించుకొనవలెను. కార్యనిర్వాహక సభ్యులకును వీరికిని యేకారణము చేతనైన మాట పొసగని యెడల మంత్రుల యధికారములును, ప్రజాయత్త శాఖల పరిపాలనమును బిసిమిల్లా యగును. ఎప్పటికప్పుడొక గృహములో సవతులుగానుండు నీరెండు వర్గములకును సంఘర్షణ రాకుండ సఖ్యతగా కూడదీసికొనివచ్చు భారము గృహ యజమానియైన గవర్నరుగారి నెత్తిపైననుండును. మంత్రివర్గము కార్యనిర్వాహక వర్గముకంటె దశిమిలాను పుట్టినప్పటికిని ఆమంత్రివర్గమే గవర్నరుగారికి లోకువైన నోరులేని పెద్దభార్యగను, ఆయననే బెదిరించి స్వాధీనము జేసికొనగల కార్యనిర్వాహక వర్గము గడసరియైన గయ్యాళిచిన్న భార్యగనున్నవి. అందుచే సాధారణముగ గవర్నరుగా రెప్పుడును చిన్నభార్య చెప్పినట్లే పెద్దభార్యచే వినిపించుచుండును. ఖజానా పెట్టె తాళపుచెవి చిన్నభార్య చేతిలోనేయుండును. ఇదియే ద్వంద పరిపాలన, ఇదియే రాష్ట్రీయ ప్రభుత్వములో ప్రారంభించబడిన బాధ్యతాయుత స్వపరిపాలనము. ఇదే వాయిదాబందీ స్వరాజ్య విధానములో మనకు బజానాగా యిచ్చిన మొదటికిస్తీ వసూలు. ఈ విధానముయొక్క యసందర్భమును జాతీయ వాదులప్పుడే తూర్పువాత బట్టిరి. వారినప్పుడు సహనములేని యసంతుష్టిపరులనియు, అసాధ్యమైన యాదర్శవాదులనియు, అనుభవ జ్ఞానశూన్యులైన యాందోళనా పరులనియు, చిలవలుపలవలుగ నెవరినోటికి వచ్చినట్లు వారు ప్రభుత్వోద్యోగులేమి, ఆంగ్లో యిండియనులేమి, మితవాద ప్రముఖులేమి వర్ణించుచు నిరసించిరి. ఈవిషయములోనే గాదు ఏసందర్భములోనైన జాతీయవాదులను, వారికార్య విధానములను ఖండించు విషయములో నీపైన బేర్కొన్న మూడు తెగలవారును కంఠస్వరభేదముతో నొకటే తాళములో నొకటే రాగమును పాడుచుందురు. స్థాయిలో హెచ్చుతగ్గు లుండవచ్చును;

బ్రయోగించిన సంగతులలో భేదముండవచ్చును. కాని ముత్త ముమీద వీరు మువ్వురును పాడేరాగ మొక్కటియే. ఎంత దూరమోపోనేల? నిన్నగాక మొన్న యెస్సెంబ్లీ సమావేశములో లజపతిరాయి, గాంధి మహాత్ముడు, మున్నగువారిని కారాగృహ ములనుండి విడుదలజేయు విషయము చర్చించబడినపుడు తీర్మాన మున కనుకూలముగ మాట్లాడిన శేషగిరి అయ్యర్ గారివంటి మిత వాదులేమి, ప్రతికూలురుగానున్న ఉద్యోగులును ఆంగ్లోయిండియను లేమి యొక్కధోరణిలోనే ప్రసంగించిరి. అసహాయోద్యమము దేశా రిష్టదాయకమైనదనుటలో వీరికి భేదాభిప్రాయములేదు. అదియిపు డంతరించినది గనుక వీరిని విడుదల చేయవచ్చునని యొకరివాదన, లేదు సజీవముతోనే యున్నది గనుక మరలవిజృంభించునేమో యను భయముతో వీరిని విడుదలకుకూడదనుట తక్కినవారివాదన. జాతీ యవాదులకు సంబంధించిన ప్రతివిషయములోను యీసిద్ధాంతమే రుజువగుచుండును. ఇంక యిండియాప్రభుత్వములో మునుపటికంటె నిపుడు శాసనసభ్యులసంఖ్య వృద్ధియైనది, ప్రజాప్రతినిధులెక్కువగా నుండిరి. శాసనసభలొకటికి రెండై యొకదానికొకటి కక్కుల కళ్లెముగానున్నది. కార్యనిర్వాహకసభలో నొకరికి ముగ్గురు భారతీ యసభ్యులు చేర్చుకొనబడిరి. శాసనసభలకు కార్యనిర్వాహకవర్గ ముపై నెట్టి నిర్బంధాధికారమును లేదు. శాసనసభల తీర్మానములను కార్యనిర్వాహకవర్గమువారిప్పటికిని సలహాప్రాయముగను, సిఫార్సు లుగను, భావింతురేగాని అనుల్లంఘనీయమైన విధివాక్యముగ నెంచు కొనరు. దీనిచే మునుపటికంటె నిపుడు పరిపాలనావ్యయమధికమగు టయు సభాచర్చలయొక్క గ్రంథము పెరుగుటయు మాత్రమేగాని నింకేమియు నిజమైన స్వాతంత్ర్యమును దేశీయులకు వచ్చుటకైన లభించియుండలేదు.

శాసనసభలలో ప్రశ్నలువేయు నధికార మిదివరకేగలదు. కాని యిప్పుడొక ప్రశ్నకు సంబంధించిన యనుబంధప్రశ్నలనుకూడ

నడుగవచ్చును ప్రజాయత్త శాఖలలోనైనను, కొన్నిడిపార్టుమెంటులనే ప్రత్యేకముగా మంత్రుల కధీనముజేసిరిగాని వానికధిపతులుగా నుండు ఉద్యోగులమీాద మంత్రుల కధికారమురాలేదు. అనగా మంత్రులేయుద్యోగులద్వారా తమశాఖలను పరిపాలించుకొనవలెనో ఆయుద్యోగుల జీతములు పింఛనులు వారినుద్యోగమునుండి తొలగించుట, మున్నగు వానిపై మంత్రులకేమియు పెత్తనమురాలేదు. పరిపాలనా యంత్రములోని కొన్నిభాగములు మాత్రమే మనమంత్రులచేతిలోనికి వచ్చినవిగాని వానిని నడుపు మనుష్యులు మాత్రము వీరికింకను స్వాధీనముకాలేదు. ఉదాహరణమునకు ఒక జిల్లాలోని అన్నిశాఖల పరిపాలనకును జిల్లాకలెక్టరే బాధ్యతగల యుద్యోగి. అతనిపై మంత్రులకేమియు పెత్తనములేదు

కార్యనిర్వాహక సభ్యులకును మంత్రులకును చేతిక్రింద ఆయాపరిపాలనాశాఖలకు సంబంధించిన కార్యదర్శులును (సెక్రెటరీలు) సహాయకార్యదర్శులును (అసిస్టాంటు సెక్రటరీ)లుందురు వీరందరును సాధారణముగా జిల్లాకలెక్టరు మున్నగు పెద్దయుద్యోగములుజేసిన సివిలియనుద్యోగులు, వీరిలోజాలమంది తెల్లవారు. వీరు నిరంకుశాధికార దురభిమానముల నుగ్గుబాలతోనే యభ్యసించిరి. ప్రజాస్వాతంత్ర్యమంటే వీరికి తలనొప్పి. వీరు వ్రాసిపెట్టిన కాగితముమీాద ఎంతవాడయినను మంత్రులు మాట్లాడకుండ దస్కతుపెట్టవలసినదే. లేదా కొంప మునిగినదన్నమాటయే. వీరిపై మంత్రులకు పెత్తనములేదు. మంత్రులతో జెప్పకయే వీరికావలెనని తిన్నగాబోయి గవర్నరుగారితో చీటికిమాటికి మాట్లాడిరాగలరు. యదార్థమునకు దేశమును పరిపాలించుచున్నది గవర్నరుగాదు, శాసనసభలుగాదు. కార్యనిర్వాహక సభ్యులుగాదు. వీరందరును రంగముపై నాట్యమాడు కీలుబొమ్మలు. తెరలోపలనుండి నాటకమాడించు సూత్రధారులీసెక్రెటరీవర్గమే. వీరేది తలచుకొన్నను అయితీరును. వీరిది మోఘసంకల్పము. వీరు సర్వదా మంత్రులకాళ్లకు బంధములు,

మెడలో గుదిబండ, నోటికి కళ్ళెము, చేతులకు సంకెళ్ళు, కళ్లకు గంతలు, చెవులకు బిరడాలు. మనమితవాద ప్రముఖులప్పుడప్పుడు వీరిని మంచిమాటజేసికొని యేవో రెండు స్వల్పప్రయోజనములను బొంది తమకార్యచతురతచే, లౌకికజ్ఞానముచే, వ్యవహారదక్షతచే దేశోద్ధరణ గావించితిమని నమ్ముచుందురు.

## III అధ్యాయము.

ప్రతిసంవత్సరము మార్చి నెలలో ఇండియాగవర్నమెంటువారును రాష్ట్రీయప్రభుత్వములును తమకాసంవత్సరమునకు రాదగిన రాబడిని కావలసినఖర్చులను అంచనావేసికొని, హెచ్చుతగ్గులను సరిపెట్టుట కుపాయములను సూచించుచు ఒకఆదాయవ్యయపట్టికను (అంచనావేసిన అంకెలజాబితా) సిద్ధముజేసి శాసనసభవారి విమర్శన, విచారణలకు నివేదించుచుండవలయును. అందుమీద శాసనసభవారు దానినిగూర్చి చర్చించి తమసలహాలను సవరణలను శిఫారసులను చెప్పెదరు. అప్పుడు కార్యనిర్వాహకసభ్యులును, శాసనసభవారును గలిసి యేదోవిధముగా నొకదారికి వచ్చి యాప్రకారమాయార్థికపట్టిక నంగీకరించి తీర్మానింతురు. గురికిబెత్తెడు హెచ్చుతగ్గుగా సంవత్సరము పొడుగునను దానినిబట్టి రాజ్యపరిపాలన జరిగిపోవుచుండును. ఈయాదాయవ్యయపట్టికనే యింగ్లీషులో బడ్జెటు అందురు. దీనినిగూర్చి శాసనసభలో జరుగు విచారణకే బడ్జెట్ చర్చ అనిపేరు.

సామాన్యముగా నొకగృహస్థుయొక్క ఆదాయవ్యయపట్టికకును, ఒకప్రభుత్వముయొక్క ఆదాయవ్యయపట్టికకును మూలసూత్రములోనే చాలభేదముగలదు. గృహస్థు తన ఆదాయమును ముందు జూచుకొని దానినిబట్టి తనఖర్చుజాబితాను నిర్ణయించుకొనును. ఎందుచేతనంటే వాని రాబడి సాధారణముగా నొక పరిమితిలో నుండును. తానుకోరినట్లు తనరాబడి నతడు పెంపొందించుకొన

జాలదు. ప్రభుత్వమన్ననో ముందు తనఖర్చు మొత్తముకు నిర్ణయించుకొని దానికి సరిపోవు రాబడికొరకు తరువాత ప్రయత్నించును. మామూలు రాబడి చాలనియెడల క్రొత్తపన్నులు విధించుటకో ఋణములు జేయుటకో బూనుకొనును.

1919—1920 సంవత్సరము మొదలు 1922-23 వరకుగల నాలుగేండ్లలోను వరుసగా ఆదాయమునుమించి వ్యయమగుచుండుటచే ఇండియాగవర్నమెంటువారికి మొత్తమున 1922-23 సంవత్సరములో ఆదాయమునుమించి 90 కోట్ల రూపాయలు బాకీ గన్పించెను. ఈ తేడానుసరి పెట్టుటకే గవర్నమెంటువారీ రెండుమూడేండ్లనుండి పోస్టు రైళ్ళు మున్నగువానిపై పన్నులు (రేట్లు)అధికముజేసిరి. 1922-23 సంవత్సరములోనే యిండియా గవర్నమెంటువారు ఉప్పుపన్ను రెట్టింపు జేయనెంచిరి. కాని శాసనసభవా రంగీకరించలేదు. గవర్నరు జనరలుగారుకూడ అంగీకరించలేదు. అందుచే నిరుడు ఉప్పుపన్ను వృద్ధికాలేదు. ఈసంవత్సరము (1923-24) కూడా బడ్జెట్టులో సుమారు 4 కోట్ల రూపాయలు తక్కువగా నుండెను.

## ఉప్పు చరిత్ర.

పూర్వము మొగలాయి ప్రభుత్వములోను, అంతకుమునుపు హిందూరాజుల హయామలోనుగూడ ఈ దేశములో ఉప్పు పన్ను వాడుకలోనున్న మాట వాస్తవమే. కానియాకాలములో పల్లెటూరివాసులైన బీద జనులు స్వేచ్ఛగా చవుడు నుండియే, ఎవరింట్లోవారు ఉప్పు తయారుజేసి కొనేవారు. సముద్రపు ఉప్పు బజారులో భాగ్యవంతులు మాత్రమే కొనేవారు. ఈ సముద్రపు ఉప్పు మీదనే నామకార్థముగానో స్వల్పముగానో పన్ను వసూలు చేయుచుండిరి. కాబట్టి పూర్వకాలమున ఉప్పుపన్ను వసూలుజేసిరను కారణము ఈ కాలమునకు వర్తించదు. ఏలయన ఆకాలపు ఉప్పుపన్నుతో బీదలకేమియు సంబంధములేకుండెను.

ఈ ఉప్పుపంటకు లైసెన్సులును, గుత్తవ్యాపారములును 1882 1886 సం॥ ల మధ్య ప్రారంభమయ్యెను. ఈ పన్నుచే ఉప్పు ప్రియమైనకాలదిని బీదజనులు ఉప్పును క్రమక్రమముగా తగ్గించివాడుకొనుచున్నారు. ఉప్పు ప్రత్యేకముగా మానవశరీరమున కావశ్యకమే లేదనువారు కొందరున్నప్పటికిని, ఇదివరకున్న వైద్యశాస్త్రవేత్తల యభిప్రాయమునుబట్టియు, చిరకాలాభ్యాసమునుబట్టియు మానవశరీరారోగ్యమునకిది అత్యంతావశ్యకమైనవస్తువుగా లోకములో నిపుడు పరిగణింపబడుచున్నది. ఒకమనిషికి ఆరోగ్యవంతుడుగానుండుటకై సంవత్సరమునకు సుమారు కనీసము 20 పౌనుల ఉప్పు ఆవశ్యకమని భిషగ్వరులయభిప్రాయము. ఇప్పుడు మనదేశములో సగటున మనిషికి సాలుకు 12 పౌనుల ఉప్పుమాత్రమే వినియోగపడుచున్నది. ఉప్పుపన్నును రెట్టింపుజేసినచో నింకను దాని ఖర్చుతగ్గిపోవును. అందుచే అసలేనిరంతరము నానావిధములయిన జాడ్యముల కాలవాలమైయున్న యీ దేశములో నిప్పుడుమరింత రోగవృద్ధియగునేమోయని భయమువేయుచున్నది. దేశములోని నిరుపేదలగంజిలోనికి ఉప్పేయాధారము. శాకపాకాదులకును, మృష్టాన్నభోజనములకును వారునోచుకొనలేదు.

ఇండియాలో మనిషికి సాలుకు రు 27 లు మొదలు రు 60 ల వరకు సగటు ఆదాయమున్నట్లు లెక్కలువేసినారు. సాలుకు సుమారు 50 ల రాబడిగలవాడు కొనుక్కొనవలసిన జీవితావశ్యక వస్తుసామగ్రినెల్ల లెక్కవేసినచో వానికి నేకభుక్తమునకంటె నెక్కువ యవకాశముండదు. ఇట్టి గర్భదరిద్రుడే ఇండియాగవర్నమెంటువారి ఆయవ్యయపట్టికయొక్క లోటును భర్తీజేయుటకై ఉప్పుపన్ను భరించవలసియున్నది. ఈ లోటును పూర్తిజేయుట కనేకమార్గములుసూచింపబడినవి.

ఈ మధ్య దేశపరిపాలనావ్యయమును తగ్గించేవిషయమాలోచించుటకై యొక విచారణసంఘము బయలుదేరెను. దాని

పేరు "ఇంచికేపుకమిటీ". వీరు మొత్తమున 19½ కోట్ల రూపాయల వ్యయమునుతగ్గించుటకు శిఫారసుజేసిరి. (1 కోటి 30 లక్షల పౌనులు). వీరిసలహాలనింకను పూర్తిగ నమలుజరుపలేదు. ఇంతవరకు 12 కోట్ల రూపాయలుమాత్రము తగ్గించినారు. ఇంకను 7½ కోట్ల రూపాయల వ్యయముతగ్గించుట కవకాశమున్నది. ఆయేటి కాయేడు అంతులేకుండా పెరిగిపోవుచున్న సైనికవ్యవయమును తగ్గించుట కెవరికిని శక్యముగాకున్నది. ఇండియాదేశముయొక్క సైనికవ్యయము దేశాదాయములో నూటికి 20 కంటె మించరాదని ఆర్భాటముగా ప్రకటించిరి. ఈదేశ సైనికవ్యయ మెప్పుడును సాలుకు 50 కోట్లరూపాయలకు మించరాదని యొకప్పుడు ప్రభుత్వమువారే చెప్పిరి. ఇంచికేపుకమిటీవారుగూడ 60 కోట్లకంటె నెక్కువగా నుండరాదని సలహాయిచ్చిరి. ఇప్పుడుమొత్తము దేశాదాయము 135 కోట్లరూపాయలు. ఇందు కేవలము సైన్యమునకు నూటికి 45 చొ॥ ఖర్చగుచున్నది. ఎవరెన్ని తంటాలుపడినను సైనికవ్యయమునుతగ్గించుటకుమాత్రము మన గవర్నమెంటువారు బూనుకొనరు. దీనికొక రహస్యముకలదు. ఇంగ్లాండునుండి యిండియాసైన్యములో సోల్జర్లుగా జేరుటకు వచ్చేయువకులందరు దాదాపుగా సైనికశిక్షబొందిన వారుకారు. అశిక్షితులైన యువకులనిచటికి దీసికొనివచ్చి యిండియాఖర్చుమీద వారికి జీతభత్యములిచ్చి చక్కగా తరిఫీతుజేసి యింతలో వారి సేవాకాలపరిమితి పూర్తికాగానే ఫింఛనిచ్చి యింగ్లండుపంపివేయుదురు. సుశిక్షితులైన యోధు లింగ్లాండుయొక్క ఉపయోగమునకు చౌకగాలభింతురు. యుద్ధకార్యములకంటెగా పనికిరాని అశిక్షితుల నిండియాయొక్కవఖర్చుతో భరించుచున్నది. అనగా మహాభాగ్యవంతమైన ఇంగ్లాండుసైనికులను తరిఫీతుజేయుటకై నిత్యదరిద్రముతో దేవులాడుచు ఒంటిపూటగంజితో కాలక్షేపము జేయుచున్న యిండియాదేశపుకూలివాడు ఉప్పుపన్ను చెల్లించుచున్నాడు. యిండియాదేశమిపుడు భరించుచున్న సైన్యమంతయు

యిండియాదేశసంరక్షణ కవసరములేదు. ఈ సైనికవ్యయమును తగ్గించువిషయముతోనే దేశనాయకులు శాసనసభలలోను, సభావేదికలమీదను కాంగ్రెసుపుట్టిన నలువదియేండ్లనుండి నెత్తినోరుపెట్టు కొని మొత్తికొనుచున్నారు. ఇదియంతయు చెవిటివానిముందర శంఖునాదముగానున్నది.

ప్రజాభీష్టము ననుసరించి రిప్పను ప్రభువు ఉప్పుపన్ను తగ్గించెను. తుదకు కర్జను ప్రభువువంటివాడు మణుగుకు ఒక రూపాయవరకు తగ్గించెను. ఇప్పటికి సుమారు నలుబది సంవత్సరముల క్రిందట అనగా 1882 వ సం॥ లో, ఉప్పుశాసనము పుట్టెను. ప్రజాభిప్రాయముతో నిమిత్తములేకుండా నిరంకుశముగా దేశపరిపాలన జరిగిన ఆకాలములోనే శాసనసభకు చెప్పకుండా ఉప్పుపన్నును హెచ్చించు అధికారమును కార్యనిర్వాహకవర్గమువారు తమచేతిలో బెట్టుకొన్నారు. నేడు 1923 వ సంవత్సరములో శాసనసభ్యులు, ప్రజానాయకులు, పత్రికలు, సమస్తజనులు ఏకగ్రీవముగా వద్దు వద్దు అని ఘంటాపథముగా జెప్పినను ఒక్క వైసురాయిగారి దస్కతుతో ఉప్పుపన్ను హెచ్చినది. ఈ నలుబది సంవత్సరములలోను రాజ్యాంగ పరిణామమునందు మనమెంత దూరమువచ్చితిమో యోచింపుడు. 1921 వ సంవత్సరములో బడ్జెట్టును గూర్చి గవర్నమెంటువారి ఆర్థికసభ్యు డుపన్యసించుచు "మేము క్రొత్తపన్నులు శాసనసభవారి (ఎస్సెంబ్లీ) యిష్టప్రకారమే వేసెదము" అని వాక్రుచ్చెను. ఈ యుప్పుపన్ను నెవరి యిష్టప్రకారము విధించిరి ? నిరుటి సంవత్సరము అనగా 1922–23 సం॥ పు బడ్జెట్టులో 7 కోట్ల 76 లక్షల రూ॥ లు తరుగు వచ్చెను. ఇంగ్లాండులోని లాంకషైరునుండి దిగుమతియగు దూదివస్త్రములమీద ఇదివరకు నూటికి 15 చొప్పునను, ఇప్పుడు నూటికి 11 చొ॥ ను దిగుమతి సుంకము వసూలు జేయుచున్నారు. ఇందుకుపోటీగా ఈదేశములో ఫ్యాక్టరీలలో తయారైన దూదివస్త్ర

ములమీఁదగూఁడ నూటికి 3½ చొ॥ పన్ను విధించుచున్నారు. దీనిపేరు ఎక్సైజుపన్ను. నిరుడే దిగుమతి సుంకమును నూటికి 15 నుండి 11 వరకు తగ్గించిరి. అందుచే గవర్నమెంటువారికి 1 కోటి 46 లక్షల రూ॥ ల రాబడి తగ్గిపోయెను. ఆ హేతువు చేతనే సంవత్సరాంతమునకు 7 కోట్ల 76 లక్షల రూపాయిలకు బదులు 9 కోట్ల 16 లక్షలు ప్రభుత్వమునకు తరుగువచ్చెను. అట్టి సందర్భములో నిరుడుప్పుపన్నును వృద్ధిచేయలేదు. అప్పుడింకొక గమ్మత్తుగూడ జరిగినట్టు వాడుకపడినది. ఈ దిగుమతి సుంకమును నూటికి 15 నుండి 11 వరకు తగ్గించుటకు ఇండియా శాసనసభవా రంగీకరించకపోయేయెడల, ఈదేశపు వస్త్రములపై విధించు ఎక్సైజుపన్నును మాట్లాడకుండా (సర్టిఫైచేసి) తన ప్రత్యేకాధికారమును వినియోగించి నూటికి 3½ నుండి 7½ వరకు వృద్ధిచేయుమని గవర్నరు జనరలుగారి కింగ్లాండునుండి కేరళపత్రిద్వారా కబుర్లు వచ్చినవట. మాంటాగుగారు స్టేటు సెక్రిటరీపని మాను కొన్న వారము దినములలోగానే యిది జరిగినట్లును, ఎక్సైజుపన్ను వృద్ధిజేయుట కిష్టములేక అవసరమైతే వైసురాయిగారు రాజీనామా యివ్వదలచిరనియు, మాంటాగ్యువెంట. రీడింగుగారు కూడ వెళ్ళిపోతే, కొంపమునిగిపోవునేమోయని ఎస్సెంబ్లీవారు భయపడి వెంటనే దిగుమతిసుంకమును తగ్గించుట కంగీకరించిరనియు దానితో కథ సాంతమైనదనియు పెద్ద పెద్దలు గుస గుస లాడుకొనిరి. రీడింగు గారు సీమబట్టలను చౌకజేయుటకింత అట్టహాసము జేసిరిగాని ఇక్కడి పేదవాని గంజిలోని యుప్పుగల్లును చౌకజేయుట తమ ధర్మమని యాలోచింపరైరి. దీనినిబట్టి ఇండియా గవర్నమెంటు వారి పరిపాలన లాంకషైరులోని బట్టల ఫ్యాక్టరీదారుల క్షేమమునకో యిండియాలోని నిరుపేదవాని సంరక్షణకో యూహింపుడు.

20_3_23 తేదీని యెస్సెంబ్లీ వారీబిల్లును మొదట త్రోసి వేసిరి, అంతట వైసురాయిగారి శిఫారసుతో బడ్జెట్టును స్టేటుకౌన్సిలుకు బంపిరి. అందు ధైర్యముతో ప్రతికూలాభిప్రాయ మిచ్చిన సభ్యులు పదిమంది. తటస్థముగానున్న వారిద్దరు. ప్రభుత్వపక్షమున కనుకూలముగతలలెగుర వేసినవారిరువదియెనిమిదిమంది. ఈ ప్రకారము స్టేటుకౌన్సిలువారామోదించిన తరువాత ఆబిల్లు తిరిగి యెస్సెంబ్లీ వారి విచారణలోనికి వచ్చినది. స్టేటుకౌన్సిలువారి సవరణ నంగీకరింపుడను సిఫారసును దానితో జతపరచిరి. యెస్సెంబ్లివారు మరల దానిని 26-3-23 తేదీ త్రోసివేసిరి. అంతట గవర్నరు జనరల్ కౌన్సిలువారు ఆపత్సమయములలో నుపయోగించవలసిన వైస్రాయిగారి అసాధారణాధికారముచే దేశక్షేమమున కీపన్ను వృద్ధిచేయుట యావశ్యకమని సర్టిఫై చేయించి బిల్లును అమలులోనికి దెచ్చిరి. కార్యనిర్వాహక వర్గమువారు చెప్పినట్లు తలయూగించి నంతవరకు అస్సెంబ్లివారి తీర్మానము లంగీకరింపబడును. వారి యిష్టమునకు వ్యతిరేకముజేసిన అస్సెంబ్లీ తీర్మానములన్నిటిని తుంగలో ద్రొక్కవలసినదే. నూతన సంస్కరణలవలన ఇండియా ప్రభుత్వములో మనకులభించిన స్వాతంత్ర్యమున కిదియొక మంచి నిదర్శనము.

ఈబడ్జెట్టు తరుగును పూర్తి జేయుటకై అనేక మార్గములను క్రొత్తపన్నులను యెస్సెంబ్లీసభ్యులు సూచించిరిగాని ప్రభుత్వము వారు వినవలచుకొనలేదు. కొందరు సభ్యులు సూచించిన క్రొత్త పన్నులు- (1) పెట్రోలుమీాద యెగుమతిపన్ను, (2)రూపాయి ఒకటికి అర్ధణా చొప్పున అధిక రాబడిపన్ను (3) ఔన్సుకు నాల్గణాల చొప్పున వెండిమీాదదిగుమతిపన్ను, మొదలైనవానినిసూచించిరి. ఉప్పు పన్నుయొక్క హెచ్చు తగ్గులనుబట్టి ప్రజలు వాడుకొను ఉప్పు పరిమాణ మెట్లుమారినదో యీాక్రింది యంకెలవలన దెలియ గలదు.

| సంవత్సరము | మణుగు 1 కి పన్ను రేటు | | ఖర్చుఅయిన మొత్తముఉప్పు | |
|---|---|---|---|---|
| 1891-92 | —— | ... | —3 కోట్ల 33 లక్షల మణుగులు. | |
| 1902-03 | —— | ... | —3 కో॥ 74 ల॥ | ... |
| 1903-04 | —— | రూ-2 | —3 కో॥ 82 ల॥ | ... |
| 1906-07 | —— | 1-8-0 | —4 కో॥ 13 ల॥ | ... |
| 1907-08 | —— | 1-0-0 | —4 కో॥ 33 ల॥ | ... |
| 1908-09 | —— | ... | —4 కో॥ 52 ల॥ | ... |
| 1910-11 | —— | ... | —4 కో॥ 65 ల॥ | ... |
| 1912-13 | —— | ... | —4 కో॥ 82 ల॥ | ... |
| 1914-15 | —— | ... | —4 కో॥ 83 ల॥ | ... |
| 1916-17 | —— | 1-4-0 | —5 కో॥ 10 ల॥ | ... |
| 1917-18 | —— | ... | —4 కో॥ 48 ల॥ | ... |
| 1920-21 | —— | ... | —5 కో॥ 23 ల॥ | ... |

ఈ సందర్భములన్నియు నిట్లుండగ అసలు గవర్నరు జనరల్ గారు, ఈ బిల్లువిషయములో జరిపినచర్యఅంతయు అశాస్త్రీయముగా నున్నదనియు, యథావిధిగా జరుగలేదనియు, శ్రీనివాసయ్యంగారివంటి ధర్మశాస్త్రవేత్తలే తమసందేహమును బ్రకటించుచున్నారు.

1922-23 సం॥ బడ్జెట్టులో $31\frac{3}{4}$ కోట్ల రూపాయలుతరుగు. (సుమారు 2 కోట్ల 10 లక్షలపౌనులు.) ఉప్పుపన్ను రెట్టింపుచేయవలెనని గవర్నమెంటువారు నిరుడేకోరిరి. కాని 20-3-1922 తేదీని అసెంబ్లివారీతీర్మానము త్రోసివేసిరి. అంతట గవర్నమెంటువారూరకొనిరి.

1923-24 సం॥ పు అంచనాబడ్జెట్టులోవచ్చిన తరుగుకు 3 కోట్ల 68 లక్షలరూపాయలు. అనగా సుమారిరువదియైదు లక్షలపౌనులు. న్యాయముగా విచారించినయెడల యీ స్వల్పభేదమునకు క్రొత్తపన్ను విధించు నావశ్యకములేదు. ప్రభుత్వమువారి ఆర్థికసభ్యుడు తలుచుకొంటే ఒకనిమిషములో అప్పును చూపగలడు. మరియొక నిమిషములో ఆదాచూపగలడు.

1922_23 సం॥ లో ఉప్పుమీాద గవర్నమెంటునకు వచ్చిన ఆదాయము సుమారు 48 లక్షల పౌనులు అనగా 7 కోట్ల 20 లక్షల రూపాయలు.

పూర్వమునకంటె నిపుడు ప్రజలధికముగా నిచ్చుచున్న పన్నులు- లోహసామాగ్రి, వ్యవసాయిక పరికరములకు నూటికి 10 కొల్లాయిగుడ్డకు నూటికి 3½ మొదలు 11 వరకు; ధోవతులకు 100 కి 11; ఇతరవస్త్రములకు 100 కి 15; పంచదార 100 కి 25; నిప్పుపెట్టెలు 100 కి 120; కిరసనాయల్ గాలన్ 1 కి 0-2-6; ఈ ప్రకారము నిత్యజీవితావశ్యకపదార్థము లన్నిటిమీాదను పన్నుజెల్లించుచున్న యీకాలపు ఉప్పుపన్నుకును, యిట్టిపన్నుల బాధలేని పూర్వకాలపు ఉప్పుపన్నుకును పోలికయే లేదు.

కడచిన ఆఫ్గను యుద్ధమునకైన వ్యయము (2 కోట్లపౌనులును), సరిహద్దు ప్రాంతములనున్న వజీరుస్థానములోని ఆరణ్యజాతులను వంశపరచుకొనుటకై వెచ్చించిన కోట్లకొలది ధనమును, ఋణములకాతాలో జేర్చక నిత్యవార్షికవ్యయములో జేర్చినందుచేత ఇంత తరుగు కనుపించుచున్నది.

ఇండియా ధనము 4 కోట్లపౌనులు ఇంగ్లాండులో వృధాగా నిల్వయున్నది ఇది కరెన్సీనోట్ల బాపతును, రూపాయనాణెములోని వెండిఖరీదు తేడాబాపతును కలిపి, బంగారముగా మార్చి ఇంగ్లండులో సుమారు 1903 స॥ నుండి నిల్వయుంచినారు.

దీనికే గోల్డుస్టాండర్డు రిజర్వుధనమందురు. దీనిని లండనువర్తకులకు చౌకవడ్డీకి నూటికిసుమారు సంవత్సరమునకు 2½ చొ॥ అప్పిచ్చుచుందురు. ఇండియాకు డబ్బుకావలసినప్పుడు ఇంగ్లీషు పెట్టుబడి దారులయొద్ద నూటికి 6; 7 చొ॥ అధికవడ్డీకి యిండియాగవర్నమెంటు వారప్పుదీసికొందురు. ఈ బాపతుమొత్తము అంతయు 95 కోట్లరూపాయలవరకు ప్రాకై యుండెను. పౌను లేక నవరసు

రు15లధరలోనుండగానీధనమంతయు బంగారముగా(పౌనులుగా) మార్చబడినది. 1920-21సంలో పౌనుధరరు7½వరకుతగ్గిపోయినపుడు ఈ దేశములోనున్నసివిలు ఉద్యోగులును, తెల్లవర్తకులును ఇచటచౌకగా వైసురాయిగారివద్ద తిరుగు హుండీలుకొని రు 7½ లకు ఒకనవరసు చొ॥ ఇంగ్లాండులోనున్న ఇండియాతాలూకు గోల్డురిజర్వునుండి కావలసిన ధనము లాగుకొనినారు. ఆగోల్డు రిజర్వులోనుండి ఈవిధముగా హరించిన బాపతు మొత్తమున ఇండియాకు 35 కోట్లరూపాయలు ఒక నాలుగు నెలలో మారకము తేడావలన నష్టమువచ్చినది. కూచమ్మకూడబెట్టినదానినిమాచమ్మమాయముచేసెను. ఆ బాపతుపోగామిగిలిన శేషము 60కోట్ల రూపాయలున్నవి. ఇందులోనుండియే కడచిన బడ్జెటుతరుగు క్రింద 1 కో 50 ల, రూపాయలు ఇండియా గవర్నమెంటువారు జమకట్టుకొన్నారు. ఇంగ్లండులో దండుగగా పడియున్న రు 60 కోట్లనుండి 1 కో 50 ల కు బదులు రు 3 కో 75 లక్షలు తీసికొన్నచో అసలుతరుగేకనుబడకుండును గదా. అప్పుడుక్రొపన్ను అవసరములేకపోవునుగదాయని మనయెసెంబ్లీ సభ్యులు ఘోషించిరి, వీరి రొద వినువారెవ్వరు? వినదలచు కొన్నంతవరకేవిన్నారు. తరువాత పెడచెవిద్రిప్పినారు. సంస్కరణల ప్రయోజనమెంతవరకంటె వైసురాయిగారు వారి కార్యనిర్వాహక వర్గమువారు, యిష్టపడిన వానినెల్ల మేమె చేయించితిమని మన యెస్సెంబ్లీ సభ్యులు డప్పాలు కొట్టుకొనవచ్చును. వారి కిష్టములేని సందర్భములలో మన ప్రతినిధుల ప్రయోజకత్వము లెంతవరకు జనికివచ్చునో గ్రంథస్థమైన నిదర్శనముతో దేశీయులు శాశ్వితముగా జ్ఞాపకముంచుకొనుటకీ మంచి యవకాశమును గల్పించిన వైసురాయిగారికి గయాకాంగ్రెసు పార్టీవారి పక్షమున మేము వందనములు జేయుచున్నాము.

ఇండియా గవర్నమెంటువారు తమ రాబడికి దగిన ఖర్చులను జేసికొనలేక ప్రాతపన్ను లెన్నిసార్లు వృద్ధిజేసినను, క్రొత్తపన్ను లెన్ని

సృష్టించినను, అనుదినవ్యయమునకేజాలక యెప్పటికప్పుడు ఋణగ్రస్తమైయుండుట తటస్థించుచున్నది. ఈ స్థితినిజూచి యెస్సెంబ్లీ వారుభయపడి అధికముగానున్న ప్రభుత్వవ్యయములను తగ్గించు విషయ మాలోచించుటకొరకు విచారణసంఘమును 1922 సం॥ ఫిబ్రవరి 3 వ తేదీని యేర్పాటుజేసిరి. ఈ విచారణసంఘమునకు ఇంచికేపుప్రభువు అధ్యక్షుడుగానుండుటచే దీనికి ఇంచికేపు సంఘమని కూడ పేరుగలదు. యెస్సెంబ్లీవారు 1922-23 సంవత్సరపు అంచనాబడ్జెటులోనుండి సుమారు 9 కోట్ల రూపాయల (60 లక్షలు పౌనులు) ఖర్చులనుతగ్గించి ఉప్పుపన్ను పెరుగకుండాజేసిరి. అంతట నిరుటి కాగండముతప్పినది. ఇది 20-3-1922 తేదీని జరిగినది.

తరువాత 1923-24 సంవత్సరపు మూడవ బడ్జెటు వచ్చెను. 1923 సం॥ మార్చి 31 వ తేదీనాటికి తేలినక్రిందటి సంవత్సరపు తరుగు 17 కోట్లు (పౌ 11, 333000) కొత్త బడ్జెట్టు అంచనాలో రు 4కో 26 లక్షలుతరుగు చూపించబడినది. (పౌ. 2, 840, 000) బడ్జెట్టు విచారణలో ఖర్చుపద్దులనుతగ్గించుకొని రాగా రాగా తుదకు 3 కోట్ల 68 లక్షలరూపాయలు (పౌ 2, 453,000) తరుగు నిలిచినది. దీనిని కూడ దీసికొనివచ్చుటకై ఇండియా గవర్నమెంటువారు మరల ఉప్పుపన్నును రెట్టింపు చేయనెంచిరి. ఇందుచే 1923-24 సం॥ లో (30 లక్షలలు పౌనులును) 1924-25 సం॥ లో 45 లక్షలపౌనులును ఆదా వచ్చునని అంచనావేసిరి. యెస్సెంబ్లీవారు 1922 మార్చి 20 వ తేదీని యీబిల్లును త్రోసివేసిరి.

తుదకు ఇండియా గవర్నమెంటుచట్టము (67 బీ) సెక్షను ప్రకారము వైసురాయిగారు తన అసాధారణాధికారమును వినియోగించి సర్టిఫైచేసి, ఉప్పుపన్నును రెట్టింపుచేయించిరి.

ఇండియాలో ఉప్పుపన్ను అంటే ఇంగ్లాండులో రొట్టెపన్ను అన్నమాటయేగదా!

—♦ IV అధ్యాయము ♦—

# వలసరాష్ట్ర పుకూలీలు

:o:

ప్రపంచములోని సభ్యజాతులన్నియు పరదేశములకు రాజ్యాంగవేత్తలను, కవిసార్వభౌములను, సకలవిద్యాధురీణులను, నూతన శాస్త్రాన్వేషులను, వణిక్శిఖామణులను, రాజప్రతినిధులను, యోధాగ్రేసరులను, మున్నగు ప్రతిభాశీలురను బంపుచు స్వజాతీయగౌరవమును పెంపొందించుకొనుచుండగా, నూటయేబది సంవత్సరముల నుండి ఆంగ్లేయప్రభుత్వముక్రింద తరిఫీయతుబొందిన భారతదేశము నేడు దేశ దేశాంతరములకును, ద్వీప ద్వీపాంతరములకును, ఖండఖండాంతరములకును, ఒక్కపూట గంజికైనను నింట్లోగతిలేక పొట్టకక్కరితిచే నెట్టి నైచ్యావమానములనైనభరించి, నోరులేని పశువువలె చెమటనోడ్చి పనిచేయుకూలివాండ్రను, పాటకపుజనులను బంపించుచున్నది. ఈ భూమండలమునందు తెల్లవారెక్కడ యే క్రొత్త ద్వీపము నాక్రమించుకొన్నను, యే యరణ్యమును ఛేదించినను, యే పర్వతమును బ్రద్దలుకొట్టినను, యే నదీప్రవాహము నరికట్టినను చింపిరిగోచిపాతతో పలుగు, పార, గొడ్డలి, భుజమునపెట్టుకొని యిండియాదేశపు కూలివాడు ప్రత్యక్షము గావలసినదే. వేయేల యిండియాదేశపు కూలివాడులేని రాజ్యమే లేదనిచెప్పవచ్చును. అందుచేతనే కొందరు పరదేశీయులు యిండియా కూలీలదేశమనియు, భారతీయులు కూలిజాతివారనియు, విశ్వసించుటలో నార్చర్యములేదు. 1921 సంవత్సరపు జనాభాలెక్కప్రకారము బ్రిటీషుసామ్రాజ్యాంతర్గతమగు 31 ప్రదేశములలో 20 లక్షల 80 వేలమంది యిండియాదేశపు కూలీలుగలరు. (1) సింహాళములో ($7\frac{1}{2}$ లక్షలు) స్ట్రైటు సెటిలుమెంటులు, మలయా పరగణాలు, బ్రిటీషుమలయా, హాంకాంగ్, మారిషస్, వైహైవై, జిబ్రాల్టరు, నైగేరియా, కెనియా, ఉగాండా, జాంజిబార్, టెంగనాయికా, బ్రిటిషుగయానా, జెమైకా,

ఫిజీ, కనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండు, నేటాల్, ట్రాన్స్‌వాల్, కేప్ కాలనీ మొదలయినవి. సామ్రాజ్యములోచేరని మెడగాస్కర్ మొదలగు ఏడు యితరప్రదేశములందు 65 వేలమంది ఆశియాఖండ వాసులుగలరు. పూర్వము భారతీయులు విదేశములకేగు నాచార మంతగాలేకుండెను. అందును కూలీలుగాబోవుట యెన్నడును లేదు. 19 వ శతాబ్దారంభమున అనగా సుమారు 1800 వ సంవత్సర ప్రాంతమున జావా, సుమిత్రి మొదలగు ప్రదేశములకు కూలీలుగా బోవునాచారము ప్రారంభమయ్యెను. ఆ ప్రాంతముల క్రొత్తగా చెరుకుపంటలు ప్రారంభించినపుడు అచటి తెల్లవారిలాభమునకై యీ దేశమునుండి కూలీలనుబంపుటకు మన యాంగ్లప్రభుత్వము వారు (కుంభిణి) మెల్లగా బ్రోత్సహించిరి. నానాటికి క్రమక్రమ ముగా నీ కూలీలవ్యాపార మభివృద్ధియై చిత్రవిచిత్రములైన స్వరూ పములుదాల్చుచు నేటికి నీక్రిందవివరింపబోవు దుర్గతిలోనికివచ్చినది. దక్షిణ ఆఫ్రికాలో నీ విషయమైజరిగిన నాటకమంతయు గాంధి మహాత్ముని జీవితమునెరింగినవారికి క్రొత్తవిషయముగాదు. ఒక్క కెనియారాష్ట్రములో భారతీయులు గుడుచుచున్న యిడుమలను దిలకించినచో తక్కినవానిసంగతి ప్రత్యేకముగా జెప్పనక్కరలేదు. స్వదేశములోనే బానిసలకంటె హీనముగాజూడబడుచున్న భార తీయులకు పరదేశములలో పరిభవముగలుగుచున్నదని గుందుట యెంతయు వెఱ్ఱితనము. ఆంగ్లేయ ప్రభుత్వమువలన మనకులభిం చిన యపూర్వ మహాద్భాగ్య ప్రయోజనముల లోనిదియొకటిముఖ్య ముగా జ్ఞాపకముంచుకొనదగినది. బ్రిటీషుసామ్రాజ్యములో నొ క్కొక్కచోట భారతీయులకు గలుగుచున్న యక్రమములను వ్రాయబూనినయెడల నొక్కొక ప్రత్యేక గ్రంథమగును. ఆంఢ్రూసు గారీవిషయమై జేయుచున్న సేవ భారతీయులెన్నటికిని మరువదగినది కాదు. రాయబారములపంపిరి. సభలుచేసిరి. తీర్మానములు వ్రాసిరి. పత్రికలలో తీవ్రముగాఖండించిరి. ప్రత్యేకపు విచారణలు

జేసి నివేదికలు ప్రకటించిరి. ప్రయాణాంతమునందు తిరిగిచూచు చుండే బయలుదేరిన చోటనేయుంటిమి. యిండియా దేశములో ప్రజాందోళన జరుగువిషయములందు ప్రభుత్వమువారుజరుపు తంతాంగమంతయు దయ్యము తప్పించినదారివలె రాత్రియంతయు నడచినను తెల్లవారుసరికి బయలుదేరినచోటనే యున్నట్లుండును.

---

# కాలనీలు — భారతీయులు

---

ఇండెంచరు పద్ధతి (అనగా ముచ్చిలికా ఖరారునామా) ప్రకారము ఇండియా దేశమునుండి దేశాంతరములకు కూలిపని కొరకో, మరియేవృత్తి కొరకో, భారతీయులను దీసికొనిపోయి వారినచట పశువులకంటె హీనముగా జూచుట మహాఅన్యాయమని గందరగోళము చేయుగా తుదకు 1920 వ సంవత్సరములో ఆపద్ధతి రద్దుచేయబడినది. దీనికిని 1834 వ సంవత్సరములో రద్దుచేయబడిన బానిసవ్యాపారమను నరవిక్రియ కార్యమునకును నామ భేదమేగాని తక్కిన లక్షణములలో విశేష వ్యత్యాస మేమియు లేదు.

1834 వ సంవత్సరములో ధర్మతత్పరులైన కొందరు బ్రిటిషు మహనీయుల కృషివలన, బానిసవర్తకము రద్దయిపోవుటచే పాపము వలసరాష్ట్రముల (కాలనీల) లో జేరిన శ్వేతజాతులకు పనిపాటలు జేయుటకు దగినంతమంది కూలిపనివాండ్రు సమృద్ధిగాను, చౌకగాను దొరుకుట దుర్లభమయ్యెను. అప్పుడు ఇండియా దేశములో నిత్యక్షామముతో బాధపడుచున్న నిరాధారులకు జీవనోపాయము గల్పించుటగూడ ఒక కారణముగాజెప్పి, యీ యిండెంచరు పద్ధతి నొకదానిని కల్పించి దానిప్రకారము యిచటినుండి కూలీలను పరదేశములకు అనగా నీవలసరాజ్యములకు ఎగుమతిజేయ నారంభించిరి. ఈ

క్రొత్త పద్ధతిప్రకారము సుమారు ఎనుబది సంవత్సరములు (1894 మొదలు 1920 వరకు) రూపాంతరము పొందిన బానిసవ్యాపారము సాగినది. 1837 వ సంవత్సరములో నీకూలీలకు గలుగుచున్న హింసలనుగూర్చి పార్లమెంటులో ప్రశ్నించగా, పటెల్ బాక్సటన్, బ్రూహాంప్రభువు, మున్నగువారీ దుర్మార్గమును తీవ్రముగా ఖండించిరి. అంతట నీదేశమునుండి కూలీల యెగుమతి నాపివేసిరి ఈ విషయముల నెల్ల విచారించుటకై కలకత్తాలో నొకకమిటీ నేర్పాటుజేయగా వారు విచారించి 1840 వ సం॥ లో వారిరిపోర్టునందునిజముగా కూలీలకుచాలయక్రమములు జరుగుచున్నవని యొప్పుకొనిరి. తరువాత ఈ కూలీలకు నక్రమములు జరుగకుండా కొన్ని కఠిననియమములను ఇండియా గవర్నమెంటువారు గావించిరి. కాని ప్రయాణముతోను, ద్వీపాంతరములకు జేరినతర్వాతను ఈ దురదృష్టవంతులకు గలిగే బాధలు, అక్రమములు, తగ్గలేదని ఆండ్రూసు గారు ప్రత్యక్షముగా జూచివచ్చి తెలియజేసిరి.

ఈ పరదేశములలో ఇండియాదేశస్థులు సాంఘికముగాను, రాజకీయముగాను కేవలము బానిసలై యున్నారు. ఈకూలీల యజమానులు, మేస్త్రీలును వీరిని జాల యవమానకరముగా జూతురు.

ఒక్కొక్కప్పుడీ మేస్త్రీలు కూలికివెళ్ళిన ఆడువాండ్రను మిగుల మానభంగకరముగా హింసింతురు. విదేశములకేగిన భారతీయుడు, సాంఘికముగా నీచుడు. రాజకీయముగా బానిస. ఆర్థికముగా దరిద్రుడు. నైతికముగా మహాపాపి, అయిపోవుచున్నాడు. చదువులేదు. జ్ఞానములేదు. ఆరోగ్యములేదు, గౌరవములేదు, కేవలము మృగప్రాయుడుగా నున్నాడంటే అతిశయోక్తిగాదు. ఈ కూలీలలోనే యేకొలది మందియో గడుసువాండ్రు మేస్త్రీలుగ బయలుదేరిన తమకులోకువగానుండి నమ్మిన అమాయకులగు తక్కిన కూలీలకు ద్రోహముజేసి నీచముగా (తెల్లవారు) యజమానుల

యిచ్చకమును సంపాదించి కొంచెమెక్కువగా ధనము గడించుకొన్నవారును లేకపోలేదు. వీరినే తరచు ఉదాహరణముగా బేర్కొనుచు విదేశములకేగి బాగుపడిన యిండియా కూలీలుగా జూపించుచుందురు. మహా ఘోరనరకములోనున్న వేలకువేలు తక్కినవారి సంగతి గమనించేవారుండరు. ఈ యిండెంచరు కూలిపద్ధతివలన వారి యజమానులు ధనముతోపాటు సంపాదించుకొనే మహాపాతకమునకును కూలీ లనుభవించుచున్న దుఃఖవార్ధికిని, పారములేకున్నది. మతాంతరులు, దేశాంతరులు, భాషాంతరులు, వర్ణాంతరులునై ధనాశాపిశాచావేశోన్మత్తులుగానున్న యీ యజమానుల వలన ఈ కూలీల కుపకారము గలుగుననుట కలలోనివార్త. ప్రపంచములో నేదేశమందైనను తెల్లకూలివానికి దినమునకు 7 షిల్లింగులకు (సుమారు రు 5-4-0 తక్కువలేని కూలిదొరుకుచున్నది. ఫసిఫిక్కు దీవులలో నరమాంస భక్షకుడుగానుండిన యారణ్యకజాతివాడు సహితము సులువుగా దినమునకు నాలుగు షిల్లింగులకూలి సంపాదించుచున్నాడు. ఇండియా కూలీమాత్రమే రోజుకు రెండుషిల్లింగులు. అదియు మలయారాష్ట్రములోను, సింహళములోను అయితే దినమునకుఅరషిల్లింగే. ఇంతచౌకకూలికి దినమంతయుచచ్చి చెడిపనిచేసేది ఇండియా కూలివాడగుట చేతనే వీరి నుపయోగించుకొను తోటల యజమాను లమితలాభముల నేటేట బొందుచున్నారు. ఇండియా కూలీలే వలసరాష్ట్రములలోని దుర్గమారణ్యములను ఫలవంతములగు కేదారములుగను, నిర్జనభూముల నుద్యానవనములుగను, దివ్యసౌధ విలసితంబులయిన నగరరాజములను, నిర్మించినప్పటికిని వారికష్టములను కృతజ్ఞతతో జూచిన చోటొక్కటిలేదు. ఆఫ్రికాలో మరియు నన్యాయముగ నున్నది. కూలివానికిచ్చే ప్రతి రూపాయకును యజమానికి మూడురెట్లకు తక్కువలేని లాభము వచ్చి తీరుచున్నది.

న్యూజీలెండులో ఇండియాకూలీకి సహితము గంటకు ఒక షిల్లింగుచొప్పున కూలినిచ్చెదరు. ఆస్ట్రేలియాలో సగటున వారమునకు తెల్లవాడుగాని, నల్లవాడుగాని మగవానికి 3 పౌనులును, ఆడుదానికి 1 పౌను 10½ షిల్లింగులును కూలిదొరుకును. అమెరికాలో కూలివాండ్రందరును దినమునకు 2½ డాలర్లు అనగా ఎనిమిది రూపాయలు సంపాదింతురు. సింహళ ద్వీపముయొక్క జనసంఖ్య అంతయు 45 లక్షలు. ఇందు 14 లక్షలమంది యిండియనులే గలరు. మలయాలో 471666 మంది స్ట్రెయిట్ సెటిల్మెంటులో 1,4628 మంది ఫీజీదీవులలో 62 లక్షలమంది (మొత్తము జనసంఖ్యలో సుమారు సగముమంది) బ్రిటిషు గయానాలో సుమారు ఒక లక్షమంది భారతీయులున్నారు.

ఇండియాదేశపు కూలీలవలన వలసరాష్ట్రములలోని కొన్ని వర్తకసంఘములు పొందిన వార్షికలాభము లెంత విపరీతముగ నున్నవో యీక్రిందిపట్టీవలన దెలియనగును. సింహళద్వీపములోని:-

(1) ప్లాంటర్సు రబ్బరు సిండికేట్ అనేకంపెనీకి 1912 వ సం|| మొదలు 1917 వ సం|| వరకు వరుసగా నూటికి 135; 55; 45; 90; 80; 60; చొప్పునను, 1912 వ సం|| మొదలు 1918 వ సం|| వరకు క్రమముగా.

(2) దిసిలోన్ రబ్బరుకంపెనీకి నూటికి 65; 6; 45; 40; 55; 70; 70: 65: 80; 50; చొప్పునను,

(3) ఘోరు స్టెస్టరు ఎస్టేటు అనేకంపెనీకి నూటికి 25; 20; 40; 50; 75; 75; 60; చొప్పునను.

(4) సింహళములోని గల్లమెట్టిరబ్బరు కంపెనీకి 70; 70; 50; 35; వంతునను

(5) గివనోర్ టీ కంపెనీకి నూటికి 28; 20; 25; 75; 45; 25; 75; చొప్పునను.

(6) కలుతారా కంపెనీకి నూటికి 1080; 75; 55; 60; 70; 80; 50; చొప్పునను.

(7) కలుతారా రబ్బరుకంపెనీకి నూటికి 160; 90; 70; 100; 120; 60; 50; చొప్పునను, లాభములువచ్చెను.

## కెన్యా కాలనీ.

### భారతీయుల యిక్కట్లు.

ఈ కెన్యాదేశము ఆఫ్రికాఖండమున తూర్పుతీరమున నున్నది. దీనిని బూర్వము బ్రిటిషు ఈస్టు ఆఫ్రికాయని పిలచెడివారు. ఇది క్రౌనుకాలనీ అనగా ఆస్ట్రేలియా కనడాలవలె ప్రజాస్వామికముగల స్వతంత్రరాజ్యముకాదు. ఇయ్యది బ్రిటిషుగవర్న మెంటుచేతనే పరిపాలింపబడుచున్నది. దీనినిగవర్నరు లండనులోని కలోనియల్ సెక్రటరీ జారీచేయుచుండు నుత్తరువుల ప్రకారము ప్రభుత్వము నిర్వహించుచుండును. వీని సహాయార్థము కార్యనిర్వాహకసభకలదు. ఇందులో నెక్కువమంది అధికారులు, కొద్దిమంది అనుద్యోగీయులునుగలరు. అనుద్యోగీయులలో నిద్దరు యురపియన్లు, ఒకరుమాత్రము భారతీయుడు. చట్టములు శాసనసభద్వార చేయబడుచుండును. ఇందులో అధికారులేయెక్కువమంది. కొద్దిమంది మాత్రము అనుద్యోగీయులు, అనుద్యోగీయులలో 11 మంది ఎన్నకొనబడిన యురపియను ప్రతినిధులు, నలుగురు గవర్నరుచే నియామకమైన భారతీయులు. కెన్యాలోని స్వదేశస్థులు 25 లక్షలమందికలరు. వీరికి శాసనసభలోగాని, కార్యనిర్వాహకసభలోగాని ప్రాతినిధ్యములేదు. స్వదేశస్థులుగాక వలసకు వచ్చిన యురపియనుజాతివారు స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు, ఉద్యోగులు అనుద్యోగులు, కలసి 10000కంటె నెక్కువ మందిలేరు. భారతీయులు 30000 గలరు. వీరికిదోడు కొన్ని వేలమంది అరబ్బులుకలరు. భారతీయులును, అరబ్బులును యురపియనుల కంటె ముందుగనే వలసవచ్చి, యిచటనే చిరకాలమునుండి కాపురముచేయుచుండిరి.

హిందూదేశమునకును, ఈ తూర్పుఆఫ్రికాకును అనేకశతాబ్దములనుండి వర్తకవ్యాపారములు సాగుచుండెను. హిందూదేశస్థులే యీ తూర్పుఆఫ్రికాకువచ్చి వ్యాపారము సాగించియుండని

మెడల బ్రిటిషువారిక్కడ గాలుపెట్టుటకే యవకాశముండెడిది కాదు. హిందూదేశవర్తకుల సాహాయ్యమువలననే బ్రిటిషువారిక్కడ పలుకుబడిని సంపాదింపగలిగిరి. వారిమూలముననే బ్రిటిషు అధికారమిచ్చట నెలకొల్పబడినది అని జాన్‌కర్కు 1901 లో వ్రాసియుండెను. సమస్తరాజ్యములవారికిని సమానమైన హక్కులుండునటుల 1888 లో బ్రిటిషు ఈస్టు ఆఫ్రికాకంపెనీవారికి (చార్టరు) అధికారపత్ర మొసగబడినది. బ్రిటిషుసామ్రాజ్యములో జేరిన హిందూదేశప్రజలిచ్చట వర్తకవ్యాపారములను జేసికొనుటకును, వలసవచ్చినభారతీయులు పరరాజ్యముక్రింద నుండుటకంటె బ్రిటిషుప్రభుత్వముక్రిందనుండుట శ్రేయస్కరమనుగారణమును, నుడివియే యీ యధికారపత్ర మొసగబడినది.

కెన్యాయొక్క లోపలిప్రదేశము నివాసయోగ్యముగ జేయుటకు భారతీయు లాహ్వానముచేయబడిరి. భారతీయులీప్రాంతముల వర్తకవ్యాపారములను నెలకొల్పిరి. అనేకభవనములను నిర్మించిరి. బ్రిటిషునాణెములను బ్రచారములోనికిదెచ్చిరి. భారతీయుల కాయకష్టముచేతనే ఉగాండా రైల్వే కట్టబడినది ఈ రైల్వే కట్టబడని యెడల కెన్యాదేశ మభివృద్ధిలోనికి వచ్చెడిదే కాదు. హిందూదేశములోని కూలి జనమునకు బనిపాటలు కల్పింపబడుటకే ఈ కెన్యా కాలనీ యేర్పాటు చేయబడినదని అప్పుడు చెప్పబడుచుండెను. ఈ కారణము చెప్పియే మ్యాన్చెస్టరు, బర్మింగుహామ్, లివర్పూలు, గ్లాస్గోలలోని వర్తకసంఘములు ఉగాండా రైల్వే వేయుటకు బ్రిటిషు గవర్నమెంటును బలవంతపెట్టెను.

సర్ హెన్రీజాన్సుటన్, విన్సుటన్ చర్చిల్, జాన్ ఎయిన్సువర్తు మొదలగు బ్రిటిషు రాజ్యాంగ వేత్తలు భారతీయులు కెన్యా రాష్ట్రనిర్మాణమునకు తోడ్పడిన విధము నెంతయో కొనియాడిరి. హిందూదేశపు సిపాయిలే కెన్యాదేశమును జయించి అందు శాంతి భద్రతలను నెలకొల్పుటకు తోడ్పడిరి. గతయుద్ధములో గూడ హిం

దూదేశపు సిపాయిలే కెన్యాబ్రిటిషు సామ్రాజ్యములోనుండి తప్పి పోకుండ కాపాడగలిగిరి. హిందూదేశమునుండి వలసబోయి, మూడు తరములనుండియు, నచ్చటనే కాపురము చేయుచుండిన హిందూ కుటుంబము లెన్నియో గలవు. ఈ కుటుంబములవారి చేతులలోనే కెనియాలోని వర్తకవ్యాపారము చాలవఱకు గలదు. ఇచ్చటి పరిపాలనాపద్ధతి, చట్టములు, బ్రిటీషుఇండియా ననుసరించియే చేయబడినవి. మొన్నటివఱకు ఇండియన్ నాణెములే చలామణిలోనున్నవి. కాని స్వల్పసంఖ్యాకులైన తెల్లవారి లాభము నిమిత్తము ఇండియన్ కరెన్సీని నిలిపివేసి, బ్రిటీషు కరెన్సీని నెలకొల్పిరి.

ఈ కెన్యా పరిపాలనము కలోనియల్ ఆఫీసునకు మార్చబడనంతవఱకు భారతీయుల సేవ నుగ్గడించుచుండెడివారు. బోయరు యుద్ధమైన పిమ్మట జాలమంది బోయరు లీప్రాంతమునకు వచ్చిరి. వారితోబాటు జాతిద్వేషముకూడ సంక్రమించినది. 1908 లో పరిపాలనా సౌకర్యమునకని కారణముచెప్పి, యురపియనులు నివాసముచేయుచున్న హైలెండు ప్రదేశములో భారతీయులకు భూముల నిచ్చుట మానివేసిరి. భారతీయుల యనుమతిలేకయే యీ చట్టముచేయుట విశ్వాసభంగమని భారతీయు లప్పుడే ఖండించిరి. ఈ ప్రదేశముఒక యురపియనులకే ఆపియుంచవలదను నియమము పూర్వమెన్నడును లేదు. కాని యిప్పుడు భారతీయులెవరును వ్యవసాయపు భూమి లీప్రాంతములో సంపాదించుటకు వీలులేకుండ జేయుబడినది. 1915లో సైనిక శాసనము అమలులో బెట్టబడినది. ఈ శాసనము ప్రకారము భారతీయులు సమానస్వత్వములకై పోరాడరాదు. ఈ చట్టమును జాటుచేసికొని భారతీయుల కంతకుపూర్వముండిన హక్కులుగూడ నూడపెఱకబడినవి.

1919 మొదలుకొని నేటివఱకు భారతీయులకు తెల్లవారికిని న్యాయసమ్మతముగ రాజీకుదుర్చుటకు అనేకప్రయత్నములు జేయబడినవి. కాని తెల్లవారి దూషణకు బాల్పడుటతప్ప మరియెట్టి

ప్రయోజనము లేకపోయెను. భారతీయులు తెల్లవారితో సమానులని ఆచరణలో గాకపోయినను, సూత్రములో నంగీకరింపబడిన జాలునని భారతీయులు సభజేసి తీర్మానించిరి. 1921 లో జరిగిన సామ్రాజ్య శాసనసభయందు ఒక్క దక్షిణాఫ్రికావారు తప్ప తక్కిన రాష్ట్రములవారెల్లరు సమత్వము నొప్పుకొనిరి. ఈసూత్రమును కెన్యా యందు ఆచరణలో బెట్టుటకనేక ప్రయత్నములు జరిగినవి. కెన్యాగవర్నమెంటువారు వారితో సంప్రదించిరి. అనేకమైన చిత్తుతీర్మానములు వ్రాయబడెను. కాని అవి యెప్పుడును బ్రకటింపబడలేదు. తెల్లవారికి అవికూడ దుస్సహములయ్యెను. తెల్లవారు సభలుచేసి వానిని ఖండించిరి. ఆచిత్తు నిబంధనవిది:-

1 హైలెండ్సులో తెల్లవారు కానివారికి భూములనియ్యకపోవుటయను విషయమును ప్రస్తుతము మార్చగూడదు. ఇండియా ఆఫీసువారు ముందీవిషయమును తిరిగి ఆలోచించవచ్చును.

2. క్రొన్ని ప్రాంతములలో భారతీయు లిండ్లుకట్టు కొనకూడదను నిబంధనను గొట్టివేయవలెను. ఇండ్లుకట్టుకొనదలచిన వారు బిల్డింగు, సానిటరీ, నియమములకు లోబడి యుండవలెను.

3. వయస్సువచ్చిన తెల్లబ్రిటీషుపౌరులెల్లరు వెంటనేవోటర్లుగ రిజిష్టరు చేయబడవలెను. ఇకముందు తెల్లవారుకాని బ్రిటిషుపౌరులు వోటుఅధికారమును సంపాదించుటకు విద్యావిశేషమును, ఆస్తి నియామకమును, నిర్ణయము కావలెను. ఈనియమము వలన ప్రతితెల్లవాడును వెంటనే వోటరగుటకు స్వాతంత్ర్యముగలదు. కాని భారతీయులలో పదికి తొమ్మిదిమంది వెంటనే వోటర్లగుటకు వీలు లేదు. శాసనసభలోని 11 అనుద్యోగీయుల పదవులలో 7 పదవులు తెల్లవారికే నిర్ణయింపబడినవి.

4. ఇకముందెవరును వలసకురాగూడదు. అవసరమునుబట్టి కలోనియల్ ఆఫీసువారు ఈనిబంధనను నిర్ణయించుచుందురు.

ఈ నిబంధనలను యురపియనులు ఆలోచించుట కైనను ఒప్పుకొనరైరి. 1902 లో ఎల్గిను ప్రభువు గావించిన వాగ్దానమునకు వ్యతిరేకమైనను హైలెండ్సులో భారతీయులకు భూములియ్య గూడదని యురపియనులు ఖండితముగ జెప్పుచున్నారు. అందరికి సమానముగ వోటింగు అధికార ముండకూడదనియు, ప్రత్యేక ప్రాతినిధ్య మియ్యవలసినదనియు, వాదించుచున్నారు. కెన్యాలోని 10000 మంది యురపియనులు, ప్రభుత్వాధి కారమంతయు దమ హస్తగతమై యుండవలెనని కోరుచున్నారు. 1921సం॥లో బ్రిటిషు సామ్రాజ్య సభయందు అంగీకరింపబడిన సర్వసమానత్వమును వీరు నిష్కపటముగ నిరాకరించుచున్నారు. కెన్యాలోని స్వదేశస్థు లను గాపాడునిమిత్తము తెల్లవారికే సర్వాధిపత్య ముండవలెనని ప్రతి ఘటించుచున్నారు.

తుదకు కెనయాసమస్యనుగురించి యింగ్లండునకు రాయబారము వెళ్ళిన శ్రీనివాసశాస్త్రి, జమ్నాదాసు ద్వారకదాసు, కామతు, పోలక్, మున్నగు భారతీయప్రముఖులు ఈ జూలై నెల 17 వ తేదీని వలస రాష్ట్రముల మంత్రిడెవన్‌షైర్ ప్రభువుగారి నీవిషయమై సందర్శించి మాట్లాడిరి. వీరుగావించిన సర్వప్రయత్నములును వ్యర్థమైనవి. తెల్ల వారికేవిజయము కలిగినది. అచటిశీతభూములలో నల్లవారికెట్టి యా స్కారమునులేదు, శాసనసభల యెన్నికలలోగూడ తెల్లవారికే యె క్కువప్రాతినిధ్యాధికారములొసంగబడినవి. యిండియాగవర్నమెంటు వారు భారతీయుల పక్షము వహించి వాదించినను లాభములేక పోయెను. బ్రిటిషు మంత్రివర్గము కెనియాలోని తెల్లవారియెడలనే పక్షపాతము వహించిరి. సంస్కరణముల రంగిప్పటికైనను తేలి నదా? మనపెద్దల కిప్పటికిని వానిపై విశ్వాసము తగ్గలేదుకాబోలు !

5 వ అధ్యాయము.

# అకాలీ ఉద్యమము

——:o:——

పంజాబు రాష్ట్రము యొక్క విస్తీర్ణము 1 లక్ష 36 వేల చతురపు మైళ్లు. జనసంఖ్య 2½ కోట్లు. ఇందులో సుమారు సగముమంది మహమ్మదీయులు, మిగిలిన సగములో 3 వంతులు హిందువులు, ఒక వంతు సిక్కులు. 1911 వ సంవత్సరము జనాభాప్రకారము సుమారు 30 లక్షలమంది సిక్కులు యిండియాదేశములో గలరు. ఇప్పటికి సుమారు 475 సంవత్సరములకిందట గురునానక్ అనుమహనీయుడీ మతమును స్థాపించెను. దీనికికొన్ని ప్రత్యేక లక్షణములు, ధర్మములు, ఆచారములుగలవు. 17 వ శతాబ్దాంతము వరకు శాంతముగానే యీమతము అభివృద్ధిజెందుచుండెను. తరువాతఔరంగజేబు హయాములో బయలుదేరిన హిందూమహమ్మదీయ మత సంఘర్షణలో నీసిక్కులు సాయుధపాణులై తమమత సంరక్షణాభి వృద్ధులను గావింపదొడగిరి. ఈమతపీఠము నలంకరించిన పదిమంది గురువులలో కడపటివాడైన గురుగోవింద సింగుగారి హయాములోనే సిక్కుమత మీ కొత్తపథమును దొక్కినది. వీరి గురుబోధలన్నియు గ్రంథస్థము జేసి దానికి ఆదిగ్రంథమని పేరుబెట్టి మహాపవిత్రముగ నెంచి పూజించుకొందురు. దానినివారు గురుగ్రంథస్వామి యనిభక్తితో బిలుతురు. నాగరలిపికి కొంచెము సమీపముగానుండు పురాతన పంజాబీ భాషాలిపికే గురుముఖియని పేరు. గురుగోవింద సింగునాటి నుండి యీసిక్కులు మతావేశులైన పౌరుషజాతిగా నున్నారు. ఇప్పటికిని వీరిలో చాలమందికి సైనికసేవయే జీవనము. యుద్ధమన్నను మృత్యువన్నను వీరికి భయములేదు.

ఈమతగురువుల జీవితముతో సంబంధించిన ప్రదేశములనెల్ల పవిత్రములుగా భావించి అచట దేవాలయములుగట్టి గురుగ్రంథస్వామి నందుస్థాపించి భగవన్నామ కీర్తనాది సత్కాలక్షేపములు

జేసికొనుచుందురు. ఈ దేవాలయములకు గురుద్వారములనిపేరు. ప్రతి గురుద్వారమునకొక మహంతు అధిపతిగా నుండును. సిక్కు మతస్థులైన యనేకమంది సంస్థానాధిపతులును, ధనాఢ్యులును, యీ గురుద్వారముల పోషణార్థమై యిచట మన దేవాలయములకువలెనే గొప్పగొప్ప యీనాములను జాగీరులను, మాన్యములుగానిచ్చిరి. కొన్ని గురుద్వారములకు సంవత్సరమునకు కొన్ని లక్షల తరబడిఆదాయమువచ్చే మాన్యములు గలవు.

తక్కిన మతములవలెనే కాలక్రమమున ననేక దురాచారములు ప్రబలి వేళ్ళుబారిపోయినవి. అసలు సిక్కుమతమునకు కేవలము విరుద్ధమైనయభ్యాసములు, కర్మకాండలు, మూఢాచారములు విపరీతముగా ప్రబలినవి. సిక్కులలో మతవిశ్వాసము తగ్గిపోవుచుండెను. ఆంగ్ల విద్యాభ్యాసమును, పాశ్చాత్య సంసర్గముగూడ నిందుకు గొంత తోడ్పడినవి. మతాంతరులైన హిందూబ్రాహ్మణుల చేతులలో కొన్ని గురుద్వారములు చిక్కినవి. హిందువులే సిక్కు గురుద్వారములలో మహంతులుగా నుండిరి. వీరుసిక్కుధర్మ విరుద్ధముగా నందు విగ్రహములను నెలగొల్పుట, వర్ణధర్మములను అస్పృశ్యతాదులను పాటించుట మొదలగు కార్యములను జేయుచుండిరి. కొందరు మహంతులు బహిరంగముగా త్రాగుబోతులు, జూదరులు, వ్యభిచారులు, భోగపరాయణులు, విషయ లాలసులునై సమృద్ధిగానున్న గురుద్వారముల ధనమును దుర్వినియోగము చేయుచుండిరి. వీరి దుర్మార్గములనెల్ల యామోదించుచు వీరికి సహాయముగా నుండు కొందరు స్వార్థపరులను జేరదీసి వారియిష్టమువచ్చిన యాటలాడుచుండిరి. దేశములో నిటీవల బయలుదేరిన ఆధునిక జాతీయ భావాభ్యుదయముచే ప్రేరితులైన కొందరు యువకులు బయలుదేరి తమమతమును సంస్కరించుకొనదీక్షబూనిరి. అందుచే ముందు గురుద్వారములను స్వాధీనము జేసికొని సరియైన మార్గములో బెట్టుట మొదటిపనిగా నెంచుకొనిరి.

ఈకారణముచే మహాంతులకును సిక్కుమత సంస్కారులైన * అకాలీలకును సంఘర్షణ తటస్థమయ్యెను.

మొట్టమొదట కొంద రకాలీలు దౌర్జన్యము నుపయోగించి మహాంతుల యొద్దనుండి గురుద్వారములను స్వాధీనము చేసికొన నెంచిరి. ఈసందర్భమున ననేకమైన వాజ్యములు, పోట్లాటలు, దెబ్బలాటలు, శిక్షలు మున్నగు ఘోరములెన్నియో జరిగి సిక్కుసంఘమంతయు మహా కల్లోలముగా నుండెను. ఈమత సంస్కరణోద్యమమట్లు దేశములో నొకమూల విజృంభించు చుండగా నింతలో భారతవర్షమున కెల్లనూతన జీవస్వరూపముల నొసంగిన దౌర్జన్య రహిత అసహాయ మహొద్యమమును గాంధిమహాత్ముడు ప్రారంభించి నడుపుచుండెను. ఈ యకాలీలలో జాలమంది యువకులు జాతీయ వాదులు, నసహాయ వాదులునై పోయిరి. అప్పుడువీరిలో తమ గురుద్వారోద్యమమును అసహాయవాద సిద్ధాంతముల ననుసరించి దౌర్జన్యరహితముగా, ఆత్మసమర్పణ బుద్ధితో నిర్వహింతుమని కొందరును, తద్వ్యతిరేకులు కొందరును భేదాభిప్రాయులైరి.

* (అకాలీఅనగా కాలములేనివాడు, మరణములేనివాడు. దేవత్వసిద్ధి బొందినవాడు. సిక్కు దేవాలయములను, సంరక్షించి సిక్కుమత పవిత్రతను గాపాడుటకై తమజీవితమును సమర్పించిన వారికిది లభించునని వారినమ్మకము. గురుగోవిందసింగు నాటినుండి యీ పేరు వాడుకలోనున్నది. సిక్కులందరికి నిదిసాధారణము గావర్తించును అకాలీయని ప్రత్యేక శాఖలేదు, మతచిహ్నముగా వీరైదు వస్తువుల నెల్లప్పుడును ధరించవలెను (1) కృపాణము (కత్తి) (2) కేశములు (వెంట్రుకలు) (3) కాంగా(దువ్వెన) (4) కారా (ఇనుపకడియము) (5) కచ్చా (లాగు) ఈ కృపాణము ధరించు విషయములోనే ఆయుధశాసన మభ్యంతరమురాగా ప్రభుత్వమువారితో చాలకాలము తగాదాపడి ఏవోకొన్ని మార్పులు చేయించుకొనిరి. వీరికి క్షురకర్మలేదు)

ధనాఢ్యులును, సుప్రసిద్ధులును అనుభవవయో వృద్ధులునైన సిక్కులనేకమందీయుద్యమములో జేరిరి. ఇట్టివారిలో సర్దార్ బహద్దరుమహతబ్ సింగు గారగ్రగణ్యులు. ఈయన గవర్నమెంటు ప్లీడరు! పంజాబు శాసనసభకు అధ్యక్షుడుగానుండెను. మితవాది. సిక్కుమహాజనసభలో (ఖాల్సా) శాంతయుతముగాను, దౌర్జన్య రహితముగాను, తమ మతస్వాతంత్ర్యమును సంపాదించుకొనవలెనని మహాత్ముని యుపదేశాను సారముగా దీర్మానముకాగానే యీయనవచ్చి యీ యుద్యమములో జేరి నాయకుడై తమసభవారి యాజ్ఞప్రకారము తన ప్రభుత్వోద్యోగములకెల్ల రాజీనామా యిచ్చెను. అకాలీలు పంజాబు రాష్ట్రములో సిక్కులున్న ప్రదేశములందెల్ల గ్రామతాలూకా, జిల్లాసంఘములను మంచికట్టుదిట్టములతో నిర్మాణము జేసి ప్రతిసిక్కునిందు సభ్యునిగా జేర్చి యెన్నికపద్ధతులతో నిజమైన అఖిలసిక్కుజన ప్రాతినిధ్యముగల శిరోమణిగురు ద్వారప్రబంధక కమిటీయను నొకసంఘమును 1920 సం॥ అక్టోబరులో నేర్పాటుజేసి, గురుద్వారములనెల్ల నీసంఘమువారు స్వాధీనముజేసికొని, మహంతుల నియమించి, క్రమమార్గమున పరిపాలించవలెనని తీర్మానముజేసిరి. ఇంతకు బూర్వమే అమృతసరములోనున్న సువర్ణదేవాలయ ది కొన్ని గురుద్వారములను ప్రభుత్వమువారు జోక్యము కల్పించుకొని తమయిష్టము వచ్చినవారిని మహంతులుగా నియమించుచుండిరి. ఇది సిక్కులకు మరింత కోపకారణమయ్యెను. ఆదేవళముల ఆదాయ వ్యయములను ప్రజలకెవరును లెక్కజెప్పరు. సమస్తపాపములకు నీదేవళములు నిలయములగుచుండ, నేమినీయక్రమమని సిక్కుమహాసభలు గోలబెట్టుచుండ నాలించువారు లేకుండిరి. అకాలీలు తమ సంఘమును ముందు కట్టుదిట్టములుజేసి కొనుచుండుట జూచి కొందరు మహంతులు భయపడుచుండిరి. కొందరు మతాంతరులైన దుర్మార్గులను పోగుజేసి విచ్చలవిడిగా ధనముఖర్చుపెట్టి అకాలీలను చంపించుటకు బ్రయత్నించుచుండిరి. దేశమంతట కల్లోలపరచిన పంజాబు

హత్యలలో అమృతసర దురంతములకు మూలకారకుడైన డయ్యారు సేనానిని ఇంగ్లాండు వెళ్ళిపోవునపుడే సువర్ణదేశవములోనికి రావించి సిక్కుమతగురువునకువలె గౌరవసత్కారములనెల్ల గావించిరి. దీని కంతకును ప్రభుత్వ నియోజితులైన పూజారి, మహాంతు, మేనేజరు, కారకులు. దీనితో సిక్కుల యాగ్రహము దుర్భరమైనది. ప్రబంధక సంఘము వారొకదానితరువాత నొకటి గురుద్వారములను తమ యాజమాన్యము క్రిందికి దీసికొని తగిన సంస్కరణలు గావించి సరియైన మార్గమున బెట్టుచుండిరి. కొందరు మహాంతులు భయపడి తమంతటతామే వచ్చి వీరికులోబడి వీరితో సమాధానము జేసికొనిరి.

ఈ గురుద్వారములలో కొన్ని మిక్కిలి ముఖ్యమైనవి సిక్కుల పుణ్యస్థలములు. అచట ప్రతియేడు గొప్పయుత్సవములు, సంతలు జరుగును. లక్షలకొలది యాత్రికులువచ్చి కానుకలర్పించుచుందురు. కొన్నిచోట్ల లక్షలతరబడి యాత్రికులకు నుచితముగా అన్నసత్రములు గలవు. వీనికే ధర్మలంగరుఖానాలని పేరు. ఈఖర్చులనెల్ల గురుద్వారముల రాబడినుండియే ఖర్చుపెట్టుదురు. 1921 వ సంవత్సరము ఫిబ్రివరి నెలలో జరిగిన నాన్‌ఖానా హత్యలు సిక్కు సంఘము యొక్క రోషానలమును బ్రజ్వలింపజేసెను. 1920 నవంబరులో జరిగిన ద్వితీయసిక్కుమహాజనసభకు గాంధిమహాత్ముడును, అలీసోదరులును, వచ్చి అకాలీయుద్యమమును దౌర్జన్యరహిత సత్యాగ్రహముగా మార్చివైచిరి. అప్పటినుండి అకాలీలు స్వధర్మరక్షణకై యనుభవించిన కష్టనష్టములు లోకమును దిగ్భ్రమజెందించెను.

ఇంతలో ప్రభుత్వమువారు ఈ గురుద్వారముల విషయమై శాసనసభలో నొకచట్టమును బ్రవేశపెట్టి, సిక్కు సభ్యులును, శిరోమణి సంఘమువారును వలదన్నను గవర్నమెంటువారే తొందరపడి ఆబిల్లును తీర్మానించి వైస్రాయిగారి అంగీకారముతో శాసనముగా చేసిరి. కాని ఏమియు బ్రయోజనము లేకపోయెను. "గురుకాబాగ్" అను ముఖ్యమైన శిక్కుమఠము అమృతసరమునకు 12 మైళ్ళ దూర

ములోనున్నది. ఇక్కడ 2 ముఖ్యమైన గురుద్వారములుగలవు. ఈ మఠమును ప్రబంధక సంఘమువారు స్వాధీనము చేసికొన్నతరువాత సమాధానము సంగీకరించిన మహంతు తిరిగి అధికారవర్గము యొక్క అండజూచుకొని సంఘముపై తిరుగుబాటుగావించి, ఆతోట లోని కట్టెలుకొట్టుకొనిన అకాలీ యాత్రికులను చోరీనేరముక్రింద రిపోర్టుచేసి శిక్ష వేయించెను. ఇది 1922 వ సంవత్సరముఆగస్టు 8 వ తేదీని ప్రారంభము. అప్పటినుండి నవంబరు 17 వరకు అరెస్టులు చేయుచునేయుండిరి. మొత్తమున 5 లేక 6 వేల మంది ఈ యజ్ఞమునకు బలిదానముగా నిలిచిరి. ఈ గురుకాబాగ్ సందర్భమున ప్రభుత్వము వారవలంబించిన వింతదౌర్జన్యపు చర్యలన్నియు నిష్ఫలమై, వీరెంతటి ఘోరకృత్యములకు బాల్పడగలరో లోకమున కింకొక్కసారి వెల్లడియయ్యెను. నిరపరాధులను, ఆత్మసంరక్షణ మునకైనను చేయికదలించనివారిని, శాంతవ్రతులను, పెట్టినబాధలు మేము వేరుగ వర్ణించక, ఆసందర్భములను, కనులారగాంచి వచ్చిన పండిత మదనమోహన మాలవ్యగారి వాక్యముల నీక్రింద బొందుపరచెదము:—

„అకాలీ శిక్కులు అక్రమముగ గుమిగూడినయెడల పోలీసు వారు వారినరెస్టుచేసి విచారణానంతరము దండించవచ్చును. కాని రోడ్డుమీద బోవుచున్న వారిని స్వయముగ నాపి స్మృతి తప్పే వఱకు జావబాదుట కేవలము క్రూరము. ఈసమాచారము దేశీయులనందరిని దుఃఖాంబుధియందు ముంచివైచెను. ఆదారుణచర్యల నాకండ్లార జూచు దురదృష్టము నాకుగలిగినది. ఇదికూడదని అచటనే పోలీసువారిని రెండుపర్యాయములు మందలించితిని. వారు మితిదప్పికొట్టుచున్నారని తెల్పితిని. అట్టిదారుణచర్యల నేమానవుడు సహింపడు. ఈదెబ్బలు తినినవారిలో నూటికి ముప్పదిమంది గత యుద్ధములో గవర్నమెంటువారి పక్షమున పోరాడిన వీరులు. అట్టివారిని ఇత్తడిపొన్నులువైచిన బాణాకఱ్ఱలతో పొడిచిబాదుట

లజ్జాకరము. శిక్కులు పవిత్రముగ నెంచుకొను జుట్టునుబట్టుకొని నేలపైబడవేసి ఈడ్చుటనేమి యనవలయునో తెలియకున్నది.

### అహింసావ్రతము

శిక్కులు ఈసందర్భములో అపూర్వమైన అహింసాధర్మము ను బ్రదర్శించిరి. ప్రపంచములో దీనికిపోలిన నిదర్శనమును గనుట కష్టము. ఇట్టి నిగ్రహము శిక్కుగురువులయొక్కయు గాంధిమహాత్మునియొక్కయు ఉపదేశములవలననే లభించినదనుట నిస్సంశయము. మహాత్ముని బరిహసించిన వారిప్పుడు వానిసేవను ప్రశంసింపగలరు. ఇప్పుడీసిక్కులు దారిజూపిన అహింసావ్రతమునే దేశీయులెల్ల రాచరింపదగినది. ఈత్రోవ తప్పినడచినవారు దేశమునకు శత్రువులుగ భావింపబడుదురు. ఎట్టిబాధలు వచ్చినను అహింసావ్రతమును మాత్రము వీడకుడు. తుపాకీగుండునైన నెదుర్కొనవచ్చును. గాని లాటీదెబ్బలకు మాత్రము నిలువబడుట బహుకఠినము. లాటీదెబ్బలక్రింద శాంతమును వీడకుండ నిలువగలిగిన అకాలీ వీరులనిగ్రహము అతిప్రశంసాపాత్రము. అకాలీనాయకులు చేయుబోధ గూడనిదియే లాటీలు మీవీపులపైబడుచున్నను, చేయినెత్తకుడు. నోటినుండి ఒకదూషణవు బలుకైనను రానివ్వకుడు. అహింసావ్రతమును భగ్నపరుపకుడు." అని శిక్కు ప్రముఖులు తమయనుచరులను ప్రబోధింపుచున్నారు.

### —♦ జనవాక్యము ♦—

పోలీసువారి దారుణచర్యలు మితిమీరియున్నవని ప్రజలు తమయభిప్రాయమును తీర్మానరూపముగ వ్యక్తీకరించవలెను. ప్రజలు ఖండించిన పద్ధతిని ప్రభుత్వము వదులుకొనక తప్పదు. గవర్నమెంటు జనవాక్యమును వినక తమపూర్వపుపద్ధతినే కొనసాగించుచున్నయెడల అకాలీలవీపులపైబడు ప్రతికఱ్ఱ దెబ్బయు, ఇండియాకును ఇంగ్లాండునకును గలసంబంధమును త్రెంచు గొడ్డలివ్రేటుగబరిణమిం

చునని గవర్నమెంటువారు తెలిసికొనెదరుగాక. గవర్నమెంటువారు సర్వశక్తిమంతులు. వారు అకాలీల నణచగలరు. అకాలీలనేగాదు, ఇంకనెక్కువమంది నణచివేయగలరు. కాని అకాలీలును తదితరులవలెనే భారతపుత్రులని మరువగూడదు. అకాలీలు కఠినచిత్తులుగారు. సౌమ్యపద్ధతులచే వారిని శాంతపరచుట కవకాశము గలదు. గవర్నమెంటువారకాలీ యుద్యమమును అణచుటకు బడుచున్న ప్రయాసలో 10 వ వంతును మహాంతులను రాజీపరచుటకు జూపినయెడల సర్వమును సక్రమముగ జరిగియుండును.

అకాలీలను గొట్టుటమానినయెడల గవర్నమెంటున కపకీర్తి రాకుండనుండగలదు. అకాలీలపై కోర్టులలో చర్య జరిపినయెడల గవర్నమెంటుతో నాకెట్టి తగాయిదాయునుండదు. కాని మితిమీరి లాఠీలతో గొట్టించినయెడల ప్రజలు హర్షింపజాలరు."

ప్రభుత్వమువారు మొదట అరెస్టుచేసిన కొలదియు వందలు, వేలు వాలంటీయరులు వచ్చుచుండిరి. జైళ్ళు నిండిపోవుచుండనే గాని, అకాలీయుద్యమమణగిపోలేదు. స్త్రీలు సహితము గృహములను వదలి దళములలోజేరి గుంపులు గుంపులుగ వచ్చుచుండిరి. ప్రభుత్వమువారి యుత్తరువులన్నియు నొకదాని తరువాత నొకటి నిరర్థకములయ్యెను. తుదకుగవర్నమెంటువారొక సిక్కుధనికుని అడ్డము పెట్టుకొని యీపరాజయమునుండి తప్పించుకొనజూచిరి. ఆఖరునకేదో సాకుజెప్పి అకాలీఖైదీలనెల్ల విడుదలజేసి బ్రతుకు జీవుడాయని బయటబడిరి. ఆవివరములనెల్ల గ్రంథవిస్తరభీతిచేతను యిటీవల జరిగినవే యగుటచే పాఠకులకు జ్ఞాపకముండునను గారణముచేతను నింతట విరమించితిమి.

అకాలీల మతస్వాతంత్ర్యమును గాపాడినది గాంధిమహాత్ముని అసహాయ తత్వమో, మాంటాగ్యుగారి నూతనసంస్కరణములో నెవరికివారే విచారించుకొనవలెను.

## 5 అధ్యాయము.

### —♦ న్యాయవిచారణ కార్యనిర్వాహక శాఖావిభాగము ♦—

కొట్లు, తిట్లు, దొమ్మి, ఘాత, మొదలైనవి క్రిమినల్ నేరములు. ఆస్తి హక్కులనుగూర్చిన తగాదాలు సివిలు వ్యాజ్యములు. ఈసివిలు, క్రిమినల్ తగాదాలను విచారించి తీర్పుచెప్పె యుద్యోగవర్గమునకు న్యాయవిచారణ శాఖయనిపేరు

ప్రజలమీాద పన్నులు వేయుట, వసూలు జేయుట, కట్టడములు నిర్మించుట, మొదలయిన దేశపరిపాలన కావశ్యకమగు గార్యముల నెల్ల నిర్వర్తించుచుండు నుద్యోగవర్గమును కార్యనిర్వాహక శాఖ యందురు. డిస్ట్రిక్టుమునసబు, సబుజడ్జి, జిల్లాజడ్జి, హైకోర్టుజడ్జీలు మొదలయినవారు కేవలము న్యాయవిచారణకు సంబంధించిన వారు. వోవరుసీయర్లు, ఇంజనీయరు, స్కూలుఇనస్పెక్టరు, మున్నగు వారు కేవలము కార్యనిర్వాహక శాఖవారు.

ఇంక నీరెండు హోదాలును ఒక్కనియందే గలిసియున్న యుద్యోగులు మరిగొందరున్నారు. జిల్లాకలెక్టరు, కార్యనిర్వాహకోద్యోగిగా పన్నులు విధించి వసూలు జేయుచుండును. అతడే జిల్లా మేజస్ట్రేటుగా క్రిమినలు నేరములు విచారించి శిక్షించుచుండును. ఇదేవిధముగా డిప్యూటీకలెక్టరు — డిప్యూటిమేజస్ట్రేటు-తహశీల్దారు— మేజిస్ట్రేటు మున్నగునవిగలవు. ఇట్లీ రెండుధర్మములు నొక్కరియందే గలిసియుండుటచే బ్రజలకనేక యనర్థకములు, కష్టనష్టములు అన్యాయములు సంప్రాప్తమగుచున్నవి. ప్రజలమీాద రాబడిపన్ను విధించే యధికారియు, ఇదియక్రమమని గోలబెట్టినప్పుడు, విచారించి తీర్పుజెప్పెడి యధికారియు నొకడో, లేక తాబేదారు పైయుద్యోగులో, యగుటచే నెట్టికష్టములు గలుగుచున్నవో చాల మంది కనుభవమే. ఈపద్ధతి బ్రజలయాత్మగౌరవమునకును, స్వాతంత్ర్యనిరతికిని ధర్మాభిలాషకును, దేశాభిమానమునకును, ప్రతిబంధక మగుటయేగాక అధికారవర్గముయొక్క నిరంకుశప్రవర్తనకు మిక్కిలి

దోడ్పడుచున్నది. ప్రజాపీడన మొనర్చుట కిదియొక విశేషాయుధముగా వారికుపకరించుచున్నది. ఏదయిన నొకసందర్భములో నీయుద్యోగులకు బ్రతికూలముగా నడచిన వానినింకొక సమయము జూచి నొక్కి వేయుచుందురు.

దేశీయనాయకులైన పెద్దలందరును రమారమి కాంగ్రెసు బుట్టినప్పటినుండి యీయాక్రమమును దొలగించుటకొరకే "న్యాయవిచారణ-కార్యనిర్వాహక శాఖావిభాగమను పేరనుపన్యాసము లిచ్చి యిచ్చి, తీర్మానములు వ్రాసివ్రాసి భూనభోంతరాళములు మారుమ్రోగునట్లు గందరగోళము జేసిరి. తుదకిప్పటికేమి తేలినది? వడ్లగింజలోనిది బియ్యపుగింజ. "స్వరాజ్యభవనమునకు బునాది, స్వాతంత్ర్య సౌధమున కడుగుమెట్టు. స్వర్గద్వారమునకు తాళపుచెవి" యని మన పెద్దలెగిరి చంకలుగొట్టుకొనిన మాంటుఫర్డు సంస్కరణము లమలులోనికి వచ్చి ఇప్పటికి దాదాపుగా మూడేండ్లయినది. మొదటి పరీక్షకు హాజరయిన విద్యార్థులందరును పరీక్షాధికారుల యనుగ్రహమును మెప్పును వడసిరి. అచిరకాలములోనే రెండవపరీక్ష రానున్నది. ఈ మూడు సంవత్సరములలోనీ స్వల్పసంస్కరణ యేరాష్ట్రములోనైన జరిగితే ఒట్టుబెట్టవలెను.

మన మద్రాసు శాసనసభయందు నీవిషయము మొదటిసారి విచారణకురాగా మనప్రజాప్రతినిధులలో బహుజనులు దీనికిప్రతికూలముగా వోటిచ్చిరి. తీర్మానమోడిపోయినది.* మన బ్రాహ్మణేతర

* రెండవయేడు తిరిగి యీసంగతి చర్చకురాగా నొకయుపసంఘము నేర్పాటుజేసిరి. దానిపర్యవసాన మింకను తేలలేదు. ఈగతియే బీహారు రాష్ట్రములో గూడ తటస్థించినది. అక్కడ సింహప్రభువు గవర్నరుగానుండుటచే తీర్మానము మాత్రము మొదటనే యంగీకరింపబడినది. కాని గవర్నమెంటువారి యామోదముతో నిర్మింపబడిన యుపసంఘముయొక్క నివేదిక యిప్పటికిని వెలువడలేదు. అనేకసారులు దీనింగూర్చి ప్రశ్నించగా ఏప్రిల్ నెలలో బ్రచురింతుమని వాగ్దానము జేసిరి. కాని యిప్పటికిని సివిలియను ఉద్యోగులు దానిని త్రొక్కిపెట్టియుంచిరి. మాంటుఫర్డు రిపోర్టులో బ్రత్యేకముగా నొక్కిచెప్పబడిన యీసంస్కరణగతియే యిట్లుండగ యింక తక్కినవానిసంగతి యడుగనేల ?

సభ్యులిందుకు ముఖ్యకారకులు. వారుజెప్పిన ముఖ్యమైన అభ్యంతర మేమంటే, హైకోర్టుజడ్జీలుగా బ్రాహ్మణేతరు లెవరు నింతవరకు రాలే దుగనుక న్యాయవిచారణాశాఖను విడదీసినచో దానిపైపెత్తనము బ్రాహ్మణ హైకోర్టు జడ్జీలచేతులలో బెట్టవలసివచ్చుననియు ఇందుచే రాష్ట్రములోని బ్రాహ్మణేతర ప్రజలకు నష్టము సంభవించుననియు వారువాదించిరి.

## పోలీసు అధికారము

పోలీసు వారొక యల్లరి గుంపుమీద తుపాకులు పేల్చుట లోను, మందుగుండు సామగ్రి నుపయోగించుటలోను జరుగుచున్న యక్రమమును, క్రౌర్యములను, యవివేకములను తగ్గించుటకును, ఇంగ్లాండు దేశములో నీశాసనము నెంతజాగ్రత్తగానుపయోగింతురో అంతజాగ్రత్తగా నీదేశములో గూడ నీశాసనమును బ్రయోగింప జేయుటకును, గా॥ శ్రీనివాసశాస్త్రిగారు స్టేటు కౌన్సిలుసభయొక్క ప్రథమ సమావేశములో నీవిషయమై యొకబిల్లును (చిత్తుచట్టము) ప్రవేశపెట్టిరి. ఒకగుంపుమీద పోలీసువా రాగ్నేయాస్త్ర ప్రయోగము నారంభించుటకు ముందు జనులందరిని యెవరిదారినివారు వెళ్లి పోవలసినదిగా హెచ్చరించుట పోలీసు వారికి నిర్బంధమైన విధాయకమని యీచట్టములో వ్రాయబడినది. అప్పుడు ప్రభుత్వమువా రందలి ప్రతిభాగమునకు నభ్యంతరముబెట్టి తుదకొక నిరర్థకమైన తీర్మానము నంగీకరించిరి. కాని యీబిల్లుగతి యేమైనదో యెవరికిని దెలియదు. కొంతకాలమున కీవిషయమై యెస్సెంబ్లీలో బ్రశ్న వేయగా ప్రభుత్వమువారు పునర్విచారణమీద నిది యనాచరణీయ మని యెంచి త్రోసివేసినట్లు ప్రత్యుత్తరమిచ్చిరి. స్వాతంత్ర్య మనుభవించుచున్న తక్కిన దేశములలో నింతకంటె నెన్నిరెట్లో కఠినతరమయిన నియమములు పోలీసువారికి విధించి యమలు జరుపుకొనుచుండగా నీమాత్రమైనను పోలీసు నిరంకుశదౌర్జన్యము నాపుట

కీదేశములో వ్యాప్తములేకపోయెనుగదా! ఇదియే నాసంస్కరణల
ఫలితము?

## 144 వ సెక్షనుపై అప్పీలు.

క్రిమినల్ ప్రొసీజరు కోడ్‌లోని 144 వ సెక్షను అసహాయ వాదులమీద అన్యాయముగా దుర్వినియోగము చేయబడుచున్నందున దీనిపై అప్పీలు జేసికొనే యధికారము నొసంగవలెనని ఎస్సెంబ్లీలోను తీర్మానము దెచ్చిరి. ప్రభుత్వమువారు దీనినంగీకరించుచు దీనిక్రింద నొక సవరణను జేర్చిరి. ఇండియాగవర్నమెంటు వారికిష్టమువచ్చిన రాష్ట్రములకే యవకాశ మొసంగబడుననియు, అచటనయినను నీ అప్పీలు విచారణాధికారము జిల్లా మేజస్ట్రీటునకే యుండునుగాని జిల్లాజడ్జికి లేదనియు, సవరణలోనున్నది. దీనియర్థమేమి? ఏరాష్ట్రములో నీ 144 వ సెక్షను స్థానికాధికారులచే దుర్వినియోగము చేయబడుచుండునో ఆరాష్ట్రమును మినహాయించి యవసరము లేని తక్కిన రాష్ట్రముల కా యవకాశమును ప్రభుత్వమువా రొసంగవచ్చును. కావలసినచోట్ల బిగబట్టి అక్కరలేనిచోట ఔదార్యమును జూపించవచ్చును. ఇది సవరణలోని మొదటిభాగముయొక్క ప్రయోజనము.

ఒకవేళ నవసరమయినచోటనే ఈయవకాశము లభించినప్పుడేమి జరుగునో విచారింతము. సాధారణముగా యీ 144 వ సెక్షను ప్రకారము నోటీసులు జారీచేయునది డిప్యూటీమేజస్ట్రీటులు సబుమేజస్ట్రీటులు. వీరుసర్వవిధముల జిల్లామేజస్ట్రీటునకు తాబేదారులు ఆయన కంగీకారములేని కార్యమునుగాని ఆయనసంప్రదింపులేని కార్యమునుగాని వీరుముఖ్యముగా నిట్టి సందర్భములలో జేయసాహసింపరు. జేసినను జిల్లామేజస్ట్రీటు తన యుద్యోగుల ప్రక్కనే భుజము వేయునుగదా! ప్రజలతో సంఘర్షణ తటస్థించినపుడెల్ల తాబేదారులనే పైయధికారులు సమర్థించి వెనుక వేసికొనివత్తురు. ఇది వారిరాజనీతిలోనిభాగము. నిరుపయోగముగా అప్పీ లధికారమిచ్చిరి. ఏమిరా కాటాయంటే యెప్పటియాటే.

### 6 వ అధ్యాయము.

# సంస్కరణల విమర్శన.

(౦)

1919 వ. సం. లో మనకప్పుడు స్టేటు సెక్రటరీగానున్న మాంటాగ్యూ మహామంత్రిగారిచే మనకు బ్రసాదింపబడిన యిండియా రాజ్యాంగ సంస్కరణములను (1919 వ సం. పు యిండియా గవర్నమెంటు ఆక్టు) అనుబంధ మీ గ్రంథమున కనుబంధముగ జేర్చి ప్రకటించితిమి.

యిండియా గవర్నమెంటు ఆక్టునకిది మాటమాటకు తుచా తప్పకుండ జేసిన సరియైన తర్జుమా కాదు. అచటచట కొన్ని సెక్షనులే బొత్తిగా విడిచిపెట్టబడినను, మొత్తముమీద నీ సంస్కరణల వలన దేశపరిపాలనలో దేశీయులకు లభించిన స్వాతంత్ర్యాధికారములను దెలిసికొనుట కావశ్యకమైనంతవరకు శాసనార్థమునకు భంగము గలుగకుండ ముఖ్యభాగములను వదించితిమి. పాఠకులీయధ్యాయమును జదువుటకు ముందుగా నీ యనుబంధమును సాకల్యముగను, సావధానముగను జదువ బ్రార్థితులు.

భారతీయుల యెడల బ్రిటిషు వారికెట్టి యవిశ్వాసమును, అవనమ్మకమును, అనుమానమును, అయిష్టమును, అధైర్యమును, భయమునుగలదో, యీ సంస్కరణ ప్రణాళికలో మొదటినుండి చివరవరకును గూఢముగనో, స్పష్టముగనో వెల్లడియగుచున్నది. దీనిని సాంతముగ పరిశీలించినవారికి, ఈ శాసనము లోని ప్రతి సెక్షనుకు ప్రయోగోప సంహారములనెట్లు కల్పించి, లాగిపట్టిరో, విశదము కాగలదు. భారత రాజ్యాంగ తంత్రమునందలి నిరంకుశ విధాన పరంపర లొక దానిపై నొకటి యెన్నివిధముల కోటగోడలవలె సంస్థాపింపబడి యున్నవో, యీ సంస్కరణములను జూచినను, వీని నియమములను

జూచినను, రాజ్యాంగ విషయ జ్ఞానముబొత్తిగాలేని వారికిగూడ తెలియక మానవు.

ఎవరికి బాధ్యులు:—

1858 వ సం. వత్సరమునందొక యిండియా గవర్నమెంటు శాసనము గావింపబడినదని వెనుకనే వ్రాసియుంటిమి. దానిప్రకారము యిండియాదేశ పరిపాలన విషయములో యిండియా ప్రభుత్వమువారు బ్రిటిషు పార్లమెంటునకును, ఆపార్లమెంటువారు బ్రిటిషు ప్రజలకును, బాధ్యులైయున్నట్లు నిరూపించబడినది. అంతియే గానివీరెవరును భారతీయులకేమియు బాధ్యులుకారు. ఈ యేర్పాటు, ఈ రాజ్యాంగ రహస్యము, ఈ యిండియా పరిపాలనా మూల సూత్రము, అప్పటికిని యిప్పటికిని చెక్కు చెదరకుండ నొక్కమోస్తరుగనేయున్నది. ఈలోపుగా నెవరెన్ని రాజ్యాంగ సంస్కరణములు కోరినను, ప్రతిపాదించినను, మార్చినను, మంజూరుచేసినను, అమలు జరిపినను, 65 సంవత్సరములక్రిందటగావించినమూల సూత్రమును కదలించినవారు లేకపోయిరి గదా!

ఇంచికేపు కమిటీవారు దేశపరిపాలనావ్యయమును తగ్గించే విషయమై జేసిన సిఫార్సులలో, సైనిక వ్యయమును గూడ జేర్చిరి. ఈ సిఫార్సు ననుసరించి ప్రస్తుతము సైనిక వ్యయములో మూడు కోట్లరూపాయల వరకు విఱుగగోయుట కంగీకరించుచు యిండియా దేశపు సర్వసేనాధిపతిగా నున్న రాలిన్సన్ ప్రభువు యిండియా దేశముయొక్క ఆర్థికస్థితి చక్కబడగానే ఈతగ్గింపులను రద్దుచేసి మామూలుగా సైనిక వ్యయమును బెంచవలెననిబ్రిటిషు సేనానాయకులు నిర్ణయము చేసినట్లును, ఆషరతు ప్రకారమే తానీప్రస్తుతపు విఱుగగోత కంగీకరించినట్లును, యెస్సంబ్లీ సభయందే వ్రాక్రుచ్చియుండెను.

మాంటాగ్యూ తన సెక్రటరీ పని మానుకొన్న తరువాత కన్సర్వేటివ్ ప్రభుత్వ మధికారములోనికి వచ్చెను. తరువాత

యిండియా మంత్రిగా వచ్చిన పీల్ ప్రభువును, సహాయమంత్రియగు వింటర్టన్ ప్రభువును, మన గవర్నరు జనరలు బ్రిటిషు పార్లమెంటు నకే బాధ్యుడని యనేక సందర్భములలో నొక్కి చెప్పియుండిరి.

1919 వ. సం. ఇ. గ. శాసనములో నేమి, జాయింటుకమిటీ రిపోర్టులో నేమి, యింక ననేక యితర సందర్భములలో నేమి, యిండియా గవర్నమెంటు వారును యిండియా శాసనసభలును యేకీభవించిన విషయములలో స్టేటు సెక్రటరీ జోక్యము కలిగించు కొనగూడదను సిద్ధాంతము తృణీకరించ బడినది.

ఇండియా శాసనసభలు:—

దేశీయుల కున్నతోద్యోగములిచ్చు విషయములలోను, సేనలో దేశీయులకు సైనిక దళాధిపత్యము (కమీషను నుద్యోగములు) లొసంగుటలోను, యిండియా శాసనసభల యభిప్రాయములను బుట్టదాఖలు జేసిరి.

ముఖ్యముగా దిగుమతిపన్నులు (విదేశములనుండి దిగుమతియగు పదార్థములపై పన్నులు) విధించుటలో, అనగా యిండియా దేశపు వర్తకవ్యాపార పరిశ్రమాదుల నభివృద్ధి చేసికొనుటకు దిగుమతి పన్నులను నిర్ణయించుకొను అధికారమైనను, యిండియా శాసనసభలకు నూతనసంస్కరణల ప్రకారము లభించలేదని, జాతీయవాదు లారంభములోనే యాక్షేపించిరి. అప్పుడు మన మితవాద ప్రముఖులును, అనిబిసెంటమ్మ మొదలైన సంస్కరణాభిమానులును ప్రభుత్వమువారి పక్షమున నిలువబడి యిట్టి యధికారములను లిఖిత పూర్వకముగ శాసనములందు జేర్చుట బ్రిటిషు సాంప్రదాయ విరుద్ధమనియు, చిరకాలానుగతమగు అనుశ్రుతాచారమును బట్టియే క్రమక్రమముగ నిట్టి హక్కులు పొదుకొనుట బ్రిటిషు రాజ్యాంగముయొక్క ముఖ్యలక్షణమనియు చిత్రవిచిత్రముగ వాదించి ప్రభుత్వమును వెనుకవేసికొనివచ్చి సంస్కరణలను సమర్థించిరి. అట్టి దిగుమతి పన్నులను (Tariffs) నిర్ణ

యించుటలో గూడ యిండియా శాసనసభలు బ్రిటిషు పార్లమెంటు యొక్కయు, యిండియా మంత్రియొక్కయు, అభిమతాను మోదములననుసరించి పోవలెనేగాని అందుకు వ్యతిరిక్తముగ నడువరాదని మనసైన్యాధి రెడింగుప్రభువుగారీమధ్యనే బహిరంగోపన్యాసమునందు వక్కాణించిరి. జాయింటు కమిటీ రిపోర్టునందు గూడ సామ్రాజ్య లాభములకు భంగకరము కాకుండినప్పుడే యిండియా శాసనసభలిట్టి దిగుమతిపన్నులు విధించవచ్చునని యొక నిర్ణయము గలదు. దాని యంతరార్థ మిదియే కాబోలు!

యిండియా దేశ వ్యవహారములను సావధానముగను, లోతుగను విమర్శించుటకై యింగ్లాండులో నొక స్థాపితోప సంఘము గలదు. దీనికే జాయింటు స్టాండింగు కమిటీయని పేరు. ఇందలి సభ్యులు పార్లమెంటులోని యుభయవర్గముల నుండి (House of Lords and House of Commons) యెన్నుకొనబడుదురు. ఈ కమిటి వారికి మాంటాగ్యుగారి హయాములో, యిండియా శాసనముక్రింద గావింపవలసిన నిబంధనలను యోచించుటయేగాక, వారి సంప్రదింపుకొరకు బంపినను, లేకున్నను, తమంతటతామే భారతీయ సమస్య లేవియైనను విచారించి నివేదికను బ్రకటించుట విధాయకమై యుండెను. ఈ కమిటీవారెన్నడును యిండియాకు సంబంధించిన యే ముఖ్యవిషయమును విచారించిన పాపమునబోలేదు సరికదా, కెనియా సమస్యను గూర్చియు, యిండియా సైనికావశ్యకములను గూర్చియు, భారతీయాశయములకు కేవలము విరుద్ధమైన భావములను బ్రకటించిరి. పీలుప్రభువుగారు మన స్టేటుసెక్రటరీ పదవిలోనికి వచ్చినతరువాత నీకమిటీవారేవిషయమును తమంతటతాము స్వతంత్రించి విచారించుట కధికారము లేదనియు, పార్లమెంటువారుగాని స్టేటు సెక్రటరీగాని వీరికి బంపినవిషయములను మాత్రమే విచారించుట కధికారము గలదనియు, గ్రొత్తనిర్ణయము గావించిరి. ఈ కమిటీ కావలెనని మనమెప్పుడును కోర

లేదు. ఇప్పుడు వీరి యధికారములు తగ్గిపోయినవని మనకువిచారమును లేదు. కాని యీ మార్పువలన యిండియాదేశ విషయములలో పార్లమెంటు మంత్రుల యుద్దేశ్య మెట్లున్నదో మాత్రము వెల్లడియగుచున్నది.

మన గవర్నరు జనరలుగారు పార్లమెంటువారికిని, పార్లమెంటువారు బ్రిటిషు ప్రజలకును (బ్రిటిషు ప్రజలు భగవంతునికిని) యిండియా పరిపాలన విషయములో బాధ్యులుగా నున్నారనుమాట కొందరికి వినుటకు రంజకముగా నుండవచ్చును. కాని పంజాబు హత్యలవంటి ఘోర దురంతములు అమృతసర నగరములో జరిగినప్పుడు, వానినిగూర్చి హంటరు కమిటీవారు చేసిన సిఫార్సులను బ్రిటిషు వారామోదించుచు, డయ్యర్ సేనాని యొకవేళ పొరపాటుపడి యుండవచ్చునేగాని, సదుద్దేశముతోనే ప్రవర్తించెనని వీరు గావించిన తీర్మానములనుబట్టియే యిండియా ప్రజలను పాలించుటలో వీరికెట్టి బాధ్యతగలదో స్పష్టమగుచున్నది.

ఈ విధముగానే సైనికవ్యయమును తగ్గించుట, భారతీయులకున్నతోద్యోగముల నిచ్చుట, మున్నగు చిన్నచిన్న విషయములలోనేమి, పెద్దవిషయములలోనేమి, వైస్రాయిగారి పరిపాలనతో జోక్యముకలుగజేసికొని, స్టేటు సెక్రిటరీగారు భారతీయుల హక్కులను, అధికారములను, సంకుచితపరచుట ఆచారమైనది, నిజముగా నిట్టి జోక్యమునుగూర్చి మనము దోషారోపణ జేయుట కించుకయు నవకాశము లేదు.

సంస్కరణాభిమానులు:— ఈ సంస్కరణల ప్రకారము కొలదిగనో గొప్పగనో బాధ్యతాయుత పరిపాలనమును రాష్ట్రీయ ప్రభుత్వములందే ప్రారంభమైనట్లు గాన్పించుచున్నదిగాని, కేంద్రి (ఇండియా గవర్నమెంటు) ప్రభుత్వ మెప్పటివలెనే యున్నట్లు యిండియా గవర్నమెంటు శాసనమే యొప్పుకొనుచున్నది. అయినప్పటికిని

శాసనములలో లేకుండ, నుపన్యాసములలో సభారంజకము కొరకును, భాషాసౌష్టవము కొరకును, వెలువరించిన యుదారాశయములనే, పరమ ప్రమాణములుగ సాధారము జేసికొని ప్రజలలో కొందరు భ్రమించుట కవకాశముగలిగెను. నూతన శాసనసభల యొక్క ప్రారంభ సమావేశమున కానాట్ ప్రభువుగారు "నిరంకుశాధికార మీదినమునుండి యంతరించునని" గంభీరోపన్యాసమున సెలవిచ్చిరి. అప్పుడే ప్రభుత్వసభ్యుడగు సర్ విలియమ్ విన్సెంటు గారుగూడ "ఇంకమీద క్రొత్తపన్నులు మీయంగీకారముతోనే విధింపబడున"ని వాక్రుచ్చెను. పాపము! శాసన సభలకేగిన మన పెద్దలా మాయమాటలు నిజమేగదా యని, నమ్మికొని యీమధ్య ఉప్పుపన్నును హెచ్చించినపుడెన్నియో విధముల కాలు దువ్వి ప్రతిఘటించిరిగాని, తుదకు పరాభూతులును ఆశాభంగులు నగుట తటస్థమయ్యెను. ఇందు మొదటివారు రాజుగారి పినతండ్రి. రెండవమనిషి యధికారవర్గములోని యొకసివిలియన్ ఉద్యోగి. గేదెతోకపట్టుకొని గోదావరి యీదబూనినట్లు, వీరి ప్రసంగములు నూంతగాగొని నిరంకుశాధి కారవర్గ మహాపర్వతమును ఢీకొన్న మన శాసన సభ్యులకు శృంగభంగముగాక మరేమి గలుగును? నూతన సంస్కరణలకు పూర్వము యిండియా ప్రభుత్వముయొక్క కార్యనిర్వాహక వర్గములో భారతీయు డొక్కడే యుండెను. ఇప్పుడు ముగ్గురు భారతీయులు కార్యనిర్వాహక సభ్యులుగా నుంచుట కవకాశము గలిగినది. కేంద్రప్రభుత్వములో మునుపటి కంటె మనకిపు డధికముగ లభించిన ప్రయోజనమిది యొక్కటియే యని చెప్పవలెను.

## ఇండియా గవర్నమెంటు

వైస్రాయిగారి కార్యనిర్వాహక వర్గమునందున్న మువ్వురు భారతీయులును మొన్నమొన్నటి వరకు యిండియా గవర్నమెంటు వారి ముఖ్యమైన పరిపాలనా విషయములు కొన్నింటిని నిర్వహించు

చుండగా, కడచిన యేప్రియల్ నెలలో కార్యనిర్వాహక సభ్యులు చేయవలసిన పనులను క్రొత్తగా పునర్విభజనజేసి ప్రాముఖ్యమైన విషయములెల్ల తెల్లవారి హస్తగతముజేసి రెండవ తరగతి పను లన్నియు మనవారికి నొప్పగించిరి. ఇంచికేపు కమిటీవారు వాణిజ్య పరిశ్రమశాఖలను రైల్వేశాఖతో జేర్చకుండా, రైల్వేలు ప్రత్యేకముగా నొకరిచేతిలో నుంచవలెనని చెప్పిరి. కాని రైల్వే వాణిజ్యములనుకలిపి యిన్నినను సివిలియన్ ఉద్యోగి చేతికిచ్చిరి. వాణిజ్యశాఖను ఛటర్జీగారి కివ్వకపోవుట కీయన భారతీయుడనియే గదా యనుమానించిరి! వివిధ విషయములను (General Departments) శాఖలో వ్యవసాయము, అడవులు, వైద్యము, ఆరోగ్యము మున్నగు రాష్ట్రీయ శాఖలనుచేర్చి వానిపై తనిఖీజేయుపని, మన శర్మగారికిచ్చిరి. యిండియా గవర్నమెంటు శాసనములో లేని ద్వంద్వపరిపాలన మొకటి కేంద్రప్రభుత్వములోగూడ నిట్లు ప్రారంభింపబడెను. ఇంక నీసభ్యుల చేతిక్రింది యుద్యోగులైన సెక్రటరీ వర్గమునుగూర్చి యాలోచింతమన్నచో, శాస్త్రీగారివంటి మితవాది అధికారుల వాగ్దానములపై తనకు రోతకలిగినదనియు కార్యరూపమున నించుకయైనను జరుగునేమో చూడగోరుచుంటిననియు, విసుగుతో జెప్పవలసివచ్చెను. పరిశ్రమశాఖా సభ్యుడుగా నున్న ఒక్క చటర్జీగారికి సెక్రిటరీ, డెప్యూటీ సెక్రటరీ, అండర్ సెక్రిటరీ, అను ముగ్గురుతెల్లవారిని తగిలించి కాపలాయుంచిరి. భారతీయుడొక్కడు మాత్రము అసిస్టాంట్ సెక్రిటరీగా నున్నాడు. రైల్వే వాణిజ్యాధిపతికి సెక్రిటరీ, అసిస్టెంట్ సెక్రిటరీ యని యిద్దరు యూరోపియనులు మాత్రమేగలరు. ఈ వర్గములో పదముగ్గురు సెక్రిటరీలలో నొక్కడును, 18 మంది డెప్యూటీ సెక్రిటరీలలో ముగ్గురును, పదిమంది అండర్ సెక్రిటరీలలో నిద్దరును, 20 మంది అసిస్టాంటులలో ఆరుమందియు, మాత్రమే భారతీయులు

న్నారు. ఈ సెక్రటరీ వర్గముయొక్క ప్రజ్ఞామహాత్యములను వేరొకచో వివరముగా మనవిచేసి యుంటిమి.

ఖర్చులపై పెత్తనము :—

ఏపరిపాలనా విధానములోనైన వ్యయముపై నధికారమే స్వాతంత్ర్యమునకు సూచన. యిండియా శాసనసభలో నిట్టి యధికారము మచ్చునకైనను లేదు. ఖర్చు విషయములో జరుగు నేర్పాటులనుగూర్చి శాసన సభయందు చర్చను ప్రవేశ పెట్టవలసిన బాధ్యత యెంతమాత్రమును గవర్నమెంటు వారికి లేదు. "వీనిని గూర్చి గవర్నర్ జనరలుగారు సమ్మతించిననే తప్ప చర్చచేయుటకు గూడ వీలు లేదు" అని శాసనము విధించుచున్నది. కొన్ని విషయములనుగురించి బేర్హాని యింగ్లాండులోని లాయర్లు ఈశాసనవిభాగములను పరిశీలించి, చర్చ కనుజ్ఞ యిచ్చుటకైనను కొన్ని విషయములలో మాత్రమే గవర్నర్ జనరలుగారి కధికారము గలదనియు అప్పుడైనను వోట్లు బుచ్చుకొనుట కసలే వీలులేదనియు వ్యాఖ్యానము జేసిరి. మార్లే సంస్కరణల ప్రకారము 1919 సంవత్సరము వరకు ఆయవ్యయ పట్టికను చర్చించుటకు యిండియా శాసన సభవారికి సంపూర్ణాధికార ముండెను. 67 ఎ. సెక్షను ప్రకారమిూకాస్తయధికార మిప్పు డెగిరిపోయినది. చదువవేసిన తరువాత ఉన్నమతి పోయినది.

దడిదారి :—

ఐనను మొదటియేడు బడ్జటు విచారణలో సైనిక వ్యయమునుగూర్చి కూడ కొంత చర్చను వైస్రాయిగారు సాగనిచ్చిరి. యిండియా గవర్నమెంటువారి బడ్జటులో శాసనసభ్యుల వోటునకు పెట్టతగిన పద్దులు కొన్ని, అట్లు బొత్తిగా వీలులేనివి కొన్ని ఖర్చు పద్దులు గలవు. కొన్నిటిపై అసలు విమర్శనయే పనికిరాదు. కాని మన ప్రతినిధులు తమ తెలివి తేటలతో నొక యుపాయమునుపన్ని

సింహద్వారము మూసియుండగా పెడగానున్న దిడ్డిదారిని నెమ్మదిగా లోపల ప్రవేశింప జొచ్చిరి. వోటునకు రాదగిన కొన్ని ఖర్చుపద్దులలో కొన్ని తగ్గింపులను (విరుగగోతలు) ప్రతిపాదించి ఆసందర్భములో వోటునకు రాదగని సైనిక వ్యయాది పద్దులనుగూర్చి యుపన్యాసములు లగాయించుచుండేవారు. ఈ వక్రమార్గమును సభాపతి గనిపెట్టి యిట్టిచర్చల నాపివేయు చుండెను. కాని తాత్కాలికముగా గవర్నమెంటువారి హోము మెంబరుయొక్క ప్రేరణచే నీవిరుగగోతలు నామమాత్రముగ నున్నపుడిట్టి చర్చను సాగనిచ్చుట కంగీకరించిరి. అనగా యేదోయొక పద్దులో నామకార్థముగా నొక రూపాయో, పది రూపాయలో, నూరు రూపాయలో, తగ్గింపును ప్రతిపాదించి చర్చకవకాశమును గల్పించుకొనుచుండిరి.

అమోఘాస్త్రము :—

ఒకవేళ ప్రజా ప్రతినిధు లేఖర్చు పద్దులనైన తగ్గించినయెడల దానిని వెంటనే గవర్నర్ జనరలుగారు తన ప్రత్యేకాధికారము వలన రద్దుజేసి పునస్థాపన జేయుచుండెను. ఇట్లు గడచిన రెండున్నర సంవత్సరములలోను వైస్రాయిగారు నాల్గుసార్లును, మన మద్రాసు గవర్నరుగారు మూడుసార్లును, బెంగాలు గవర్నరుగారు రెండుసార్లును, ప్రజాప్రతినిధులు నిరాకరించిన వ్యయమును తమ యసాధారణాధికారముతో మరల నిలువబెట్టిరి. (1) యిండియా గవర్నమెంటువారి కడచిన బడ్జెట్టులో రైల్వేల వ్యయమునందు 164 లక్షల రూపాయలు తగ్గించుటకు అసెంబ్లీవారు తీర్మానించగా 50 లక్షలకుమాత్రము గవర్నమెంటువా రంగీకరించి తక్కిన 114 లక్షలు వీరి యభిమతమునకు వ్యతిరేకముగ 'సర్టిఫై' యధికారముతో నిలువబెట్టి తిరిగి చేర్చుకొనిరి.

(2) ఉన్నతోద్యోగముల జీతభత్యములనుగూర్చి విచారించుటకై రాయల్ కమీషనను నొక విచారణ సంఘము నేర్పరచిరి

ఈసంఘముయొక్క ఖర్చులనిమిత్తము మూడులక్షల రూపాయలను యెస్సెంబ్లీవారు నిరాకరించినను వైస్‌రాయిగారు మరల నిదేవిధము గా జేర్చిరి.

(3) పదునాల్గు మాసములలో శాసన సభవారు మూడుమార్లు నిరాకరించిన ఉప్పు పన్నును వైస్‌రాయిగారిట్లే మంజూరు జేసిరి. ఈ యుప్పుకథయంతయు ప్రత్యేకమొక యధ్యాయములో సాంగోపాంగముగ వ్రాయబడినది.

(4) కొంతకాలము క్రిందట ప్రజాస్వామ్య నిరోధక శాసనముల గొన్నింటిని రద్దుజేయుటకై తేజ్ బహదూర్ సప్రూగారి యధ్యక్షతక్రింద నొక యుపసంఘ మేర్పడి 17 క్రూరశాసనములను రద్దుచేయుటకు సిఫారసు జేసిరి. అందు వార్తాపత్రికల యొద్దనుండి ధరావతు కోరెడి ముద్రిణా శాసనముకూడ గలదు. అందుపైన బ్రిటిషు యిండియాలో స్వదేశ సంస్థానాధిపతులను గూర్చియు, వారి రాజ్యములను గూర్చియు, ప్రకటించువార్తాపత్రికలపై న్యాయస్థానములలో చర్య జరుపుట కవకాశము కావలయుననియు, సంస్థానాధిపతులను రక్షించుట యవసరమనియు, జెప్పుచు ప్రిన్‌సెస్‌ప్రొటెక్షన్ బిల్లు (సంస్థానాధిపతుల సంరక్షక శాసనము) అను నొకచట్టమును యెస్సెంబ్లీ తీర్మానమునకు వ్యతిరేకముగ వైస్‌రాయిగారు సర్టిఫికేట్ అధికారముతో మంజూరుచేసి శాసనము గావించిరి.

రాష్ట్రీయ ప్రభుత్వము:—

క్రొత్తసంస్కరణలు అమలులోనికి వచ్చేముందు సివిలియను ఉద్యోగులు తొందరపడి తమ జీతములను వృద్ధి చేయించుకొనిరి. సైనిక వ్యయమును తగ్గించే విషయములో యింగ్లండులోని యుద్ధపు ఆఫీసువారును ఇండియా ఆఫీసువారును ఇంచికేపు కమిటీవారి సిఫారసుల నాలోచించుచున్నారనియు, ఉన్నతోద్యోగులందరి జీతములను బాగుగా తగ్గించినను కావలసినంతమంది

మనుష్యులీయుద్యోగములకు సులభముగా లభింతురనియు, అయినప్పటికిని ప్రస్తుతము సైనికోద్యోగము లందున్న వారి జీతము తేనియు, తగ్గించ దలచుకొనలేదనియు, డెర్బీ ప్రభువు నిర్భయముగా బ్రకటించెను. ఇంతేకాక ఉన్న తోద్యోగులకు ప్రస్తుతపు జీతములే చాలుటలేదనియు ఇంకను జీతము లెక్కువగావలెననియు మరియొక యూర్చాటము బయలుదేరినది. ఈ విషయములో ఇండియా శాసనసభలు చేయవలసిన దేమియు లేదుగదా.

నామమాత్రముగనైన కేంద్ర ప్రభుత్వమునందులేని బాధ్యతాయుత స్వపరిపాలన, రాష్ట్ర ప్రభుత్వములలో కొన్ని శాఖలకు మాత్రము, మాదిరిగా వర్తింప జేయబడినది. ఇట్టి ద్వంద్వప్రభుత్వమును ప్రజా ప్రతినిధులలోనుండి నియమింపబడిన మంత్రులును శాసనసభకు బాధ్యస్తులుగాని కార్యనిర్వాహక సభ్యులును గలిసి నిర్వర్తించవలసి యున్నది. ఈ యుభయవర్గములు నొకరితో నొకరు నిరంతరము సంప్రదించుచు, రాష్ట్రాధిపతి నుభయులకును మధ్యవర్తిగా బెట్టుకొని వ్యవహరించుచుండవలెనని జాయింటుకమిటీ రిపోర్టునందును, గవర్నర్లనునియమించినపుడు వారికొసంగు నుపదేశ మంజరిలోను (Instrument of instructions), స్పష్టముగా జెప్పబడినది.

పొదుపులేని సంసారము:—

ఈ మధ్య కొందరు వర్తకులు మద్రాసుగవర్నరు వెల్లింగ్డను గారి కొసంగిన విందులో గవర్నరుగారు "మేమందరము పొదుపులేని యొక కుటుంబమువలె సౌఖ్యముగా నున్నామ"ని గంభీరోపన్యాసమిచ్చిరి. ఆ మరునాడే ఇరిగేషనుబిల్లును శాసనసభలో ప్రవేశపెట్టవలెనని ప్రతిపాదించినపుడు ప్రవేశమునకైన నవకాశము లేకుండా మొదటిచర్చలోనే తుంచివేయబడెను. కార్యనిర్వాహక వర్గము వారును, మంత్రులు నేకగ్రీవముగా దీనినిముందామో

దించి యున్నచో, మంత్రుల కనుచరులును, వారికి నిరంతరము ఆసలాగా నుండువారునైన శాసనసభ్యులు, సభలో దీనినేల త్రోసివేసిరి. అథవా శాసనభ్యుల కిష్టములేదని మంత్రులకేముందుగా తెలిసి యున్నయెడల తామెట్లు కార్యనిర్వాహక వర్గమువారితో నేకీభవించగలిగిరి. పోనీ యొకవేళ మంత్రి లంగీకరించనే లేదనుకొందమా ఆక్రిందటి దినముననేగదా గవర్నరుగారు సుఖముగానున్న పోరుపులేని కుటుంబమని చెప్పిరి ? ఇందేదినిజము? అన్నియు నిజమైనచో నొకటే సమాధానము గన్పించుచున్నది. గవర్నరుగారు చెప్పినది నిజమే. మంత్రులామోదించి యుండవచ్చును. శాసనసభ్యులు మంత్రులతో లోపాయికారీగా నేమిచెప్పినను తీరా సభలోనికివచ్చి ప్రతికూలముగా వోటిచ్చి యుండవలెను.

ఇదే విధముగా విద్యాశాఖ మంత్రియగు పాత్రోగారువిశ్వవిద్యాలయ చట్టమును బ్రవేశపెట్టినపుడు కార్యనిర్వాహక సభ్యుడును విశ్వవిద్యాలయమునకుపాధ్యక్షుడును(Vice Chancellor)నైన శ్రీనివాసయ్యంగారు దక్షిణాదినిమాట్లాడుచుఆచట్టమును నిరసించిరి. ఈలాగుననే ప్రయాగరాష్ట్రమునందొకసందర్భమునమంత్రులకువ్యతిరేకముగా నొకకార్య నిర్వాహక సభ్యుడు వోట్లు ప్రోగుచేయుటకు ప్రయత్నించెనని శ్రీనివాసశాస్త్రిగారు బహిరంగోపన్యాసములో జెప్పిరి. ఆరాష్ట్రములోనే యింకొక కథ జరిగినది. సి. వై. చింతామణిగారు రచట విద్యాశాఖకు మంత్రిగానుండిరి. అందుచే నీయనే ఆశాఖ కంతకును ముఖ్యాధిపతి. అనగా డిపార్టుమెంటుకు హెడ్. ప్రభుత్వోద్యోగు లెవరైనను సెలవ్యాజ్యములకొరకైనను న్యాయస్థానముల కెక్కుటకు ముందు, తమ శాఖాధిపతియొక్క యనుజ్ఞ బొందవలెనని యొక నియమముగలదు. ఆరాష్ట్రములో డిలాఫాసీ అనునతడు విద్యాశాఖా డైరక్టరుగాను విశ్వవిద్యాల యోపాధ్యక్షుడుగా నున్నాడు. అచటి సిండికేటు (విశ్వవిద్యాలయ కార్యనిర్వాహకసభ) సభ్యుడగు పండిత ఇగ్బల్ నారాయణ గుర్తుగారు

డీలాఫాసీగారిపై లంచము పుచ్చుకొనినట్లు దోషారోపణ జేసిరట. అందుమీఁద ఫాసీగారు గుర్తుగారిపై పరువునష్టపువ్యాజ్యము వేసెను. మామూలు విధిక్రమము ననుసరించి యీ దావా తెచ్చుటకుముందు డీలాఫాసీగారు తమ డిపార్టుమెంటల్ హెడ్‌గానున్న చింతామణి గారి యనుజ్ఞ బొందియుండ వలెను. అట్లుజేయక తిన్నగా గవర్నరుగారితోనే మాట్లాడుకొని యీచర్య దీసికొనెను. తన సంప్రదింపులేకుండ గవర్నరుగారిట్లనుజ్ఞ యిచ్చుట ఆక్షేపణీయమని జెప్పి చింతామణిగారు తన మంత్రిపదవికి రాజీనామానిచ్చిరి. మంత్రులను కార్య నిర్వాహక సభ్యులతోబాటు సమానముగా గవర్నరుగారు జూచినప్పుడిట్టి నిదర్శనము తటస్థించి యుండదుగదా!

జ్యోతిషము నిజమైనది:—

ఇటీవలనే చింతామణి, సప్రూ, రెడ్డినాయుడుగార్లు ద్వంద్వ పరిపాలన నిరర్థకమైనదని బహిరంగముగా నుడివిరి. కొన్ని శాఖలు మాత్రమే డబ్బులేకుండ మంత్రుల యధీనములో నుంచుటవలన యేవిషయమును యభివృద్ధి చేయుటకుగాని సంస్కరించుటకుగాని వీరు ప్రయత్నించినపుడెల్ల కోశాధిపతియైన ఆర్థికసభ్యుడడ్డమువచ్చుచుండును. ఏయభివృద్ధిజేయుటకును సొమ్ము గన్పించదు. పరిశ్రమలను పెంపొందింపవలెనన్న గనులు, ఫ్యాక్టరీలు, విద్యుచ్ఛక్తి, కూలి మొదలగువానిపై నధికారములేదు. వ్యవసాయము నభివృద్ధి చేయవలెనంటే పంటకాల్వలపై (ఇరిగేషను) నధికారములేదు. ఇవి యన్నియు నూతనముగా గన్పించిన లోపములుగావు. ద్వంద్వ విధానము సూచింపబడినపుడే యీ చిక్కన్నియు గలుగునని జ్యోతిషము చెప్పిరి. అది యంతయు నేడనుభవ వేద్యమగుచున్నది.

గతకాలమే మేలు:—

నూతన సంస్కరణల వలన పూర్వపు కార్యములకే భంగము కలిగినదని యిండియా గవర్నమెంటువారి బడ్జెటు చర్చలో

సూచింపబడెను. ఇట్టి (వెనుకనడక) రాష్ట్ర పరిపాలనలో గూడ గన్పించకపోదు పూర్వము సివిలుయను ఉద్యోగులె గవర్నమెంటు మెంబర్లుగా నున్నపుడు మ్యునిసిపాలిటీ, లోకలు బోర్డులకు, సంబధించిన ఏనూతన నిబంధనలు గావించినను, వానినిగూర్చి ముందుగా ఆయాస్థానిక సంస్థలతో సంప్రదించిన తరువాతనే జేయుచుండెడివారు. ఇప్పుడన్ననో క్రొత్తక్రొత్త నిబంధన లనుదినమును మంత్రులు తమంతట తామే జారీచేయుచున్నారు. విశ్వవిద్యాలయముచేగాని గవర్నమెంటువారిచేగాని యామోదింపబడని, యేపాఠశాలకును ధన సహాయము (Grant) నొసంగ కూడదని మునిసిపాలిటీ లోకల్ బోర్డులకు మనమంత్రి రామారాయణంగారు తాఖీదులు జారీచేయించిరి. ఇందుకు నిదర్శనముగా కడచిన ఏడెనిమిది సంవత్సరలము నుండియు జాతీయపాఠశాలలకు మునిసిపాలిటీ లొసంగుచున్న గ్రాంటులనెల్ల రద్దుచేసి, యంతటితో తనివి జెందక యేలోకల్ బోర్డు, మునిసిపాలిటీలైనను, ఇట్టిగ్రాంటు చెక్కులను బంపినయెడల వానిని మార్చరాదని తాలూకా ఖజానాలకు ఉత్తరువుల నరికించిరి. మరియు మునిసిపల్ పాఠశాలలయందు రాటముల పెట్టు విషయములో వానికి రాజకీయ వాసనలేనియెడల బెట్టవచ్చునని తీర్మానించిరి. రాటములకు రాజకీయ వాసనయేమో యోచింపుడు. అనేక మునిసిపాటీలు తమసరిహద్దులలో గోహత్య గావింపరాదని తీర్మానములు జేయగా నవి శాసన విరుద్ధములని తమ యభిప్రాయమును దెలుపుచు మునిసిపలు మంత్రి రామారాయణంగారే వానిని రద్దుజేసిరి. శాసన విరుద్ధమెట్లగునని ప్రశ్నింపగా ప్రత్యుత్తరమిల్లే. మునిసిపల్ శాసనమును సంస్కరించి రెండు సంవత్సరములైనను బెజవాడ మునిసిపాలిటీకి క్రొత్తయెన్నికల కవకాశమివ్వక కారణమడుగగా, ప్రజాభీతి లేకుండ నిర్భయముగా అసహాయవాదుల వశమగునని జవాబిచ్చిరి. రేపల్లె మునిసిపాలిటీ విషయములో ప్రజలనెంతో కష్టపెట్టి తుదకు దానిని మొత్తి వేసిరి.

చీరాల మునిసిపాలిటీ సంగతి జగత్ప్రసిద్ధి కెక్కినదే గదా. ఇప్పటికిని దానిని ప్రజలనేత్రిపై నంటగట్టిరి.

1882 వ సంవత్సరమున రిప్పన్ ప్రభువుగారి హయాములో మంజూరు చేయబడిన స్థానిక స్వపరిపాలనాచట్టము (లోకల్ బోర్డుల ఆక్టు) లోనే బోర్డు ప్రెసిడెంటుల నెన్నుకొనే యధికార మొసంగబడినది. ఇప్పటికిని రాజధాని మొత్తము మీద మూడునాలుగు జిల్లాలో తప్ప, తక్కినజిల్లాలలో ప్రెసిడెంటు లను మంత్రిగారే నియోజించుచున్నారు. అధికారములో నున్న మంత్రివర్గమువారి యడుగులకు మడుగులొత్తువారు ఎన్నికలలో రారేమోయను భయమే యిందుకు కారణముగా గన్పించుచున్నది. తాలూకా, జిల్లాబోర్డు, మ్యునిసిపల్ సభ్యులను నామినేట్ చేయు టలోగూడ నీసూత్రమే గన్పించుచున్నది. మద్రాసు గవర్నమెం టులో న్యాయశాంతములను (Law and order) కాపాడుటకు కార్యనిర్వాహక వర్గమువారు బాధ్యులై యున్నారు. ఈన్యాయ శాంతములపేరిట ననేకవేలమంది యిండియాలోను, వందలకొలది చెన్నరాష్ట్రములోను అసహాయవాదులు కారాగృహ వాసముజేసిరి.

చెన్నపురిలో పులియన్ తోపులను మూలపల్లివారికిని, ప్రక్కనున్న కూలిపనివాండ్రకును గలిగిన పోరాటములో 21 మందికి ప్రాణహాని గలిగెను. ఈ వ్యవహారములో మంత్రులుగాని, గవ ర్నమెంటువారుగాని ముందుగానే జోక్యము కలిగించుకొన్న యెడల నీహత్యలు జరిగియుండవు.

దీనికి బాధ్యులెవరు? ఈ విషయములో మంత్రు లేమిచేయ గలిగిరి? చివరకు శాసనసభలో సభావ్యవహారములననిదితే లేవరకుగట్టి పెట్టుడని (Motion for adjournment)* ఉపపాదించినపుడు ఒక్క

* మోషన్ ఫర్ అడ్జర్నమెంటు అనగా ప్రభుత్వమువారొక విషయమై సరి యైన చర్యను తీసికొనకపోయినప్పుడు శాసన సభ్యులలో నొకరు "ఈ సభావ్యవహారముల నింతట విరమించవలెనని" యొక తీర్మానమును ప్రతి

పోలీసు యిన్‌స్పెక్టరును మూర్ఛ్చటచే నామరునాటినుండి హత్యలాగి పోయినవి. పేరునకు బాధ్యతాయుత ప్రభుత్వమేమి ? మద్రాసు నగరమున మంత్రుల కంటియెదుట పట్టపగలు నెలలు తలబడి జరిగిన యీబహిరంగమైన అరాచకమేమి ?

ఇంతయేల? సందిగ్ధ సందర్భము లెప్పుడువచ్చినను మనమంత్రులు తమ వోట్లనీయక ముఖము దాటవేసి తప్పించుకొను చుండిరి. ఈప్రకార మొకరో యిద్దరో, కొందరో, అందరో, టోలిగేట్లవద్ద హాసీలుపన్నును హెచ్చించినప్పుడును, ఆయకట్టులో నూతనముగా చేర్చబడిన భూములకు యెకరము 1 కి 25 రూపాయల చొప్పున నజరానా చెల్లించవలెనను ఉత్తరువును రద్దు చేయించి నప్పుడును, రైతు వారీ విలేజిసెస్సు బిల్లునువిచారించి నప్పుడును, మనమంత్రులు తమ వోట్లనీయక సమయమునకు బయటికి వెళ్ళినసంగతి లోకవిదితమే. బయటికి వెళ్ళక అచటనేయుండి వోట్లియ్యని యెడల పార్లమెంటు సాంప్రదాయ ప్రకారము వీరరాచక దోషమునకు పాత్రులై యుందురు.

కాని యసహాయవాదులను హింసించుటయందు మద్రాసు గవర్నమెంటువారు ఏరాష్ట్రమునకును దీసిపోలేదు. ఈరాజధాని యందు బరహాంపురము పట్టణములో వి. వి. జోగయ్యపంతులు గారు పబ్లిక్ ప్రాసిక్యూటరుగా నుండెను. అనగా గవర్నమెంటు వారి తరఫు ప్లీడరు. ఆయన కుమారుడు గిరిరావుగారు బారిస్టరు.

పాటింప బూనెదరు. సభాధ్యక్షుని యనుమతితో నాతీర్మానము శాసనసభ్యు లంగీకరించినయెడల ఆప్రభుత్వమున కవమానము సంభవించు నట్లు భావింపబడును. అందుచే ఆంగ్ల సాంప్రదాయము ననుసరించి కార్య నిర్వాహక సభ్యులును, మంత్రులును తమ పదవులకు రాజీనామాల నియ్య వలయును. శాసనసభను విచ్ఛిన్నముచేసి క్రొత్త యెన్నికలు క్రొత్త ప్రభుత్వముతోగి ప్రారంభము కావలెను. ఈప్రభుత్వము తన ధర్మము సరిగా నిర్వర్తించ లేకపోయెను గనుక నీసభా వ్యవహారముల నింతటు కట్టిపెట్ట వలసినదని యీ తీర్మానముయొక్క భావము. అందుచేతనే దీనిపైనింత యట్టహాసము జరుగును.

అసహాయవాది. ఈ కారణముచే "నీ కుమారుని యింటినుండి వెడలగొట్టి వేరుగా నుంచెదవా? లేక నీపబ్లిక్ ప్రాసిక్యూటరుపని మానుకొనెదవా? అని నిర్బంధించి జోగయ్యపంతులుగారిచే గవర్నమెంటువారు రాజీనామా పెట్టించిరి. సంస్కరణములువచ్చినతరువాత రాజకీయాభిప్రాయములకై నిర్బంధ విచ్ఛిన్నములైన సంబంధ బాంధవ్య నిదర్శనములెన్ని యోగలవు. స్వాతంత్ర్య మార్గమువం దిది ముందు నడకో, వెనుకనడకో యోచింపుడు.

దురాగతము.

గంజాము జిల్లాలోని రసూల్ కొండయొద్ద సదాశివమూర్తి గారను నొకవోవర్ సీయరు పనిజేయుచుండెను. ఒకనాడాయన పటపగలు నిద్రించుచున్నపుడు ఆయన భార్యయెదుటనున్న నూతి దగ్గరనుండి నీళ్లుతీసికొని యింట్లో బ్రవేశించుచుండగా, నచట అసిస్టాంటు కలెక్టరుగానున్న...... అను తెల్లవాడామెను వెంబడించి యాగర్భిణిస్త్రీని యొకగదిలోనుండి మరియొకగదిలోనికి తరుముకొనిపోయి చివరకు నిద్రించుచున్న బంట్రోతును, భర్తను సమీపించి కేకవేయగా వాడుపలాయను డాయెను. ఈవిషయమై పైయధికార్లకు ఫిర్యాదుచేయగా క్షమాపణ నిప్పించెదమని కొంతకాలము గడపిరి. తుదకుప్రాణము విసిగి వోవర్ సీయరు రాజీనామా నిచ్చెను. ఉత్తర ప్రత్యుత్తరములతో కాలహరణ మగుటచే కేసుపెట్టదగిన గడువు మించిపోవుటచే క్షమాపణ నిప్పించనక్కరలేదని తుదకు తేల్చిరి. ఇదియేకాబోలు న్యాయశాంతములను రక్షించుట (Law and order)

పరమానందలాల్ కేసు.

ఉత్తర హిందూస్థానములో నొకచోట పరమానందలాలు అనునతడు పోలీసు సబుఇన్స్పెక్టరుగా బనిచేయుచుండెను. ఆతని కుమారుడు అసహాయవాది. కుమారుని అసహాయోద్యమము నుండి మాన్పించుమని తండ్రికి దెలియజేసిరి. కుమారుడు తన

స్వాధీనములో లేడని తండ్రి విన్నవించుకొనెను. ఈసమాధానము ప్రభుత్వమునకు తృప్తికరము గాకున్నచో నతని నుద్యోగము నుండి దీసివేయవచ్చును. అట్లుజేయక పోలీసు సూపరింటెంటెంటుగారు అతని హెూదానుతగ్గించి 86 మైళ్లదూరములో నున్న నొక లోతట్టు మారుమూలప్రదేశమునకు 48 గంటలలో బోయి జేరవలెనని బదలాయింపు ఉత్తరువు నొసంగెను. అచటికి రైలుస్టేషను నుండి 46 మైళ్లు నాటుదారిని కాలినడకమీాద బోవలసియుండెను. ఇట్లుండగ 24 గంటలలోనే పోయి జేరుమని మరియొక యుత్తరువు బంపెను. వెంటనే మరియొక సెక్షనుప్రకార మతనిపై ప్రాసిక్యూషను పెట్టించెను. మేజస్ట్రీటుగారు శిక్షించిరి. అప్పీలులో హైకోర్టువారు కేసు కొట్టివేసి ముద్దాయిని విడుదలచేసిరి. దేశక్షేమమునకంటె ప్రభుత్వమువారి యిచ్చకమునే ముఖ్యముగా నెంచుకొని సర్వదా వారియనుగ్రహము నాశ్రయించి బ్రతుకు పోలీసు ఉద్యోగిగతియే యిట్లుండ తక్కినవారి సంగతి యడుగనేల ?

గుమాస్తాలు, రాజభక్తి సర్టిఫికెటు.

192౨ సం॥ మార్చినెల ప్రాంతమున గుంటూరు జిల్లాలోని యధికారులు తమతాలూకా గుమాస్తాలకు నొక యపూర్వమైన యుత్తరువును జారీచేసిరి. "పదునైదు దినములలోగా ప్రతిగుమాస్తాయు, తాముగాని, తమమీాద నాధారపడి జీవించువారుగాని, తమ పోషకులుగాని, ప్రత్యక్షముగానో, బరోక్షముగానో, అసహాయోద్యమములో బాల్గొని యుండలేదని తాహశీల్దార్లయొద్ద నుండి రాజభక్తి సర్టిఫికెట్లు దీసికొని రానియెడల, మరియొక కారణములేకుండానే వారియుద్యోగము లూడిపోవున''ని ప్రకటించిరి. ఇది యేనా బ్రిటిషు ప్రభుత్వముయొక్క లక్షణము? సంస్కరణలు వచ్చినతరువాత భారతీయులకు లభించిన స్వాతంత్ర్యావకాశ మిదియే కాబోలు ? అసహాయోద్యమమే శాసనవిరుద్ధమైనచో దాని

నణచివేయుటకు ప్రభుత్వమువారిన్ని వక్రిమార్గము లవలంబించ నేల ? తమచేతిలో నధికారములేదా ; బలములేదా !

మాప్లా వేగన్.

వ్యక్తులకు సంబంధించి జరిగిన ఈయన్యాయముల నటుంచుడు. మలబారులో జరిగిన ఘోరయుద్ధమునకు గారణమేమియో యింతవరకు నొక కమిటీగాని, విచారణగాని, యేమియు నేర్పాటుగాలేదు. సుమారు నూరుమంది మాప్లాఖైదీలను గాలి వెలుతురులేని వాగనులో వేసి ప్రయాణము జేయించుచుండగా, మంచినీళ్లకొఱకును, గాలికొఱకును, అరచి యరచి తల బ్రద్దలు కొట్టుకొని డెబ్బదిమంది దిక్కుమాలిన దీను లూపిరియాడక చచ్చిపోయినప్పుడు, ముద్దాయిగా నుండదగిన పెద్దయుద్యోగులనే యా విచారణ సంఘములో న్యాయాధిపతులుగాజేసి బాధ్యత వహించదగినవారిపై నెట్టిచర్యయు జరుపక పోగా, నొక సార్జంటుమీదను నలుగురు కానిస్టేబుల్సు మీదను, లాంఛనముగా బెట్టిన కేసు ప్రథమ విచారణలోనే కొట్టివేయబడెను. డెబ్బదిమంది భారతీయులు, పోనీ వారుఖైదీలేయనుకొనుడు, అధికారవర్గము వారిచేతులలో నూపిరియాడక బలవన్మరణము నొందినపుడు జరిగినన్యాయమిది. అందులో పదియువపాలు ఘోరము నొక్క తెల్లవానివిషయమునసీదేశములో జరిగినయెడల, యెన్నివిమానములు? ఎన్నిమరఫిరంగులు? ఎన్నిబాంబు ప్రయోగములు? ఎంతమంది డయ్యరుసేనానులు? ఎంత మందుగుండుసామాగ్రి ? ప్రత్యక్షమై యుండునోగదా ? ఈ సందర్భములోనే మోచర్ల రామచంద్రరావు పంతులుగారు మోషన్ ఫర్ అడ్జర్నమెంటు కోరగా 19 మంది మాత్రిమీయన పక్షమున జేయెత్తిరి. తక్కిన 80 మంది ప్రజాప్రతినిధులు ఏమైరో ?

ఇంక శాసనోల్లంఘన సంఘమువారు గుంటూరు వచ్చినపుడు అధికారులుగావించిన యరాచకము వర్ణనాతీతము. ఆజిల్లానుండి గాక ఇతరజిల్లాలనుండి వాలంటీయర్లు రాకూడదని నిషేధపు

టుత్తరువులు జేసిరి. దీనిని కాంగ్రెసువా రంగీకరించిరి. కాని తమ యాజ్ఞను తామేయతిక్రమించి అచటి మేజస్ట్రేటులును, పోలీసువారును, ఆజిల్లావారినే ముందుగా నరెస్టుచేసిరి. అధికారుల చర్యలకు దారి దొంకలుండవు. ఇవియేకాబోలు బాధ్యతాయుత స్వపరిపాలనకు ప్రారంభసూచనలు.

జాయింటుకమిటీ రిపోర్టునందు భాషాప్రయుక్త రాష్ట్రముల గూర్చి ఆయాప్రాంతముల ప్రతినిధులలో నెక్కువమంది కోరిన ప్పుడు చర్య దీసికొనవలెనని వ్రాయబడినది. సుపరిపాలనకు గాని స్వపరిపాలనకు గాని, మిక్కిలి యావశ్యకమైన ఈసంస్కరణను గూర్చి యింతవరకు యోచించిన దిక్కేలేదు.

భూమిశిస్తువగైరా వ్యవహారము లింతవరకును శాసనాధికారము చేగాక కేవలము కార్యనిర్వాహక వర్గమువారి నిరంకుశాభీష్టము ననుసరించి సాగిపోవుచున్నవి. ఈప్రకారముగా 1863 వ సంవత్సరములో నీటితీరువ యకరమునకు 3 రూపాయలనుండి 4 రూపాయలవఱకును 1894 లో రు4ల నుండి రు 5 ల వరకును హెచ్చించినపుడుగాని, 30 సంవత్సరములకొకసారి తిరిగి సెటిల్‌మెంటుజేసి భూములపై తరముపన్ను విచ్చలవిడిగా వృద్ధిచేయునపుడుగాని, దొరతనమువారికి శాసనాధికారమిసుమంతయు లేదు. అట్టిశాసనప్రమాణమును, త్వరలో నిర్మించవలెనని మాంటుఫర్డువిధానమునగలదు. కాని యింతవరకును మద్రాసు రివిన్యూ సెటిలుమెంటుబిల్లు శాసనసభలో ప్రవేశింపనేలేదు. ఇందుకేమియో కారణములు గలవట, అవిశాసన సభ్యులకు దెలిసియేయున్నవట, యీముక్కలో మద్రాసుగవర్నరు వెల్లింగ్డన్ ప్రభువు గడచిన ఏప్రియల్ 3 వ తేదీని శాసనసభయం దొసంగిన అంత్యోపన్యాసములో సభ్యుల నోదార్చిరి. కొంతకాలముక్రిందట నొకరకముభూములపై నీటితీరువను ఎకరమునకు రూ 5 ల నుండి రూ 6-4-0 లకు హెచ్చింపవలెనని, ప్రయత్నించగా శాసనసభవారాతీర్మానమును తోసివేసిరి. కాబట్టిరివిన్యూ

వ్యవహారములలో శాసనాధికారమే ప్రమాణమైనచో ప్రజాభిప్రాయమునకు దొరతనమువారు గొంత లొంగవలసియున్నదనియర్థము. అయితే శాసనసభయందు శాశ్వితపు సెటిల్మెంటు గావలెనని జేసినతీర్మానమొక మూలమూలుగుచుండగా, మామూలు ప్రకారము ప్రతిజిల్లాలోను, ప్రతితాలూకాలోను సెటిల్మెంటుపనులు జరుగుచునేయున్నవి. ఈ సంస్కరణలకుబూర్వమే బొంబాయి రాష్ట్రమునందు భూమిశిస్తు శాసనము వ్యవహరింపబడుచుండగా మదరాసులో మూడు సంవత్సరములకుగూడ నీ భాగ్యము లభింపదయ్యె. కార్యనిర్వాహకశాఖనుండి న్యాయవిచారణాధికారమును వేరుచేయుటనుగూర్చి స్థలాంతరమున వివరింపబడినదిగదా!

స్వరాజ్యమనగా ప్రభుత్వవ్యయముపై నధికారము. ఈ యధికారము కేంద్రప్రభుత్వములో మచ్చునకైనా లేదని ప్రభుత్వమువారే యంగీకరించిరి. ఇట్టియవకాశమును కొంతవరకు గల్పించితిమని, వారుజెప్పెడి రాష్ట్రీయప్రభుత్వములోగూడ నిది మిథ్యాధికారమని మనవాదన. ఉదాహరణములు గొన్ని దెల్పెదము:—

(1) గంజాంజిల్లాలో రసుల్ కొండనే ప్రదేశముగలదు. ఇది మంచిమన్యపు అరణ్యములో నున్నది. ఇచటకలప సమృద్ధిగాదొరకును. మద్రాసులోని ప్యారికంపెనీవారు (తెల్లవారు) రసుల్ కొండలో కలపవ్యాపారమునకై యొక పెద్దరంపపుకోత యంత్రాలయమును స్థాపించుకొనిరి. (పరిశ్రమల యభివృద్ధియను మిషచేగాబోలు) యీ రంపపుకోత మరలనిమిత్తం 2 లక్షల 16 వేల రూపాయలగ్రాంటును మదరాసుప్రభుత్వమువారు తమ బడ్జెటు అంచనాలోజేర్చిరి. కాని శాసనసభవారీపద్దు నంగీకరింపక త్రోసివేసిరి. అపుడు గవర్నరుగారు తక్షణమే ఇండియాగవర్నమెంటు ఆక్టులోని 67 బి సెక్షను అనే నారాయణాస్త్రమును, బ్రయోగించి యీ పద్దును తిరిగిబడ్జెటులోచేర్చి, రాష్ట్రముయొక్క శాంతి, క్షేమ, ప్రయోజనములకు భంగముకలుగకుండా రాష్ట్రమునురక్షించెను.

ఆహా! గవర్నరుగారు నిజముగా బ్రిటీషుప్రజలకు బాధ్యుడుగానే యీ రాష్ట్రమును పరిపాలించుచున్నారుగదా! ఈపై కార్యమును తమ మంత్రులయొక్క సంపూర్ణాంగీకారముతోనే జేసితినని గవర్నరు గారే ప్రకటించియున్నారు. మన మంత్రులిపుడు బ్రిటీషుప్రజలకు బాధ్యులో, మనకు బాధ్యులో విచారింపుడు.

ఏజన్సీ గ్రాంటు.

(2) గోదావరి, విశాఖపట్టణము, గంజాంజిల్లాలలోని ఏజన్సీప్రదేశములనువిడదీసి 1920 సం॥ నుండి ప్రత్యేకపుడివిజన్‌గా పరిపాలించుచున్నారు. దీనికొరకు బడ్జెటులోజేర్చిన ఏజన్సీగ్రాంటు 5 లక్షల రూపాయలను శాసనసభవారుకొట్టివేసి, పూర్వమువలెనే ఆ యా జిల్లాలతోగలిపి పాలింపబడవలెనని తీర్మానించిరి. దానిని గవర్నరుగారు "సాంఘికముగా వెనుకబడియున్న జాతులశ్రేయస్సు తనచేతిలో వప్పగించబడినదని" చెప్పుచు నీ అయిదులక్షలను పైవిధముగానే పట్టీలోజేర్చిరి.

(3) ఫ్యాక్టరీల చీఫ్ యినస్పెక్టరును దీసివేయవలెనని శాసనసభవారు దీర్మానించగా దానిని గూడనీవిధముగానే గవర్నరుగారు రాష్ట్రముయొక్క శాంతి, క్షేమ, ప్రయోజనములకొరకే నిలువబెట్టి దేశమును విపత్సముద్రమునుండి గట్టెక్కించెను.

ఇతర రాష్ట్రములు

ఇతర రాష్ట్రములలోగూడ నీపద్ధతి యవలంబింప బడకపోలేదు. బంగాళా రాష్ట్రములో పోలీసుగ్రాంటులోనుండి కొన్ని లక్షలరూపాయలను శాసనసభవారు తగ్గించినపుడు దానిని బడ్జెటులోచేర్చక తప్పదని గవర్నరుగారు శిఫారసుచేయుచు, రెండవసారి శాసనసభవారి పునర్విచారణకుబంపి వారాపద్దును మంజూరుచేయనిచో, తానురాజీనామా నిచ్చెదనని తెలియజేసెను. ఇదియొకనూతనమార్గము. సర్టిపై యధికారమును గవర్నరుగారువినియోగించలేదు. శాసనసభను

విచ్ఛేదము జేసిక్రొత్తయెన్నికలు జరుపుటకు ప్రయత్నించలేను. అసహాయవాదము ననుసరించి తనయుద్యోగమునకు రాజీనామా నిత్తునని యితరులను నొప్పింపని యుపాయముచే కార్యమును సాధించెను. ఆయనతరువాత గవర్నరుగావచ్చిన లిట్టనుప్రభువుగూడ శాసనసభవారు పునర్విచారణమీద దానినంగీకరించేవరకు తనసర్టిఫికెట్టు అధికారమును అనామతుగా నుపయోగించి ముందుసొమ్మును ఖర్చుపెట్టించెను. ఈప్రకారము శాసనసభ్యులతో నిమిత్తములేకుండ పరిపాలనా బాధ్యతయంతయు రాష్ట్రాధిపతులు తామే వహించుచున్నపుడు శాసనసభ్యులు బేజవాబుదారిగా నుండుటలో నాశ్చర్యము లేదు.

## —: ప్రభుత్వముయొక్క ఆంతర్యము :—

కేవలము రాజకీయ వాతావరణములో సంచరించెడి ఆందోళకులుగాని పరిపాల నాయంత్ర జాలమునందు జిక్కుకొనియున్న యుద్యోగులుగాని (పాశ్చాత్యులైనను) రాజ్యాంగముయొక్క ఆంతర్యము నెరుంగరు. ఈ రాజకీయ రాజ్యాంగము వెనుకనొకవాణిజ్య రాజ్యాంగము దాగియున్నది. అందుచే పాశ్చాత్యవర్తకులు పరిశ్రామికులు ఈరాజ్యాంగము ద్వారా స్వప్రయోజనములను సాధించుకొనుచున్నారు. ఒకయోడయందు సరుకునెగుమతి చేయవలెనంటే ఆకంపెనీతో జేసికొన్న ఖరారునామాలచే ఓడ యజమానులకు వర్తకులు బానిస లైపోవుచున్నారు. ఓడ యజమానులు ముందు ఎక్కువరేట్లు బుచ్చుకొని, ఆకంపెనీ ఓడలయందే ఎగుమతి దిగుమతులను జేసికొన్నచో మరుసటి సంవత్సరము నూటికి 10 వంతున రేట్లలో రాయితీజేసి ముదరాయిత్తురు. ఈప్రకార మెప్పటికప్పుడు ఋణగ్రస్తుడైన, పాతేరువలె వర్తకుడు ఓడయజమానుల చేతిలో జిక్కికొని యుండును. ఈరహస్యమును గుర్తెరుంగక అనేకమైన దేశీయ నావికాసంఘములు బయులుదేరి దివాలాతీసినవి.

ఈ పరిశ్రమనుగానే స్వరాజ్య మనుభవించుచున్న దేశము లలో పరిశ్రమ వ్యవసాయాదులకు నావశ్యకమగు పదార్థములపై ముఖ్యముగా ఎరువులపై రైల్వేలలో మిక్కిలి చౌకరేట్లుగలవు. ఇట్టి సౌకర్యములకు మనము నోచుకొనలేదు సరియేగదా, లోతట్టు ప్రాంతములనుండి రేవు పటణములకు బోవు సరుకులపై రైల్వే రేట్లు తక్కువగాను, దీనికెదురు బోవుటకు నాలుగైదు రెట్లెక్కువగాను, వసూలు చేయబడుచున్నవి. ఇది దేశములో పండినపంటలను ముడి పదార్థములను విదేశముల కెగుమతిజేయుట కెక్కువసౌకర్యముగా నున్నది. దీనిని సంస్కరణలేమి జేసెను?

బ్యాంకులు

ఇంక బ్యాంకులవిషయ మాలోచింతమన్న దేశధనమునెల్ల గవర్నమెంటువారు పరదేశీయులు స్థాపించిన యీబ్యాంకులవశము చేయుచున్నారు. దేశీయ పరిశ్రమల కీబ్యాంకులు గుడ్డిగవ్వ సహాయమైనను జేయుటలేదు, ఎగుమతుల కెంతసొమ్మైనను కో కొల్లగా పెట్టుబడి పెట్టెదరు. జేబులో కానిడబ్బులేని కంపెనీ బ్యాంకుల సహాయముతో లక్షలకొలది వ్యాపారము నడిపించగలదు. ఇటీవలనే సిమ్లాలోని అలయెన్సుబ్యాంకు 9 కోట్ల రూపాయలకు దివాలాతీసినది. ఇంపీరియల్ బ్యాంకువారు ఇండియా గవర్న మెంటువారి హామీ ప్రోత్సాహములమీద, దీనినాదుకొని రూపా యకు అర్థచొప్పున వెంటనే బాకీదార్లకు సొమ్ము చెల్లించివేసిరి. ఇట్టి సౌకర్య మెన్నడైనను గవర్నమెంటువారు దేశీయబ్యాంకులకు జేసిన పాపమునబోయిరా! పోనిందు యికమీద నేదేశీయ బ్యాంకున కైన నిట్టి పయాత్తు సంభవించినపుడు దానికిగూడ నిట్టి సదుపాయ మును జేయుదురాయని యడిగినపుడు ఇండియా గవర్నమెంటు వారు వీలు లేదని ప్రత్యుత్తరమిచ్చిరి. వెనుక పీపుల్సుబ్యాంకు, స్వదేశీబ్యాంకు, ఆర్బత్ నాటికంపెనీ, మున్నగు బ్యాంకులు దివాలా తీసినపుడు గవర్నమెంటువారిట్టి సాయముజేసి యెరుగరు. నాని

సందర్భము వేరు, అలయన్సు బ్యాంకు సందర్భము వేరు, ఈబ్యాంకు తెల్లవారిచే స్థాపింపబడినది. దీనికి 56 శాఖలుగలవు. ఈ బ్యాంకులో పైనుండి క్రిందివరకుగల సైనికోద్యోగులు, సివిలియనుద్యోగులు అయిన తెల్లవారు తమధనమును కోట్లకొలది డిపాజిట్లు చేసికొన్నమాట నిర్వివాదాంశము.

మారకము:—

వీనినన్నిటిని తలతన్నిన దీమారకపు గారడీ. దీనికి శుద్ధి, బద్ధములులేవు. నాణెముయొక్క విలువను ఉన్నతోద్యోగులు తమ యిష్టానుసారముగ నిర్ణయించ గలరు. ఉద్యోగుల కనుకూలముగా మారకమునకు సంబంధించి హుండీలు, తిరుగు హుండీలు (Council Bills and Reverse Councils) విక్రయించబడును. ముందటేడు ప్రజాఘోషను తిరస్కరించి మారకము గారడీలో ఇండియా గవర్నమెంటువారు విక్రయించిన తిరుగ హుండీలమూలముగా మన "గోల్డు యెక్సేంజిస్టాండర్డు రిజర్వు"లోనుండి 35కోట్లరూపాయలొక్క నిమిషములో మాయమైపోయెను.

దేశీయ సమస్యలను పరిష్కరించుట కనేక విచారణ సంఘములను గవర్నమెంటువారు నెలకొల్పిరి. 1913 సం॥ మొదలు 1923 సం॥ వరకు మొత్తము 65 విచారణసంఘములు వచ్చినవి. వానిక్రింద మొత్తము 68 లక్షల 12 వేలరూపాయలు ఖర్చుపడెను. వీనిలో వాయువ్యసరిహద్దు పరగణాల పరిపాలనమును యాలోచించుటకు నేర్పరచిన సంఘమును, సైనికావశ్యకముల నాలోచించుటకేర్పడిన సంఘమును, తమ నివేదికలను ఇండియా గవర్నమెంటునకు పంపి చాలకాలమైనప్పటికి నింతవరకు నవి ప్రకటింప పడలేదు.

నిర్బంధ శాసనముల కమిటీవారి రిపోర్టు ప్రకారము కొన్ని శాసనముల రద్దుచేయబడెను. కాని వెంటనే పోలీసు శాసనమని మరియొకటి నూతనముగా సృజింపబడెను. రాజ్యాంగము నందు

పోలీసు ఉద్యోగముచేయుట దేశహితైకము కాదని వారికి బోధించి నచో అది నేరమై ఆరుమాసముల కఠినశిక్షను 200 రూపాయల జరిమానాకును పాత్రత గలుగును. దొరతనమువారొక క్రూర శాసనమును రద్దుచేసినచో దానికి ప్రత్యామ్నాయముగా మరి యొకటి నామాంతరముతో బయలు దేరుచుండును.

మదరాసా శాసనమును రద్దుచేసిన కలముతోనే "ప్రిన్సెసు ప్రొటెక్షను బిల్లు"ను సృష్టించిరి. అధికారవర్గమువా రవలంబించు క్రూరకృత్యము లొకదాని నొకటి మరపించుచున్నవి. పంజాబు వధలను మించి మాప్లా హత్యలు, వానినిమించి అకాలీ హింసలు, చరిత్రప్రసిద్ధముగా నున్నవి. బందిఖానాలలో రాజకీయఖైదీలకు గలిగించిన బాధలు లోకవిదితములు. ఇప్పుడు నాగపురములో జరుగుచున్న స్వరాజ్య పతాకసమరము, ఇండియాగవర్నమెంటు వారి యంగీకారము బొందినట్లేగదా!

కాకినాడ మ్యునిసిపాల్టీ.

పుస్సీ పుటు జాన్సను అనునతడు అమెరికాదేశములో త్రాగుడుమాన్పించుట కమోఘముగ బనిజేసిన మహనీయుడు. ఈమధ్య యీయన యీదేశమునకు వచ్చినపుడు మనకాకినాడగూడ వచ్చెను. అప్పుడాయన సన్మానార్థము కాకినాడ మ్యునిసిపాల్టీవారు ఖర్చు పెట్టినరు. 4 ల వద్దను (సుమారు) మన మునిసిపల్ మంత్రి గారంగీకరించక త్రిప్పివేసిరి. దానినిగూర్చి గవర్నమెంటువారితో నిప్పటికి నుత్తరప్రత్యుత్తరములు జరుగుచున్నవని వింటిమి. ఇప్పు డేస్థితిలోనున్నదో తెలియదు.

వర్ణ విభేదము.

న్యాయ విచారణలో తెలుపు నలుపను వర్ణవిభేదము దీసి వేయుటకు నొకతీర్మానము నంగీకరించుచు, సైనికశాఖకు చెందిన వారి విషయములో మాత్రి మించుక మినహాయింపు జేసిరి. సాధా

ణముగా పొగరుబోతు తనముతోను, దురహంకారావివేకము లతోను, దేశీయులయెడల కౄరముగా ప్రవర్తించి యవమానాపాయములను గలిగించునది మిలిటెరీ కొలువులో తరిఫీదుపొందిన వారే. నియమము ముఖ్యముగా వర్తించవలసినవారినే మినహాయింపు జేయుచున్నది. ఇంక మిగిలేదేమున్నది?

నాటక శాసనము.

సంస్కరణములకు బూర్వము దేశములో సామాన్యజనుల జ్ఞాన వినోదములకై యే నాటకములనైన యథేచ్ఛగా బ్రదర్శించు కొనవచ్చును. ఇప్పుడు క్రొత్తగావచ్చిన నాటకశాసనము ప్రకారము జిల్లాకలెక్టరుగారికి ప్రదర్శింపబోవు నాటకమును ముందుగా బంపి ఆయన యనుమతి (లైసెన్సు) బొందినతర్వాతగాని దానిని ప్రదర్శించుటకు వీలులేదు. ఇప్పుడీశాసనమును మన కృష్ణా గుంటూరు జిల్లాలకు వర్తింపజేయుచున్నారు.

ఇంక తోలుబొమ్మలు, హరికథలు, పురాణములు, జంగం కథలు, ఆషామాషీలు, కబుర్లు మొదలగువానింగూర్చి గూడ క్రొత్త శాసనములు రావలసియున్నవి. మనుష్యులు నోరెత్తుటకే లైసెన్సుల నేర్పరచినచో బాగుండునేమోయని యూహించుచున్నాము. దేశముయొక్క శాంతిక్షేమముల పేరిట నేమైనను జేయవచ్చును.

ఎదురుపీటీ:—

ప్రయాగ రాష్ట్రమునందు రాజకీయ ఖైదీలను విడుదలజేయవలెనని శాసన సభయందొక తీర్మానముజేసిరి. కాని దొరతనము వారు దాని నమలుజరుపలేదు. అందుచే ప్రజాప్రతినిధులు గవర్నమెంటువారి ప్రవర్తనను గర్హించుటకై అడ్జర్నమెంటు తీర్మానమును శాసన సభయందు ప్రతిపాదించుట కనుజ్ఞ కోరిరి. దీనికి వెంటనే గవర్నరుగా రంగీకరించిరి. ఏమి యీవిచిత్రమని యందరు నాశ్చర్యపడిరి. సామాన్యముగా దొరతనమువారి వర్తనను ఖండించు

నిట్టి తీర్మానము, మొగ్గలోనే తుంచివేయబడును. సభావిచారణకే యనుమతి లభించదు. మాస్లా వేగనునుగూర్చి రామచంద్రరావు గారు తెచ్చిన యిట్టి తీర్మానమే యోడిపోయినది. కాని యూ. పి. గవర్నరు దీని కనుమతించిరి. సాయంతనము 4 గంటలకు ఈతీర్మానమును చర్చించు సమయమువచ్చినపుడు, గవర్నమెంటువారు జేసిన యుక్తిచే శాసనసభ్యులెవరి దారినివారు లేచివెళ్ళిపోయిరి. కోరంగాలేదు. ప్రభుత్వమును వంచింతమని వెళ్ళిన నలుగురు ప్రజాప్రతినిధులును తెల్లబోయిరి. స్వరాజ్య పక్షమువారిపుడు తాము శాసనసభలకుబోయి కోరంగాకుండాజేసి గవర్నమెంటుకుప్రతిష్ఠంభనములు చేయుదుమని చెప్పే సిద్ధాంతమునే యూ. పి. గవర్నరు క్రియారూపకముగ ప్రయోగించి, యెదురు పీటీజేసెను. కావున ప్రస్తుత విధానములో ప్రతిష్టంబనములకు మన కెంత యవకాశమున్నదో విచారింపుడు.

— మన సైనికవ్యయము. —

| సంవత్సరము. | మొత్తము ఖర్చు. | 1917-18 సం॥ లో కంటెనధికము. |
|---|---|---|
| | రు. | రు. |
| 1913—14 | 32 కోట్లు | ... ... |
| 1917—18 | $40\frac{1}{4}$ కోట్లు | ... ... |
| 1918—19 | $70\frac{1}{4}$ కోట్లు | 30 కోట్లు |
| 1919—20 | $87\frac{1}{4}$ కోట్లు | 47 కోట్లు |
| 1920—21 | $88\frac{1}{4}$ కోట్లు | 48 కోట్లు |
| 1921—22 | 78 కోట్లు | $37\frac{3}{4}$ కోట్లు |
| 1922—23 | $72\frac{1}{4}$ కోట్లు | 32 కోట్లు |
| | వెరశి | రు. $194\frac{3}{4}$ కోట్లు |

సైనిక వ్యయము:—

ఇంచికేపు కమిటీవారి రిపోర్టు ప్రకారము ఇండియా దేశములో కేవలమొక్క సైనికుల జీతభత్యములక్రింద మాత్రమే యెంతెంత ధనము వృధాగాను అక్రమముగాను ఖర్చుపెట్టబడుచున్నదో యీ క్రింది యంకెలనుబట్టి యూహించవచ్చును.

కడచిన యుద్ధసమయములో 1913–14 సం॥లో 80 వేల మంది బ్రిటీషుసైనికులకు రు. 8 కోట్ల 17 లక్షలు, 1,56,000 మంది దేశీయ సిపాయిలకు రు. 4 కోట్ల 9 లక్షలును ఖర్చుపడెను.

యుద్ధములేని శాంత సమయములో 1922–23 సం॥ లో 76 వేలమంది బ్రిటీషు సైనికులకు రు. 18 కోట్ల 55 లక్షలును.

,, ,, 1,70,000 మంది దేశీయ సిపాయిలకు రు. 5 కోట్ల 4 లక్షల రూపాయిలును ఖర్చుచేయబడెను. యుద్ధసమయములోకంటె శాంత సమయములో బ్రిటీషు సైనికులు 4 వేల మంది తక్కువగా నున్నప్పటికిని వారి మొత్తం జీతభత్యములు $2\frac{1}{4}$ రెట్లు హెచ్చినవి. మునుపటికంటె దేశీయ సైనికులు 14 వేల మంది యెక్కువైతే వారిమొత్తము ఖర్చు $\frac{1}{4}$ మాత్రమే పెరిగినది. ఈ యక్రమమున కెవరేమి జేయగలరు? మన సర్వసేనాధిపతి తన సైన్యవిషయములో తానే సర్వాధికారి. ఈయెస్సెంబ్లీ గిస్సెంబ్లీలు ఆయన కాలిగోరును కదలింపజాలవు. ఏలయన సైనిక విషయమునుగూర్చి గట్టిగానొక్క ప్రశ్నవేసి సమాధానము చెప్పించుటకైనను మన ప్రతినిధుల కధికారములేదు.

అసలు మన దేశమునకింత సైన్యమవసరము లేదు. ఒక వేళ కావలసినను బ్రిటీషు సైనికులను తీసివేసి వారి స్థానములో దేశీయులను జేర్చినయెడల దేశమున కనేకవిధముల లాభకరముగా నుండును. పోనీ ఆఖరుపక్షమునకు బ్రిటీషు సైనికుల జీతభత్యములను తగ్గించి దేశీయ సైనికులతోపాటుగ నుంచినయెడల కొంత ధనవ్యయమైనను కలిసివచ్చును. కాని మనకా యధికార మేది?

ఈసందర్భములోనే జెప్పదగిన యుపాఖ్యాన మింకొకటి జ్ఞాపకము వచ్చినది.

సైనికోద్యోగములు:—

కడచిన ఫిబ్రివరి 17 వ తేదీని యెస్సెంబ్లీలో భారతీయులకు నున్నత సైనికోద్యోగములిచ్చే విషయములో మహమ్మదు యామినిఖాన్ సాహేబుగారొక తీర్మానమును దెచ్చినపుడు సర్వసేనాధిపతిగారు లేచి యీవిషయమై యిండియా గవర్నమెంటువా రాలోచించుచున్నారని చెప్పెను. కొందరు సభ్యులామాట నమ్ముటచే గాబోలు, వోటునకు బెట్టగా నాతీర్మాన మోడిపోయినది. లోతు విచారించగా తేలిన సేనాధిపతిగారి వాక్యమున కంతరార్థ మేమంటే:— అసలు యిండియా దేశపు సైన్యములో మొత్తమున 141 దళములు ( Units )న్నవి. ఇందు 120 కాల్బల దళములు, 21 ఆశ్వీక దళములు. ఇందు ప్రస్తుతము విడిగానేరి 8 దళములలో మాత్రము ( కమిష నుద్యోగములకు ) భారతీయులను జేర్చుకొందురట. ఇదియు బూర్తియగుటకు 22 లేక 23 సంవత్సరముల కంటె నెక్కువ కాలముపట్టదట. ఈ రేటు ప్రకారము సైన్యములోని 141 దళములను బూర్తిగా దేశీయుల పరము జేయుటకు 8)141 ( 18 × 22=396 సుమారు నాలుగువందల సంవత్సరముల గడువు సరిపోవచ్చును. మనమీలోగా తొందర పడనవసరము లేదు. ఈలోపుగా బ్రిటీషువారికి భారతీయులపై కోపముగాని యపనమ్మకముగాని గలిగే పరిస్థితులేమీయు దటస్థించకుండ భారత జాతి బ్రతికియున్న యెడల నీలెక్క సరియగును. లేక పోతే లేదు. భారతీయులకు సంపూర్ణస్వరాజ్యము కావలెనంటే ఆత్మదేశ సంరక్షణజేసికొనే సైనిక కౌశల్యము గలుగనిదే స్వరాజ్యము వచ్చి నయెడల శత్రువులబారినుండి తప్పించుకొన జాలమని సప్రూవంటి మన మితవాద ప్రముఖులును, బ్రిటీషు వారును సమాధానము జెప్పుచుందురు. పోనీ సైన్యములో భారతీయులకు వెంటనే విశే

పాధికారముల నిచ్చి తరిఫీదు జేయుచుండే, చేతగాని పశ్చిమ హిందూ నులను విరివిగా నొక్కమారు సైన్యములో జేర్చుకొంటే, యిండియా సైన్యముయొక్క ప్రతిష్టాబలపటిమలు తగ్గిపోవునందురు. విమోచన మెప్పటికంటె? క్రమక్రమముగా నందురు. బ్రిటీషువారి రాకకు బూర్వము ఆత్మదేశ సంరక్షణాశక్తి గలిగిన భారతీయు లీ 150 యేండ్లనుండి వారిదయవలన నిప్పటి కీస్థితికి వచ్చిరిగదా. ఇంక 400 యేండ్లు గడిచేసరికి నేస్థితిలో నుందురో వేరుగ వ్రాయనక్కర లేదు. సైనికాధిపత్యము వచ్చిననేగాని స్వరాజ్యమురాదు. స్వరాజ్యము వచ్చిననేగాని సైన్యాధిపత్యము రాదు. పిచ్చికుదిరితే పెండ్లి యగును. పెండ్లిఅయితే పిచ్చికుదురును.

మహాత్మునిగూర్చియు, లజపత్రాయినుగూర్చియు, ప్రభుత్వోద్యోగులెట్టి నిరసాలాపములాడిరో పాఠకులకెల్ల జ్ఞాపకముండును.

కేంద్రశాసన సభయందు ప్రజలకు మెజారిటీ లభించుట దుస్తరము. రాష్ట్రీముల పరస్పర సహజవైరమే కారణము. రాష్ట్రములు ఇండియా గవర్నమెంటు కివ్వవలసిన విరాళములు బంగాళము, బొంబాయి, మద్రాసు, యు. పి. రాష్ట్రములకు భారముగా నున్నపుడు బంగాళమునకు మొట్టమొదట కొంచెము పరిహారము లభించినపిమ్మట బంగాళాసభ్యులు ప్రభుత్వమువారిలో జేరి మద్రాసువారి నెట్లు పరిభవించినది మనము జూచియున్నాము. మనలో మనమిట్లు తగవులాడుచుండ దొరతనమువారు తెల్లయుద్యోగుల జీతములను హెచ్చుచేయుటకొరకు రాయల్ కమీషను నేర్పాటు చేసియున్నారు. మనరాజధానిలో వైద్యశాఖలో తెల్లవారికి క్రొత్తయుద్యోగము లిచ్చు నావశ్యకతను తగ్గించుచుండగా ఇండియాగవర్నమెంటువారు 30 మంది ఐ. యమ్ యస్. ఉద్యోగులను (డాక్టర్లు) 5 సంవత్సరముల కంట్రాక్టుమీద పిలిపించి నిర్ణీతకాలానంతరము ఒక్కొక్కనికి 15 వేల రూపాయల చొ॥ బోనసు (ఉపకారభృతి) నొసంగుట కంగీకరించిరి. ఇది యేమి న్యాయమో తెలియదు.

స్వదేశమునందలి భారతీయులస్థితి యిట్లుండగా విదేశముల లోనున్న భారతీయకూలీలకు పౌరస్వత్వములు లేవని శ్రీనివాస శాస్త్రిగారివంటి మితవాదశిఖామణులు ఆర్భాటముచేయుట హాస్యాస్పదకమగుచున్నది.

ప్రజలు తమ హక్కులను కోరినపుడెల్ల బ్రిటిషుగవర్నమెంటువారు తమకిష్టులైన కొందరు ప్రముఖుల నేరి పెద్దజేసి వారినోటితో మనలను దూషింపజేయుట యాచారమైనది. ఆనాటి సత్యేంద్ర ప్రసన్న సింహాప్రభువుగారినుండి యీనాటి తేజ్‌బహదూర్ సప్రూ గారివరకునొక్కటే రాజనీతి, యొకటే మహామంత్రము, యొకటే యెదంపుడు పాట. ఈప్రముఖ పరంపరలో సింహా, షాఫి, శర్మ, శాస్త్రి, శివస్వామి సప్రూలు (ఊష్మారంభులు) ఒక్కొక్కగ్రహ మొక్కొక్కరాసి యందుండి స్వబల, స్థానబల మిత్రబలాధికారములతో, శుభాశుభ వీక్షణములతో, రుజువక్ర గమనములతో, గ్రహకూట ప్రయోజనములతో భారతజాతక ఫలకారకులగుచున్నారు. వీరే వలస రాష్ట్రములకు రాయబారములు. వీరేసామ్రాజ్య మహాసభలలోయిండియాకు ప్రతినిధులు వీరేసంధిపత్రములపై సంతకముచేయువారు. వీరే ఇండియా గవర్నమెంటునకు మంత్రులు. దేశీయగవర్నర్లు.

ఇట్టివారిని ముందుపెట్టి ప్రభుత్వమువారు తరచుగా మనలను భ్రమింపజేయుదురు. పైపై పొడిమాటలువిని మోసపోక ఈ గ్రంథమును దీని కనుబంధముగ జేర్చిన ఇండియాగవర్నమెంటు శాసనమును సావధానముగ విమర్శన దృష్టితో జదివిన మనము స్వరాజ్యమున కెంతదూరమున నుంటిమో తెల్లముకాగలదు.

స్వరాజ్యమునకు తిన్ననిమార్గము, దగ్గరమార్గము, చిక్కులులేనిమార్గము, నిరపాయరమైనమార్గము, ఐహికాముష్మిక సుఖప్రదంబైన మార్గము, గాంధిమహాత్ముడే మనకు జూపించెను. ఈ యసహాయోద్యమ రాజమార్గమున భగవధ్యానము జేయుచు నిర్భయముగ బ్రయాణముజేసి భారతీయు లచిరకాలములోనే స్వరాజ్యగమ్యస్థానమును జేరెదరుగాక. గాంధిమహాత్మునకు జేయి.

## 7 వ అధ్యాయము

# ద్వంద్వపరిపాలన.

—:o:—

నూతనశాసనసభలు వచ్చి యిప్పటికి 2½ సంవత్సరములు దాటినది. ఈయనుభవమును బట్టి బాధ్యతాయుత స్వపరిపాలన మెంతవరకు లభించినదో సంగ్రహముగ విచారింతము. అసలీ ద్వంద్వవిధానమును సమర్థించువారు జెప్పె కారణములను ముందుగా మనము దెలిసికొనవలెను. శాసనసభలద్వారా కార్యనిర్వాహకవర్గముచే ప్రజలు తమ దేశమును పరిపాలించుకొనవలెనంటే శాసనసభ్యుల నెన్నుకొనే ప్రజలు (వోటర్సు) మంచివిద్యావంతులై, రాజకీయపరిజ్ఞానముగలిగి, యుదారహృదయులై, త్యాగోత్సాహములతో, ప్రజాహితకార్యములందు జాగ్గానువారై యుండవలెను. దేశములోని బహుజనుల క్షేమప్రయోజనములకు భంగములేకుండ సర్వజనులకును వీలైనంత విరివిగ ప్రాతినిధ్యముండవలెను. వోటరులు భయము, దురభిమానము, మొహమాటము, దురాపేక్ష, లేక తమదేశక్షేమమును గుర్తెరిగి తమవోట్ల నుపయోగించవలెను. ప్రజాప్రతినిధులుగ నుండు సభ్యులు స్వార్థరహితులై వర్ణ, మత, శాఖాద్యభిమానములతో సంకుచితహృదయులుగాక సర్వదా విశాలజాతీయభావ పూరితులై ప్రజాపక్షమున నిర్భయముగా నిలిచి ధైర్యసాహసములతో పాటుబడగల ధీమంతులు, ప్రజ్ఞావంతులు, అనుభవశీలురుగ, నుండవలెను. ప్రస్తుతము మనదేశములో జమీందారులు, రైతులు; పెట్టుబడిదారులు, కూలివాండ్రు; భూమిఖామందులు, పాలేర్లు; వర్తకులు; పరిశ్రామికులు; మొదలగువారు పరస్పర విరుద్ధ స్వప్రయోజనములు గలవారుగానున్నారు. ఇదియట్లుండగా హిందూమహమ్మదీయాది మతాంతరవిభేదములును, బ్రాహ్మణ బ్రాహ్మణేతరాది శాఖావిభేదములును, మొదలైనవెన్నియోగలవు. ప్రజలలో విద్యాభివృద్ధి తక్కువ. రాజకీయాందోళనాభిలాష యిప్పుడే ప్రారంభమైనది. ఈ మొదలగు కారణములచే పాశ్చాత్యదేశములలోవలె నిచటగూడ వెంటనే ప్రజలందరికిని బూర్తిగా నెన్నిక యధికారమిచ్చి సంపూర్ణ బాధ్యతాయుత స్వపరిపాలన మొసంగినయెడల, దేశమంతయు నల్లకల్లోలమైపోవుననియు, అనుకూల సందర్భములు క్రమముగా నేర్పడేవరకు, ద్వంద్వవిధానమే ప్రస్తుతము శరణ్యమనియు వీరివాదన. సంపూర్ణస్వరాజ్యమున కిది మధ్యమెట్టు అని వీరి భావము.

మంత్రులు ప్రజాయత్తశాఖలతో బొమ్మలపెండ్లిండ్లవలె కాలక్షేపము జేయుచుండగా కార్యనిర్వాహకవర్గమువారు సంపూర్ణస్వాతంత్ర్యముతో పరిపాలనాపటిమ తగ్గిపోకుండ, దేశమును పాలించి కాపాడుచుందురు. పార్లమెంటువారేర్పరచిన జాయింటుసెలక్టుకమిటీవారు చెప్పినదేమంటే:— "మంత్రివర్గ కార్యనిర్వాహకవర్గములు రెండు నొకరికొకరు సహాయభూతులుగ నుండవలసినదేగాని యొకరిపై

నౌకరు బెత్తనముచేసి దిగలాగుకొనగూడదు". ఇది యెంతవరకు సాధ్యమో విచారింతము. మంత్రులయధీనములోనున్న పరిపాలనా శాఖలు :- విద్య, వైద్య సహాయము, ప్రజారోగ్యము, స్థానికస్వపరిపాలన, దేవ, ధర్మాదాయములు, రిజస్ట్రేషను, యెగుమతిపన్నులు, రోడ్లు, పరిశ్రమాభివృద్ధి, వ్యవసాయము, చేపలు, పశువైద్యము, పరపతిసంఘములు, గ్రంథాలయములు, ఆహారపదార్థములకల్తీ, తూనికరాళ్ళు, కొలపాత్రలు, మున్నగునవి. కార్యనిర్వాహకవర్గమువారి చేతిలో నున్న శాఖలు, — భూమి శిస్తు, పంటకాల్వలు, క్షామవిమోచన, అడవులు, శాసనములు, న్యాయవిచారణ, స్టాంపులు, ఫ్యాక్టరీలు, (కూలీల తగాయిదాల తోసహా) పోలీసు, నేరములజేయు (హీనజాతి) గుంపులు, వార్తాపత్రికలు, కారాగృహములు, లోకల్ ఫండు లెఖ్ఖలతనిఖీ, సామ్రాజ్యరాష్ట్రీయోద్యోగములు, ఋణములు, ఖనిజాభివృద్ధి మొదలైనవి.

ఇప్పుడు మనము విచారించవలసినది ముఖ్యముగా మూడుసంగతులు.

(1) మంత్రులపై శాసనసభ్యులకుగల పెత్తనము.

(2) కార్యనిర్వాహకవర్గము మంత్రుల యధికారము నెంతవరకు సాగ నిచ్చునో.

(3) యిండియాగవర్నమెంటువారును, స్టేటుసెక్రిటరీ గారును, నీమంత్రుల కెట్లడ్డము వచ్చెదరో? ఈమూడుసంగతుల నాలోచింతము.

పంజాబురాష్ట్ర ముదహరణముగాదీసికొని యీ మధ్యనొకరు వ్రాసినవిషయముల నీక్రింద దెలిపెదను. పంజాబులో 6 లక్షలమందివోటరులు. వారి శాసన సభలో ప్రజాప్రతినిధులైన యెన్నికసభ్యులు 71 మంది. గవర్నరుగారు నియోజించిన 22 మందిలో 16 మంది ఉద్యోగులు, 8 మంది అనుద్యోగులు. మొత్తము 93మంది శాసనసభ్యులలోను, 47మంది కార్యనిర్వాహకపక్షమున నున్నయెడల వారి యాటలు నిరాఘాటముగాసాగును. మంత్రులు కార్యనిర్వాహకవర్గమున కడ్డము రాలేకపోవుటయేగాక వారికి సహాయముగూడ జేయకతప్పదు. అందుచే 16 + 2 = 18 మంది ప్రభుత్వమువారిపక్షము. కౌన్సిలు కార్యదర్శులు నలుగురును, అనుద్యోగ నియోజితులు ఆరుగురును, ప్రభుత్వపక్షములోనివారేగదా! కావున నీ 28 మందియు ప్రభుత్వమువైపుననే కొమ్ముకాయుటనిశ్చయము. మిగిలిన 65 మంది యెన్నికసభ్యులలోనుండి 19 మందినిమాత్రము ప్రభుత్వమువారు చీలదీసి వశపరచుకొన్నయెడల శాసనసభయంతయు వారి యధీనమైపోవును. బహుసులభముగా వారికార్యమును జేయగలరు. బిరుదులు, సన్మానములు, ఉద్యోగములు, కమీషన్లు, కంట్రాక్టులు వేయేల? సమస్తమైన రాజ్యాధికారములను పిడికిటబట్టుకొన్న కార్య

నిర్వాహకవర్గము వారు (ప్రజాప్రతినిధుల) యెన్నికసభ్యులలోనుండి నూటికి 27 మందిని భ్రమపెట్టి, బుజ్జగించి, ఆశపెట్టి, దబాయించి, భయపెట్టి, బెదరించి, యేదో యొకయుపాయముతో స్వాధీనముజేసికొనుట మిక్కిలిసుకరము. ఎన్నిక సభ్యులు నియోజితులకంటె 3 $\frac{1}{4}$ రెట్లధికముగానున్నను, మూడింట రెండువంతుల మంది యెల్లప్పుడును ధైర్యముతో ప్రజాపక్షమున నున్నప్పటికిని; ప్రజాభిప్రాయమునకు విరుద్ధముగ శాసనసభలచే కార్యనిర్వాహకవర్గము తమ యిష్టమువచ్చినపనులను చేయించుకొనవచ్చును. అనగా 100 కి 66 మంది యెన్నికసభ్యులను లక్ష్యము చేయకుండా మంత్రులు కార్యనిర్వాహకవర్గమువారి చంక నెక్కి వారిప్రాపకముచే శాసనసభలో తమమాటకు భంగములేకుండ జయప్రదముగ తమ యుద్యోగములను నిర్వహించవచ్చును. ఎన్నికసభ్యులలో బహుజనులు తమకు ప్రతికూలముగ వోటిచ్చినను మంత్రులు రాజీనామా నీయవలసినయవసరముగలుగదు. నూటికి 66 కంటె నెక్కువమందికి నసంతృప్తికరమైనప్పుడే మంత్రులమాటకు శాసనసభలో నడ్డముగలుగును. ఇది సామాన్యముగ తటస్థింపదు. ఇదియే మంత్రివర్గముపై శాసనసభ్యులకుగల యధికారము.

మంత్రులు తమశాఖల నెంతవరకు బాధ్యతాయుతముగ బరిపాలింపవలసియుండునో దీనినిబట్టియోచింపవచ్చును. ఈ సందర్భమున పంజాబు శాసనసభలో జరిగిన యుదంతమొకటి గమనింపదగియున్నది. దేవధర్మదాయములు ప్రజాయత్తశాఖ. వేరొకచోటవివరించినట్లు శిక్కు గురుద్వారముల సంస్కరణశాసనముల నేకము మంత్రులచే సృష్టింపబడుచు, శాసనసభాంతము పూర్తియగులోపలనే మాయమైపోవుచుండెను. చిట్టచివరదిమాత్రము బ్రతికి బయటపడెను. తరువాత నీవిషయమై విచారణసంఘమువారి నివేదికను గమనింపవలెనా లేదా యనువిషయము వోటునకు బెట్టినపుడు 41 మంది అనుకూలముగను, 33 మంది ప్రతికూలముగను చేతులెత్తిరి. అందుచే తీర్మానము గెలిచినది. వోట్లను విచారించగా అనుకూలురలో 15 మంది యుద్యోగులు, 1 మంత్రి, 1 కౌన్సిలు సెక్రెటరీ, 1 అనుద్యోగనియోజితుడు, 23 మంది యెన్నికసభ్యులు, ప్రతికూలురలో ఇద్దరనుద్యోగనియోజితులు, 1 కౌన్సిలు కార్యదర్శి, 30 మంది యెన్నికసభ్యులు, ఎన్నికసభ్యులలో బహుజనులు మంత్రులకు ప్రతికూలముగనుండినను వారికి భయముగాని మంత్రిపదవిని విడువవలసిన యాపత్తుగాని గలుగలేదు. గలుగదు. ప్రజాయత్తశాఖలలోగూడ ప్రభుత్వసభ్యులకువోటిచ్చు అధికారముండుటచేగలిగినఫలమిది. ఒక్క యెన్నికసభ్యులవోటులనే లెక్కలోనికి దీసికొన్నయెడల పై సందర్భములో మంత్రులమాటయోడిపోయి తమ పదవులకు తిలోదకాలియ్యవలసివచ్చేది. దీనినిబట్టియే మంత్రులెన్నికసభ్యుల నాశ్రయించుటకంటె కార్యనిర్వాహకుల కిచ్ఛకముగ లోబడియుండుట యావశ్యకమగుచుండును. ఇది బాధ్యతాయుత పరిపాలనామాత్రమునకే భంగము గలిగించుచున్నది.

## ఆర్థికవిషయములు.

ప్రతిరాష్ట్రపరిపాలనలోను ఆర్థికశాఖయొకటియుండును. ఇది రాష్ట్రముయొక్క ఆదాయము లేక ధనమునకు సంబంధించినది. దీని యధిపతి ఆర్థికసభ్యుడు. ఇతనికి ఫైనాన్సుమెంబరని పేరు. ఇతడు కార్యనిర్వాహకవర్గములోనివాడు. ఇతడే రాష్ట్రముయొక్క కోశాధిపతి. ఇతనికి తాబేదారుగ ఆర్థిక కార్యదర్శి యొకడుండును. మంత్రులు కోరెయెడల నింకొక జాయంటు కార్యదర్శిని ఇతనితో కలిసి పనిజేయుటకు గవర్నరుగారు నియోగించవచ్చును. ప్రజాయత్తశాఖలకుచెందిన ఆర్థికవ్యవహారములనెల్ల నీ జాయంటు సెక్రెటరీ చూడవలెను. ఈ ఆర్థికశాఖయొక్క పనులేమనగా (1) మ్యునిసిపాలిటీలకు, జిల్లాబోర్డులకు, పరపతిసంఘములకు, బీదరైతులకు, రాష్ట్రాదాయమునుండి యొసంగినఋణములు (2) క్షామవిమోచనకై నిల్వయుంచిన సొమ్మును సురక్షితముగ కాపాడు బాధ్యత, (3) పన్నులు వృద్ధిచేయుటలోను, తగ్గించుటలోను సలహా సంప్రదింపులనిచ్చుట (4) రాష్ట్రప్రభుత్వము లుజేయు ఋణములు (5) రాష్ట్రవ్యయమును క్రమమైన అధికారముతో జేయునట్లుజూచుట (6) వార్షికాదాయవ్యయపట్టికను తయారుచేయుట. (7) బడ్జెటు మంజూరునుమించకుండ వ్యయము జరుగునట్లుజూచుట, (8) సిస్తు వసూలువిషయమై రివిన్యూ డిపార్టుమెంటునకు సలహానిచ్చుట, ఈ మొదలైనవి.

ఒకమ్యునిసిపల్ సంఘమువారు మంచినీళ్ల వసతి నేర్పాటు చేసికొనుటకై రాష్ట్రప్రభుత్వమును ఋణమడిగి నారనుకొందము. ఆర్థికశాఖవారి సంప్రదింపు ముందుగా లేకయే మ్యునిసిపల్ మంత్రి యాదరఖాస్తును మంజూరుజేయజాలడు. ఆసుపత్రికట్టుటకో, గ్రామములలో ఆరోగ్యమార్గముల నెలకొల్పుటకో, జిల్లాబోర్డువారికి ఋణము కావలసివచ్చినను, పరపతిసంఘమునకు ఋణము కావలసివచ్చినను, ఆర్థికసభ్యుడు ముందుగా పరిశీలింపవలెను. దేశములో త్రాగుబోతుతనము తగ్గించవలెనన్నను, మత్తుపదార్థముల లైసెన్సులను వృద్ధిచేయవలెనన్నను, ఆర్థికశాఖతో ముందుమాట్లాడవలెను. రిజిస్టరీఖర్చులు మార్చవలెనంటే, దేశీయపరిశ్రముల నభివృద్ధి చేయుటకు ఋణములు జేయవలెనంటే, విద్యాలయములు విరివిగా నెలకొల్పవలెనంటే, వైద్యాలయముల నెక్కువ జేయవలెనంటే, వీనికన్నిటికిని ఆర్థిక సభ్యుని యామోదము మొదటగావలెను. ఖర్చుపద్దులు మంజూరైన తరువాత నొకపెద్దపద్దులోనుండి కొంతసొమ్ము తగ్గించి యొకచిన్న పద్దులో మంత్రులు జేర్చుకొనవలెనంటే ఆర్థికసభ్యుడనుమతీయవలెను. ఒకప్రభుత్వోద్యోగిని నియమించినను తగ్గించినను, గనులను కవుళ్లకిచ్చినను, సర్వకాల సర్వావస్థలయందును, ఆర్థికసభ్యుని సలహాలను, ఆమోదములను, ముందు బడయవలసినదే. ఆర్థికసంబంధ మగునొక తీర్మాన మెన్ని యవస్థల బొందునో గమనింపుడు. ఆర్థికవిషయమైన ప్రతిసంగతిముందు గవర్నమెంటు వారిసెక్రెటరీ దగ్గరకుపోవును. అచ్చటినుండి మంత్రిదగ్గరకును, ఆయన యంగీకారమైన పిమ్మట

ఆర్థిక శాఖవారి విమర్శనకై పంపబడును. ఈపరిశోధన లైనతరువాత శాసనసభ
వారుప్రత్యేకముగ నేర్పరచిన ఆర్థికసంఘము వారియెదుట విచారణజరిగి, పిదప శాసన
సభద్వారా తీర్మానము కావలెను. ఈతంతులో మొదటినుండి చివరవరకు గవర్నరు
గారు మంత్రులతో గూడి ఆర్థికశాఖవారు బంపెడి నివేదికను ముందుబెట్టుకొని
ప్రతివిషయమును విచారించుచుండవలెను. సర్వవిషయములందును, ఆర్థికశాఖకు
సర్వతో ముఖమైన యధికారముగలదు. ఏపనికైనను డబ్బుసంగతి ముందు జూచు
కొనుట యవసరమే. రాజ్యాంగములో గూడ ఆర్థికశాఖకు తక్కినశాఖలలో నగ్రస్థా
మిచ్చుటయు న్యాయమే. కాని మనద్వంద్వ విధానములో మంత్రులకీ యార్థికశా
ఖపై పెత్తనము లేకుండుటయే గాక వారియనుగ్ర మాశ్రయించవలసి యున్నది.
కార్యనిర్వాహక వర్గమట్లుగాక ఆర్థికశాఖపై సంపూర్ణాధికార స్వాతంత్ర్యము
లు గలిగి తమయిచ్చవచ్చినట్లు దానిని త్రిప్పగలుగుచున్నారు. అందుచేతనే యీ
యార్థిక శాఖమూలమున మంత్రులు కార్యనిర్వాహక వర్గమునకు మరింత భృత్యులు
గావలసివచ్చుచున్నది. మంత్రులుతలపెట్టిన గొత్త కార్యములకు ధనమునొసంగక ఆర్థిక
శాఖవారు వానినెండగట్టెదరు. దేశములో శాసన, శాంతములు కార్యనిర్వాహక
వర్గమువారి శాఖలు. రాష్ట్రములో శాంతమును నెలకొల్పుటకు పోలీసుడిపార్టుమెంటు
నకు కొంతధనమధికముగా గావలెనని కోరినప్పుడు, ఈ విషయము
మామూలుగా మొదట ఆర్థికశాఖవారి యెదుటకు వచ్చును. పోలీసుశాఖగూడ నీ
యార్థిక సభ్యుని చేతిలోనిదేయగుటచే నతడంతకు ముందే దీనినంగీకరించి యుండును.
మంత్రులు పంపిన ఖర్చుజాబితాల నావలబెట్టి ముందుచేతిలో నున్నడబ్బులో తమ
ఖర్చులకు గావలసినది జూచికొని, పిదప మంత్రులు పంపిన కాగితములను విచారిం
తురు. కార్యనిర్వాహక వర్గమువారిశాఖలెక్కువముఖ్యమైనవగుటచేతను; రాష్ట్రకోశ
ముపై వారికే పెత్తనముండుటచేతను, నీ యన్యాయము జరుగక తప్పదు. కాబట్టి
మంత్రులకీ విధానములో నార్థిక స్వాతంత్ర్య మిసుమంతయు రాలేదుగదా.

మంత్రుల యధికారమునకు ఇండియా గవర్నమెంటువారును స్టేటు సెక్రిటరీ
గారును రెండువిధముల నడ్డము వచ్చుచుందురు. (1) శాసనవిషయము (2) ఆర్థిక
విషయము. రాష్ట్రీయ ప్రభుత్వమువారు గావించు శాసనములలో గొన్నిశాసన
సభలో బెట్టబడుటకు ముందే గవర్నరుజనరలు గారి యనుజ్ఞ బడయవలయును. కొన్ని
టికక్కరలేదు. శాసనసభవారు తీర్మానించిన ప్రతిశాసనమును గవర్నరుగారామో
దించుటయే గాక గవర్నరుజనరల్ గారు గూడ నంగీకరించవలెను. యిండియాలోని
బ్రిటిషువారల మతమునకు సంబంధించిగాని, విశ్వ విద్యాలయములకు సంబంధించి
గాని, రాష్ట్రీయ శాసనసభవారు గావించిన తీర్మానమును లేక చట్టమును గవర్నరు
గారు తామంగీకరించకుండ, గవర్నరుజనరలుగారి యామోదమునకై దానినాపియుంచ
వలెను. ప్రజాయత్తశాఖల మామూలు పరిపాలనలో గూడనిట్టి యాటంకములెప్పు
డును గలుగుచుండును. మంత్రులు తమ యధీనమందున్న ప్రజారోగ్యము, వ్యవసా

యము, పశువైద్యము అను శాఖలకు సంబంధించిన అంటువ్యాధులు, హానికరమైన పురుగులు, తెగుళ్ళు, పశువ్యాధులు, మొదలగు వానింగూర్చి చేయు తీర్మానములుగూడ యిండియా శాసనసభ వారి చట్టముల కనుగుణ్యముగా నుండవలెను. ఆహారపదార్థములు కల్తీ గాకుండ జూడవలసినది మంత్రులు. కాని ఇండియా గవర్నమెంటువారి పెత్తనములోనున్న యెగుమతి దిగుమతులకు వీరి తీర్మానములడ్డుకొనరాదు. ఎందు చేతనంటే విదేశమునుండి దిగుమతియగు, వెన్న, జున్ను, బిస్కత్తులు, నిలువయుంచిన మాంసము మొదలగు వానికేమి యిబ్బంది వచ్చునో. కొలపాత్రలు, తూనికరాళ్ళపై పెత్తనము మంత్రులదే. కాని వానిప్రమాణమును నిర్ణయించుటలో ఇండియాగవర్నమెంటువారి తీర్మానము ప్రకారము నడుచుకొనవలెను. ఎందుచేతనంటే వీనిప్రమాణమునుబట్టి యెగుమతి దిగుమతులలో తేడాలువచ్చును.

సామ్రాజ్య ప్రభుత్వసేవకు సంబంధించిన యుద్యోగములను నూతనముగా నిర్మించుటకుగాని, అనవసరమైన వానిని రద్దుచేయుటకుగాని, మంత్రులకధికారములేదు. నెలకు 1200 రూపాయలకు మించిన జీతముగల ఖాయపు ఉద్యోగమునుగాని, 4000 రూపాయల జీతముగల టెంపొరరీ యుద్యోగమునుగాని నిర్మించుట కధికారములేదు. తమకుగావలసిన సామానులను సరకులను ఇండియాదేశపు వెలుపలనుండి తెప్పించుకొనవలెనంటే, స్టేటు సెక్రటరీగారి యనుమతి గావలెను. తమకుగావలసిన సరకులను తమయిష్టమువచ్చిన దేశమునుండి యెంత లాభకరముగానున్నను తెప్పించుకొనుటకు స్వతంత్రములేదు.

రాష్ట్రీయ శాసనసభలు గావించిన తీర్మానములను, శాసనములను గవర్నరు గారును, వైస్రాయిగారును, అంగీకరించినప్పటికి స్టేటుసెక్రటరీగారు చక్రవర్తి గారికి సిఫారసుచేసి రద్దుచేయించవచ్చును.

## మద్రాసు శాసనసభ.

మనమద్రాసు శాసనసభలో మొత్తముసభ్యులు 127మంది. ఇందు 64 మంది యేపక్షమునందుంటే వారిమాట యెల్లప్పుడును చలామణి యగుచుండును. వీరిలో ఉద్యోగరీత్యా సభ్యులుగాని, ఉద్యోగ నియోజితులుగాని, అనుద్యోగ నియోజితులుగాని, మొత్తమున ప్రభుత్వ సంబంధముచే సభ్యులైనవారు 29మంది. వీరందరును గవర్నమెంటు పక్షమేగదా! యింక నెన్నికసభ్యులు 98 మందిలోను మంత్రులు ముగ్గురు, అండరుసెక్రటరీలుముగ్గురు, ఒక్క ఐరోపియన్ సభ్యుడు, ఒకఆంగ్లోయిండియన్ సభ్యుడు, జమీందారుల ప్రతినిధులు 6 మంది, తోటలప్రతినిధి యొకడు మద్రాసు వర్తకసంఘముల తరపున 5మంది, మొత్తమీ 20 మందియు ననేక కారణములచే సర్వసాధారణముగా ప్రభుత్వపక్షమున నేయుందురు. మిగిలిన 78 మంది యెన్నికసభ్యులలో నుండి 15మందిని (అనగానుమారు ఆయిదవవంతు) ప్రభుత్వమువారు వశపరచుకొన్న

యెడల శాసనసభలో వారిదెబ్బ కెదురుండదు. ఇది ప్రభుత్వమునకెంత సులభ కార్యమో పైననే వివరించితిమి. 98 మంది యెన్నికసభ్యులలోను 63 మందికిష్టము లేకున్నను అధికారవర్గము యొక్క నిరంకుశత్వము సాగజాలము. మనరాష్ట్రములో ప్రభుత్వమువారి ప్రాపకము నపేక్షించి వృద్ధిబొందగోరిన బ్రాహ్మణేతర వర్గమంతయు (జస్టిసు) ప్రభుత్వమున కండదండయై నిలచినపుడు వారింతదూరము పోవలసిన పనియే లేదు. కావున మీరు వోట్లిచ్చుకొనబోవు మీప్రతినిధులుగాని, వారిలోనుండి యే నియోజింపబడు మంత్రులుగాని, యెవరికి బాధ్యులుగా నుందురో? ఉండవలెనో? బాగుగా నాలోచించుకొని, మరియు మీరువోట్లియ్యండి. లేనిచో మీవేళ్లతో మీకన్ను పొడుచుకొందురు. మీరు బంపుకొన్న ప్రతినిధులద్వారానే మిమ్ము పాలించుచున్నామని ప్రభుత్వమువారు రేపు మీ ఓటా మీమీదకే త్రిప్పివేయుదురు. జాగ్రత! జాగ్రత!! జాగ్రత !!!

## 8 వ అధ్యాయము — పెద్ద ఉద్యోగుల జీతములు.

(1) గవర్నరుజనరలుగారికి సంవత్సరమునకు జీతము 2 లక్షల 56 వేలరూపాయలు

| | |
|---|---|
| (2) మద్రాసు, బొంబాయి, కలకత్తా, (ఆగ్రా, అయోధ్య) సంయుక్త పరగణాల గవర్నర్లు నలుగురికి | 1 లక్ష 28 వేల రూపాయలు. ఒక్కొక్కరికి |
| (3) ఇండియాదేశపు సర్వసేనాధిపతికి | 1 లక్ష రూపాయలు. |
| (4) పంజాబు, బీహారు (ఒరిస్సాతో) గవర్నర్లిద్దరికి చెరియొక | 1 లక్ష రూపాయలు. |
| (5) మధ్యపరగణాల గవర్నరుకు | 72 వేల రూపాయలు. |
| (6) అస్సాము గవర్నరుకు | 66 వేల రూపాయలు. |
| (7) లెప్టినెంటు గవర్నరుకు | 1 లక్ష రూపాయలు. |
| (8) సేనాధిపతిగాక గవర్నరుజనరలుగారి కార్యనిర్వాహకసభ్యులు 5 మంది లేక 6 మందికి ఒక్కొకరికి | 80 వేల రూపాయలు. |
| (9) బెంగాలు, మద్రాసు, బొంబాయి, సంయుక్తపరగణాలు నాలుగు రాష్ట్రములలోనుగల కార్యనిర్వాహకసభ్యులు (రాష్ట్రమునకు నలుగురు చొప్పున) ఒక్కొకరికి | 64 వేల రూపాయలు. |

| | | |
|---|---|---|
| (10) | పైరాష్ట్రములకు మంత్రులు రాష్ట్రమునకు ముగ్గరు చొప్పున ఒక్కొకరికి | 64 వేల రూపాయలు. |
| (11) | పంజాబు, బీహారు రాష్ట్రముల కార్యనిర్వాహకసభ్యులు ఒక్కొకరికి | 30 వేల రూపాయలు. |
| (12) | డిటో. మంత్రులకు | 60 వేల రూపాయలు. |
| (13) | మధ్యపరగణాల కార్యనిర్వాహకసభ్యులు ఒక్కొకరికి | 48 వేల రూపాయలు. |
| (14) | అస్సాము గవర్నరుగారి కార్యనిర్వాహకసభ్యులు ఒక్కొకరికి | 42 వేల రూపాయలు. |
| (15) | అడిటరు జనరలుకు | 60 వేల రూపాయలు. |

షరా:—కడచిన యేప్రిల్ నుండియే మద్రాసుమంత్రులు తమజీతములను మనిషి 1 కి నెలకు వేయిరూపాయల చొప్పున తగ్గించుకొనిరి. ఇట్లే మఱి కొన్ని తక్కిన రాష్ట్రములలో గూడ మంత్రులజీతము కొంచెము తగ్గించబడినది.

ఈ జీతములసందర్భమున నొక్కమాట జెప్పవలసియున్నది. ఇంత యధిక జీతములు ప్రపంచములో నేదేశములోను లేవు. ఇందుకు ముఖ్యకారణము విదేశస్థులు నిచటికున్నతోద్యోగములకై హెచ్చుజీతములిచ్చి గొనితెచ్చుట. మరి యు దేశీయులకు అనగా దేశములోని శాసనసభలకు వీరి యుద్యోగములమీద లవలేశమైనను పెత్తనములేదు. వీరిపైన స్టేటుసెక్రటరీగారిద్వారా చక్రవర్తిగారికే పెత్తనము. విదేశీయోద్యోగుల హెచ్చుజీతముల మూలముననే దేశపరిపాలన మిక్కిలి వ్యయప్రదముగానున్నది. సాధ్యమైనంతవరకు జీతములు హెచ్చుగానున్న పెద్ద యుద్యోగములు తెల్లవారివి. జీతములు తక్కువగానున్న చిన్న చిన్న చిల్లరయుద్యోగములే దేశీయులకు నందుబాటులోనున్నవి. కేవలమిట్టి యస్వాభావికమైనపద్ధతి లోకములో నింకెచటనులేదు.

ఈ క్రిందివివరముల నీ సందర్భమున గమనింపదగును. 1913 వ సం॥ 1 వ యేప్రిల్ తేదీవరకు లభ్యమైన అంకెలనుబట్టి దేశములో నెలకు రు 200 లు అంతకు పైనజీతముగల ఉద్యోగములు మొత్తము 10640. ఇందు నూటికి 42 వంతు మాత్రమే దేశీయులకు దక్కెను. పెద్దజీతములుంగల యుద్యోగములలో నీ సంగతి అంతకంటెను మరీ అన్యాయముగానుండును. నెల రు 500 లును, అంతకంటె నెక్కువజీతమును

గల 4984 ఉద్యోగములలో 942 అనగా నూటికి 19 మాత్రము దేశీయులకును తక్కిన 4042 ను అనగా నూటికిని 81 వంతులు తెల్లవారికి లభించెను. నెలకు రు 800 ను అంతకుమించిన జీతమునుగల 242 ఉద్యోగాలు అనగా నూటికి 10 వంతులు దేశీయులును, తక్కిన 2259 ఉద్యోగాలు అనగా నూటికి 90 వంతులు తెల్లవారును అనుభవించుచున్నారు. 1887 వ సంవత్సరము మొదలుకొని 1913 వరకుగల సుమారు 25సంవత్సరములలో నీవిషయమందు జరిగిన అభివృద్ధియేమంటే, దేశీయుల హస్తగతమైన రు200లు జీతముగల ఉద్యోగాలు నూటికి 34నుండి 42వరకును రు 500 లు గలవి నూటికి12నుండి 19 వరకును రు800లుగలవి నూటికి4నుండి 10వరకు హెచ్చినవి. ఇరువది యైదేండ్లలో జరిగిన యీ యభివృద్ధివేగమును బట్టి లెక్కవేసినచో దేశములో నున్న ప్రభుత్వోద్యోగములన్నియు దేశీయులపరమై సంపూర్ణముగా దేశపరిపాలనా భారము దేశములోనియువకులపైబడుట కింకెన్ని శతాబ్దములుపట్టునో పాఠకులే గుణించుకొనగలరు.

స్టేటు సెక్రిటరీ జీతము.

ఇండియా దేశముయొక్క క్షేమాభివృద్ధులను బ్రిటిషు పార్లమెంటువారెన్నడును శ్రద్ధగా విచారించిన పాపమునబోలేదు. పార్లమెంటు సభా కార్యక్రమ మంతయు దాదాపుగా ముగిసిన తరువాత ప్రతియేడును చిట్టచివరకు ఇండియాబడ్జెట్టునుగూర్చి యొకకేకతో త్రోసివేసేయాచార మనేక సంవత్సరములనుండి జరుగుచున్నది. ఆ సమయమునకు పార్లమెంటుసభ్యులు చాల మంది లేచివెళ్లిపోవుటచే కాళీబల్లలకు లాంఛనముగా ఇండియావృత్తాంతమును నివేదించేవారు. ఇండియాదేశముపై శ్రద్ధగలరే యిద్దరు ముగ్గురు సభ్యులో నీ యక్రమమునుగూర్చి యరణ్యరోదనముగా 1873 వ సంవత్సరమునుండి విసుగు విరామములేకుండా గోలబెట్టుచుండెడివారు. అట్టివారిలో ఫౌలరు, క్లాడ్వెల్, కీర్హార్డీ అనువారుముఖ్యులు. "పార్లమెంటులోని యిండియావ్యవహారములను" వృత్తాంతము వార్తాపత్రికలలో కేవలము పరిహాసముగానుండెను. ఈ యుపేక్షకెల్ల ముఖ్యకారణము ఇండియా స్టేటుసెక్రిటరీగారి జీతమును ఆయనయిండియా కార్యస్థానపు ఖర్చులను ఇండియాధనమునుండియే ఖర్చుపెట్టుచుండిరి. ఇంగ్లాండుధనమునుండి యిండియాకొరకు ఒక్క చిల్లిగవ్వయైనను ఖర్చులేకుండెను. ఆస్ట్రేలియా, కనడా మున్నగుతక్కిన వలసరాష్ట్రముల విషయములో నిట్లుగాదు. ఆయా స్టేటుసెక్రిటరీలజీతములు మొదలగు ఖర్చులన్నియు యింగ్లాండే భరించుచున్నది. యిండియాకు నోరు లేదు గనుక తనస్టేటుసెక్రిటరీఖర్చులు తానే యిచ్చుకొనుచుండెను. ఇందుచేతనే యిండియా వ్యవహారమంటే పార్లమెంటునకు శ్రద్ధలేదు. జవాబుదారీలేదు. యింగ్లాండుధనమునుండి యీ ఖర్చులు జేసినచో పార్లమెంటువారి కెక్కువబాధ్యత యుండును. ఈ విషయమై 1906 వ సం॥ లో నొకతీర్మానము పార్లమెంటు విచారణలోనికివచ్చి ఓడిపోయెను. తుదకు 1919 వ సంవత్సరపు మాంటాగ్యు సంస్కారణములతో నీమార్పు అమలులోనికి వచ్చినది.

# రైల్వే యుద్యోగుల జీతములు.

ఉన్నతోద్యోగుల వేతనములను బూర్తిగ తగ్గించవలెనని యెవరును గోరరు. కాని యట్టియేర్పాటులో న్యాయమైన పద్ధతి యొకటియుండవలెను. పెద్దయుద్యోగుల జీతములను నిర్ణయించునపుడు దేశకాలపరిస్థితులను బాగుగా విచారించవలెను. క్రింది యుద్యోగుల జీతములకును పైయుద్యోగుల జీతములకును గల తారతమ్యము సబబుగా నుండుటగూడ ముఖ్యము. 6932 మైళ్లపొడవుగల ఇనుపదారిపై పెత్తనము జేయు జపానుదేశపు రైల్వేశాఖయొక్క జనరల్ మేనేజరుకు నెలకు 1000 రూపాయలు జీతమిచ్చుచున్నారు. ఇట్టియుద్యోగికి స్విడ్జర్లాండు దేశములో మాసమునకు 1042 రూపాయల జీతము. బెల్జియము, డెన్మార్కు, నార్వే, ఇటలీ, చైనా దేశములలో నుండు రైల్వేజనరల్ మేనేజర్లకు నెలకు 1333 రూపాయలు మొదలు 1600 రూపాయలకు మించకుండ జీతము నిచ్చుచున్నారు. ప్రపంచమున ధనవంతములని పేరొందిన జపాను, చైనా, బెల్జియము, డెన్మార్కు, నార్వే, ఇటలీ మున్నగు దేశములలోనే ఉన్నతోద్యోగుల జీతము లీప్రకారమున్నపుడు నిత్యక్షామనివాసయోగ్యమైయున్న హిందూదేశములో రైల్వేయేజంటునకు నెలకు 3500 మొదలు 4000 రూపాయలవరకు జీతమునొసగుచున్నారు. మరియు పాశ్చాత్యదేశములలోకంటె మనదేశములో జీవితవ్యయము నేకరెట్లు తక్కువగానుండును. పన్నులుచెల్లించుప్రజలకు వానినిసరిగా ఖర్చుపెట్టించు విషయములో పెత్తనము లేకుండుటయే యీ యక్రమమునకు మూలకారణము. అనగా స్వరాజ్యము లభించిననేగాని యీ దురాగతములను చక్కబెట్టుటకువీలుండదు. మనదేశములో అందరికంటె ఉన్నతోద్యోగిజీతమునకును అందరిలోను క్రిందియుద్యోగిజీతమునకును ఆశ్చర్యకరమైన వ్యత్యాసము గాన్పించుచున్నది. ఇండియాలో రైల్వే డిపార్టుమెంటునందు ఒక చిన్నయుద్యోగిజీతముకంటె పెద్దయుద్యోగికి 400 రెట్లు హెచ్చుజీతము లభించుచున్నది. ఇనుపదారులను బరిపాలించుటకు పెద్దయుద్యోగుల తెలివితేట లెంతయవసరమో క్రిందినౌకరులకాయకష్టము నంతేయవసరము గదా. ఒకవేళ నీభేదము కొంచెమెక్కువగానుండుట న్యాయమనుకొన్నను ఇంత తలక్రిందుగానుండుట ఘోరకలి. ఇతరదేశములందుగూడ నీవ్యత్యాస మెట్లున్నదో యీదిగువయంకెలను జూడనగును. వివిధదేశములలో చిన్నయుద్యోగికంటె పెద్దయుద్యోగికి షామాషాయి యెన్నిరెట్లధికజీతమో ఈ యంకెలు దెల్పును. డెన్మార్కు 1; 3; ఇటలీ 1; 6; హాలెండు 1; 7; నార్వే 1; 7; బెల్జియము 1; 8; ఫ్రాన్సు 1; 22: చైనా 1; 32; ఇండియాలో 1; 400; రైల్వేశాఖయందలి దిగువయుద్యోగి ఆఖరుజీతమునకు 25 రెట్లకంటె నధికముగ పైయుద్యోగులజీతము లుండగూడదని అఖిలభారత రైల్వేకాన్ఫరెన్సువారు తీర్మానించిరి. ఈ దీనాలాపముల నాలించేవారెవరు ?

# కొన్ని ప్రశ్నలు.

——:o:——

రాబోవు అక్టోబరు నెల 25వ తేదీని యీమాంటాగ్యు సంస్కరణల ప్రకారము రెండవసారి శాసనసభల యెన్నికలు జరుగనున్నవి. కావుననిపుడు సభ్యర్థులుగానిలిచి ప్రయత్నించుచున్నవారు స్వయముగానో, వ్రాతమూలముగానో, తమ ప్రతినిధుల ద్వారానో, మీ యొద్దకువచ్చి మీవోటిమ్మని యడిగెదరు. మీరసహాయ వాదము ననుసరించి యెవరికిని వోటివ్వదలంచు కొననియెడల సరియే. లేక యేకారణము చేతనైన వోటిచ్చుట కుద్యమించినయెడల, నీ క్రింద సూచించు ప్రశ్నలనుగాని, లేక మీకుదోచిన ప్రశ్నలుగాని వారినడిగి మీకు సంతృప్తికరమైన సమాధానము లభించేవరకు మీ వోటు నెవరికిని వాగ్దానము జేయరాదని మనవి జేయుచున్నాను. నిన్న మొన్నటివరకు దేశమునుగూర్చియు, ప్రజలనుగూర్చి స్వప్నమందైన దలపెట్టని మహనీయులందరును, అదియేమి మహాత్మ్యమోగాని, యీయెన్నికల హడావుడి వచ్చినప్పటినుండి హఠాత్తుగా నెకామెకిని, యేసుక్రీస్తు మహానుభావులైపోయి, వోటర్ల ధర్మములు, ప్రజా స్వాతంత్ర్యము, రైతులకష్టములు, నిమ్న జాత్యుద్ధరణము, పరిశ్రమాభివృద్ధి, రాజకీయ ఖైదీలయవస్థ, స్వసంఘోద్ధరణ, జన్మస్థానాను రాగము, మున్నగు మహావిషయములను గూర్చిపత్రికావ్యాసములేనా ? ప్రత్యేకము కరపత్రములేనా ? మేనిఫెస్టోలేనా ? పత్రికా విలేఖకులతో సంభాషణములేనా ? ఉపన్యాస వేదికలపై నెక్కి వక్కాణించుటలేనా ? యెన్నెన్ని విచిత్రములనో జరుపుచున్నారు. వారిలో జాలమందికి, మనలో జాలమంది శుద్ధబుద్ధి హీనులమనియు, వారు తంథనాఅంటే, మనమెప్పుడును భళాభళీ యందుమనియు, ఆంతర్యమైన అభిప్రాయము. మనతో మాట్లాడి అవలకు వెళ్ళగానే 'యీముండాకొడుకు నెట్లాగోటోపీ వేసితిమిలెమ్మ'ని వారిలోవారు జెప్పుకొని సంతోషింతురు. మనకు

అసహాయోద్యమమువలన నేమివచ్చినను, ఏమిరాకున్నను, వీరి మాయమాటలకును, దబాయింపులకునులొంగక, వీరిని ధైర్యముగ నాలుగు ప్రశ్నలువేసి రెండుపట్టీలు కొట్టించగల యోగ్యతమైనను లభించినదని మనము సంతోషించవచ్చును. శాఖాద్యభిమానము లచే సంకుచిత హృదయులుగాక, శిఫారసులకును మోమోటము లకును తావివ్వక, నిష్పక్షపాతముగా దేవుని ముఖముజూచి కేవలము యోగ్యత గలవారికి మాత్రమే మీవోటు నివ్వండిసుమాయని ప్రజలకిపుడు సత్యధర్మ సందేశముల నుద్బోధించుచున్న యీదేవదూత లందరు, సంస్కరణలు వచ్చినదినములలో బ్రాహ్మణేతరులకు ప్రత్యేక సాంఘిక ప్రాతినిధ్యము కావలెనని గందరగోళముజేసి కొన్ని ప్రత్యేక స్థానములను భద్రము జేయించినపుడు, ఎచటికివెళ్ళిరి? ఈ కేవలయోగ్యత సిద్ధాంతము లెచటికివెళ్ళినవి? వీనికే వాటంవారి సిద్ధాంతములని పేరు. అమ్మపుట్టినింటిని మేనమామముందర పొగడవలెనా? వారి సత్తామనకు దెలియును. మనలోతు వారికిదెలియును. కావునవారు మనదగ్గరకు వచ్చినపుడే మనముకుగదలంచిన నాలుగుప్రశ్నలు గట్టిగానడిగితరువాత వోటుసంగతి యాలోచింతము.

—♦సభ్యర్థు లందరిని సాధారణముగా నడుగవలసిన ప్రశ్నలు.♦—

(1) కడచిన మూడునాల్గుసంవత్సరములనుండి దేశమంతటిని కలవరపరచుచున్న అసహాయోద్యమమునకు మీరనుకూలురా? ప్రతికూలురా?

(2) అనుకూలురైన యెడల మీరు దీనిని బహిరంగముగా నంగీకరింతురా? కొంతవర కంగీకరింతురా? రహస్యముగా నంగీకరింతురా? బహిరంగముగా నంగీకరించినయెడల మీరీయుద్యమమునకై ఏమిపనిచేసితిరి? ఎంతధనమిచ్చిరి? రహస్యముగానైనచో నెట్టిసహాయమునుజేసితిరి? (సమాధానము రహస్యముగానే యుంచబడును) కొంతవర కంగీకరించినచో అంతవరకు నేమి పనిజేసితిరి. ఎంతధనమునిచ్చితిరి?

(3) మీరీ యుద్యమమునకు ప్రతికూలురైనచో, మీయభిప్రాయము ననుసరించి దేశీయులు తప్పుమార్గమున బోవుచున్నట్లు మీరు నమ్మినపుడు, వారిని నివారించుటకై మీరేమి ప్రయత్నము జేసితిరి? ఈ విషయములో నెంతధనమును ఖర్చుబెట్టితిరి? ఎన్ని యుపన్యాసము లిచ్చితిరి? అసహాయోద్యమము నణచివేయుటకై ప్రభుత్వమువారు గావించిన కార్యములకెల్ల మీరెంతవరకు దోడ్పడితిరి? అంతటితో మీధర్మము పూర్తియైనదా! మీరు ప్రజలలోగలసి యీవిషయమై జేసిన పనియేమి?

(4) ఖద్దరు వస్త్రాభివృద్ధి దేశమునకు లాభకారియని మీరు నమ్మెదరా? మీరు ఖద్దరు దీక్షతో ధరింతురా? యథాశక్తిగా ధరింతురా? మీరు శాసన సభ్యులైతే శాసనసభలో గూడ ఖద్దరునే దీక్షతో ధరింతుమని వాగ్దానము చేయగలరా?

(5) మీకొకవేళ ఖద్దరుమీద నమ్మకములేనిచో, కేవలము విదేశవస్త్రములనే ధరించుటకంటె ఈదేశములో తయారైన మిల్లు బట్టలను ధరించుటయైనా దేశమున కెక్కువ లాభకారి కాదా? అట్లయినచో మీరు విదేశవస్త్రములను దీక్షతో విసర్జించి స్వదేశవస్త్రములనే (ఇండియాలో తయారగు మిల్లుబట్టలైనను నేతబట్టలైనను సరియే) నియమముగా ధరించుచున్నారా? లేనిచో ఎందుచేత!

(6) ధరప్రియమనియో, నాజూకుగా లేవనియో, తెల్లయుద్యోగుల యిచ్ఛకమునకో, గాక మరియే కారణముతో మీరు స్వదేశవస్త్రములను గట్టక విదేశ వస్త్రములను ధరించుచున్నారు? స్వదేశవస్త్రములు ధర ప్రియమందురా, దేశలాభమునకంటె మీస్వలాభమే మీకు ముఖ్యమన్నమాట. నాజూకుగా లేవన్నచో మీదేశములో తయారైన వానిని జూచి ప్రేమించి యానందించేశక్తి మీకు లేదన్నమాట. అనగా మీదేశమును ప్రేమించుట మీకు చేతగాదని యర్థము. నిన్ను కనిపెంచి పోషించిన నీతల్లికంటె

సర్వాంగ సౌష్టవమునుగలిగిన మరియొక వరాయిస్త్రీ నీ భక్తిగౌరవ ములకెట్లెక్కువ భాజనమగును?

మూడవ కారణమైనచో దేశక్షేమమునకంటె ప్రభుత్వోద్యోగుల ప్రాపకానుగ్రహములే మీకు ముఖ్యమన్న మాట.

(7) దేశముకొరకు, దేశీయులకొరకు, వారి జీవనోపాయములను నిల్పుటకొరకు, ఈపాటి అభిమానత్యాగములతో స్వదేశవస్త్రధారణ దీక్ష నవలంబింపని వారిని, శాసనసభలకు బంపినచో వారచట దేశమునకు గావింపబోవు మహోపకార మేమి? విదేశవస్త్రములను విసర్జించి స్వదేశవస్త్రములను దీక్షతో ధరింపనివాడు, తక్కిన యోగ్యతలలో నెంత బ్రహ్మాండ నాయకుడైనను దేశహితైక కార్యముల నొనర్చుటకు నావంతయు న్యాయముగా నర్హుడుగాదని ముమ్మాటికిని ఘంటాపథముగా జెప్పుట కేమి యభ్యంతరము?

(8) మీ యెన్నిక సభ్యులలో బహు జనాభిప్రాయమును మంత్రులు గాని కార్యనిర్వాహక సభ్యులుగాని లక్ష్యము జేయు, నప్పుడు మీరేమి జేసెదరు?

(9) దేశమునకు స్వరాజ్యము లభించుట మీకిష్టమైతే అందుకు మీరు సూచించు మార్గమేది? దాని కెంతకాలము పట్టును?

(10) ఈసారి మీరు శాసనసభకు వెళ్ళకపోతే దేశమునకేమి నష్టము గలుగును? మీస్థానములో నెవరో యొకయూరు పేరులేని పుల్లయ్యను పంపితే దేశమునకు వచ్చేనష్టమేమి? శాసనసభలో మరియొకరి కసాధ్యమైనది, మీకేసాధ్యమైనది యేవిషయమున్నదో దెల్పుడు?

(11) ఇప్పుడు శాసనసభకుబోవు వారిలో మీకేమైనపార్టీ గాని, కార్యక్రమపద్ధతిగాని ఉంటే వివరింపుడు. ఎవరెవరుగలిసి యేయేవిషయములలో నేదారిని బోవుదురు ?

కడచిన యెన్నికలలో శాసనసభ్యులై మరల నీసారిగూడ ప్రయత్నించుచున్న వారినే యడుగవలసిన ప్రశ్నలు:—

(1) మీరింతవరకు శాసనసభ్యులుగా నుంటిరిగదా! మీరే యే సందర్భములలో ప్రభుత్వమునకు వ్యతిరేకముగా ప్రజాపక్షమున జేయెత్తిరి. (1) మాస్లావాగెను (2) ఆయకట్టు (3) రసుల్ కొండ రంపపుమరలు (4) న్యాయవిచారణ శాఖావిభాగము (5) రాజకీయ ఖైదీలు (6) శిక్షార్థపుపన్నులు మున్నగు విషయములలో మీరేమి జేసిరి?

(2) మీరు శాసనసభ్యుడుగానున్న కాలములో ప్రయాణపు ఖర్చులు వగైరా క్రిందగాని, జీతభత్యముల క్రిందగాని, తీసికొన్న బిల్లుల సుమారు మొత్తమెంత?

(3) మీరుశాసనసభ్యులైన తరువాత మీయార్థికస్థితి యెంత యభివృద్ధి జెందినది? లేక యీసభ్యత్వమువలన మీరెంత ధననష్ట మును బొంది దేశసేవజేసిరి?

(4) మీరు శాసనసభ్యులైన తరువాత మీవోటరుల నెన్ని సార్లు సమావేశపరచి మీరుజేయుచున్న పనివిషయమై వారియభి ప్రాయములను దెలిసికొని మీకష్ట నిష్ఠురములను వారికి దెలియ జేయ ప్రయత్నించిరి? శాసనసభలో ప్రజాపక్షమున కక్రమము జరిగినట్లు మీకు దోచినపుడెల్ల మీరెట్టి ప్రజాందోళన జేయప్రయ త్నించిరి?

(5) మీరు బ్రాహ్మణేతరులైనచో, బ్రాహ్మణేతర సంఘము నకు ప్రత్యేకముగా మీశాసన సభ్యత్వమువలన మీరుజేసినయుపకా రములేమి?

(6) మీశాసన సభ్యత్వమువలన మీకును, మీకుటుంబమునకు ను, మీబంధుమిత్రులకును, గలిగిన ప్రయోజనములుగాక దేశము నకుగాని, సంఘమునకుగాని మొత్తమున గలిగిన లాభములేమి?

(7) మీరు ప్రత్యేకముగా శాసనసభలో ప్రవేశబెట్టి పోరాడి గెల్పించిన దేశహితకరమైన తీర్మానములుగాని చట్టములుగాని యేమిగలవు?

(8) కడచిన యెన్నికలలో నేకారణముచేతనైన మీరు శాసన సభ్యులుగా వెళ్ళుట తటస్థించకుండిన యెడల దేశమునకేమి నష్టము సంభవించియుండెడిదో సుమారుగా అంచనావేసి చెప్పగలరా?

—:బ్రాహ్మణేతర సభ్యర్థుల నడుగవలసిన ప్రశ్నలు:—

(1) మీరు శాసన సభ్యులై బ్రాహ్మణేతరులకు ప్రత్యేకముగా జేయబోవు ప్రయోజనములేమి? ఇదివరకు వెళ్ళినవారేమి జేసిరి?

(2) దేశీయులకు రాదగిన ప్రభుత్వోద్యోగము లన్నియు, పూర్తిగా బ్రాహ్మణేతరులకే వశమైనప్పుడు, దేశమునకు స్వరాజ్యమెట్లు సిద్ధించును? ఇదివరకా యుద్యోగములనెల్ల బ్రాహ్మణులు జేసినపుడు స్వరాజ్యమెంతవరకు వచ్చినది?

(3) ఒకకులమువారొక కచేరీలోగాని, యొక డిపార్టుమెంటులోగాని, యెక్కువమంది యుద్యోగులుగా నున్నచో ఆ కులమువారి కచట కొంచెము పలుకుబడి కలుగునేగాని అసలు దేశపరిపాలనా మొత్తమున విదేశీయులైన అధికారవర్గమువారి నిరంకుశ విధానముల నెదుర్కొని ప్రజాభీష్టమును కొనసాగించుటకెట్లు వీలగును?

(4) ప్రభుత్వ విధానము మారకుండ, ఏకులమువారైనను దేశీయులలో నెంత యెక్కువమందికి నెంత పెద్ద ప్రభుత్వోద్యోగములు లభించునో, అంత యెక్కువగా విదేశ ప్రభుత్వమునకు బలమును, ప్రజాపక్షమునకు దుర్బలమును, కలుగుచుండుటలేదా? సింహప్రభువుకు గవర్నరు పదవి లభించినపుడు దేశస్వాతంత్ర్య మెంతవృద్ధియైనది? పాలకపాలితు లిరువురును వాది ప్రతివాదులుగా నున్నంతకాలము, పాలితులలో నుండిపోయి పాలకులకు సాయముజేయు ప్రతిమనిషివలన (కూలివాడైనను సరియే) ప్రజాపక్షమునకు దుర్బలమును ప్రభుత్వమునకు బలమును, చేకూరుటలేదా? మన దేశములోని పాఠశాలలన్నియు నీ కార్యమునకే తోడ్పడుచుండుట లేదా? మీరు శాసనసభ్యులుగా బోయి నీచిక్కునెట్లు తీర్చెదరు?

# ఇండియాగవర్న్మెంటు చట్టము.

## —1 వ భాగము.—

### చక్రవర్తిగారి ఇండియా పరిపాలన.

1. 1858 సంవత్సరపు ఇండియాగవర్న్మెంటు ఆక్టుప్రకారము యీస్టిండియా కంపెనీవారివద్దనుండి ఇంగ్లాండు రాణిగారి యధీనములోనికి వచ్చిన యిండియా రాజ్యమంతయు ఏదివరకేయధికార స్వత్వములతో కంపెనీవారిచే పరిపాలింపబడుచుండెనో ఆ యధికార స్వత్వములతోనే చక్రవర్తిగారి పేరట పరిపాలింపబడుచుండవలయును.

### స్టేటు సెక్రటరీ లేక ఇండియామంత్రి.

2. (1) 1858 వ సంవత్సరమునకు బూర్వము ఇండియా రాజ్య వ్యవహారములను పాలించుచుండిన కంపెనీవారి యొక్కయు, వారి డైరక్టర్లయొక్కయు, ఇతర పైయధికారులయొక్కయు, అధికార ధర్మములనెల్ల స్టేటుసెక్రటరీగారే వహించి యీ చట్టములోని నియమముల ప్రకారము ఇండియా దేశమును పరిపాలించవలయును.

(2) ముఖ్యముగా స్టేటు సెక్రటరీగారు ఈ చట్టములోని నియమముల ననుసరించి ఇండియా దేశ పరిపాలనకు లేక దేశాదాయమునకు సంబంధించిన సమస్తవిధములగు శాసనములను, కార్యములను, ఇతర వ్యవహారములను, ఉద్యోగుల జీతభత్యములను, ఇతరఖర్చులు మొదలగువానినెల్ల తనయాజమాన్యాధికారముల క్రింద నుంచుకొని క్రమముగా పరిపాలించవలెను.

(3) స్టేటు సెక్రటరీగారి జీతమును పార్లమెంటువారొసంగవలయును. ఆయన తాబేదారులయొక్కయు కార్యస్థానము

లోని తక్కిన పరివారవర్గము యొక్కయు, జీతభత్యముల నెల్ల ఇండియా దేశపు రాబడినుండిగాని లేక పార్లమెంటు వారొసంగెడి ధనమునుండిగాని ఖర్చు పెట్టవలయును.

ఇండియా కౌన్సిలు,

౩. (1) ఇండియా ఆలోచనసభలో సెక్రటరీ యిష్టప్రకారము ఎనిమిదిమందికి తక్కువలేకుండ పండ్రెండుమందికి మించకుండ సభ్యులుండవలయును. (1919 వ సంవత్సరపు ఇండియా గవర్నమెంటు ఆక్టుకు పూర్వమే కౌన్సిలులో సభ్యులుగా నున్నవారి నీనియమము బాధించదు. కాని క్రొత్త సభ్యులను మాత్రమీనిర్ణయము నతిక్రమించి జేర్పరాదు.)

(2) కౌన్సిలులో నేర్పడిన ఖాళీలను బూర్తిచేసే యధికారము సెక్రెటరీకే గలదు.

(3) కౌన్సిలు సభ్యులలో సగముమంది ఇండియాలో పది సంవత్సరములు ఉద్యోగము చేసినవారుగాని నివసించినవారుగాని అయియుండవలెను. మరియు వారు ఇండియాను వదలిన ఐదుసంవత్సరముల లోపుగానే సభ్యులుగా నుండవర్సులు. ఈ యర్హతలు గలవారినే కౌన్సిలులోని ఖాళీ స్థానములకు నియమించవలెను.

(4) ప్రతికౌన్సిలు సభ్యుడును ఐదుసంవత్సరముల వరకును సభ్యుడుగ నుండును. (1919 వ సంవత్సరపు ఇ. గ. ఆ. కు పూర్వమే సభ్యులుగా నున్నవారికీ నీనియమము వర్తించదు.)

(5) సాధారణముగ ఒకమారు సభ్యుడైనవానిని తిరిగి సభ్యునిగా నేర్పాటు చేయకూడదు. కాని తగిన ప్రత్యేకకారణములను స్టేటు సెక్రటరీ పార్లమెంటువారికి దెలుపుచు అట్టివానినే మరల నింకొక ఐదుసంవత్సరములు సభ్యుడుగా నియమించవచ్చును.

(6) కౌన్సిలుసభ్యు లెవరైనను తమ సభ్యత్వమునకు రాజీనామా నివ్వవచ్చును. రాజీనామా కారణములను సభా వృత్తాంత గ్రంథములో నుదహరించవలెను.

(7) పార్లమెంటువారి కోరికమీద చక్రవర్తిగా రీసభ్యులలో నెవరినైన దీసివేయవచ్చును.

(8) కౌన్సిలు ప్రతిసభ్యునికి సంవత్సరమునకు పండ్రెండు వందల పౌనుల జీతము. ఇండియాలో స్థిర నివాస మేర్పరచుకొన్న వారీ సభ్యులలో నున్నయెడల అట్టి సభ్యునికి జీతము గాక సాలుకు ఆరువందల పౌనలు భత్యమీయబడును. ఇట్టి జీత భత్యము లన్నియు ఇండియా ధనములో నుండి గాని పార్లమెంటువా రొసంగు ధనములోనుండి గాని ఖర్చుపెట్ట వలయును.

(9) ఇండియాలో ప్రభుత్వోద్యోగమునందున్న వాని కీసభ్యత్వము లభించినయెడల అతడు సభ్యుడుగానున్న కాలము గూడ అతని పింఛను గడువులెక్కలోనికి కలిసి వచ్చును.

4. ఈకౌన్సిలు సభ్యులెవ్వరును పార్లమెంటులో సభ్యుడుగా నుండ రాదు.

కౌన్సిలు చేయువలసినపని.

5. సెక్రటరీ యాజ్ఞానుసారము ఇండియా గవర్నమెంటువారు ఇంగ్లాండులో జేయు వ్యవహారములను, ఇండియా దేశముతో నుత్తర ప్రత్యుత్తరములను, ఇండియా కౌన్సిలువారే జరుపవలెను.

6. (1) ఇండియా కౌన్సిలు వారి యధికారములును, కౌన్సిలుతో గూడిన సెక్రటరీగారి యధికారములును, కౌన్సిలు సమావేశముల ద్వారా అమలు, జరుగవలయును. (ఈ సమావేశములకు హాజరు కావలసిన సభ్యుల అన్యూన సంఖ్యను (కోరం) సెక్రటరీ నిర్ణయించును.,

(2) సభ్యుల స్థానమేదైన ఖాళీగా నున్నప్పటికిని కౌన్సిలు వ్యవహారములు మామూలుగా జరుగవచ్చును.

అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు.

7. (1) స్టేటు సెక్రెటరీగారే యిండియా కౌన్సిలుకు సభాధ్యక్షుడు. ఆయనకుకూడ అందరితో పాటు వోటిచ్చే యధికారము గలదు.

(2) కౌన్సిలు సభ్యులలో నొకరిని స్టేటు సెక్రెటరీగా రుపాధ్యక్షునిగా నియమించ వచ్చును. అవసరమైతే ఆయుపాధ్యక్షుని దీసివేయ వచ్చును.

(3) కౌన్సిలు యొక్క ప్రతి సమావేశమునకును సెక్రెటరీయో లేనిచో ఉపాధ్యక్షుడో సభాపతిగా నుండవలెను. వీరిరువురును లేనియెడల హాజరైన సభ్యులు తమలో నొకరిని సభాపతిగా నెన్నుకొనవచ్చును.

8. ఇండియా కౌన్సిలు సమావేశములను సెక్రటరీయే తమయిష్టము వచ్చినపుడు సమావేశ పరచవలెను. కాని ఇట్టి సమావేశము కనీసము నెల కొకటియైనను జరుగవలెను.

9. (1) కౌన్సిలు సమావేశములలో అభిప్రాయ భేదము వచ్చినపుడు సెక్రెటరీ హాజరుగానున్నచో అతని నిర్ణయమే అంగీకృతము కావలెను. ఈ చట్టముప్రకారము బహు జనాభిప్రాయము ననుసరించి తీర్మానము కావలసిన విషయమునకు మాత్రి మిది వర్తించదు.

(2) సమావేశములో నిరు పక్షములవారును సమానముగా నున్నపుడు సభాపతి అధికముగా నింకొక వోటునిచ్చియేదో పక్షమును నిర్ణయించును.

(3) సెక్రెటరీ హాజరులేని సమావేశములలో తీర్మానమైన విషయము లన్నియు ఆయన యంగీకారమును వ్రాతమూలముగ బొందవలెను.

(4) కౌన్సిలు సమావేశములో భేదాభిప్రాయముతో తీర్మానమైన విషయమును గూర్చి సెక్రిటరీ తన యభిప్రాయమును కారణములతో సభావృత్తాంత గ్రంథములో వ్రాయించవచ్చును. ఇట్లే హాజరైన తక్కిన సభ్యులుగూడ జేయవచ్చును.

10. కౌన్సిలు వ్యవహారముల నెక్కువ సులువుగ నిర్వర్తించుటకై సెక్రిటరీ తన కౌన్సిలు సభ్యులలోనుండి చిన్న చిన్న ఉపసంఘముల నేర్పాటు జేసి వారికి గావలసిన నియమ విధానములను నిర్ణయించి కార్యభారము నందరికిని పంచి వేయవచ్చును. ఈ యుపసంఘమువారు చేసిన వ్యవహారములు సెక్రిటరీ కౌన్సిలు వారు జేసినట్లే యెంచబడును.

11. యిండియా దేశమునకు బంపే ఉత్తరువులు, సంజాయిషీలు, గవర్నరు జనరలు గారితో జరిపెడి ఉత్తర ప్రత్యుత్తరములు, మొదలైనవన్నియు కౌన్సిలుతో గూడిన సెక్రటరీగారి నిర్ణయ ప్రకారము జరుగవలెను.

12. } ఈ సెక్షనులు.
13. } తీసివేయబడెను.
14. }

15. యుద్ధము నారంభించుమని యిండియా దేశములోని సైన్యమునకు ఉత్తరువు పంపిన మూడు నెలలలోగా ఈసమాచారమును సెక్రటరీ పార్లమెంటు వారికి నివేదించవలెను. ఈలోపుగా నీయుత్తరువు నుపసంహరించు కొన్నయెడల నిట్లు జరుపనక్కరలేదు. ఆమూడు మాసములలోను పార్లమెంటు సమావేశము కానియెడల తరువాత సమావేశమైన నెల లోపుగా నివేదించవలెను.

16. (తీసివేయబడెను.)

## స్టేటు సెక్రెటరీ సిబ్బంది.

17. (1) చక్రవర్తిగారు మంత్రివర్గముతో నాలోచించి ఆజ్ఞాపించి ననే కాని యిండియూ కౌన్సిలులో క్రొత్త యుద్యోగముల నేర్పాటు చేయరాదు. ఉన్నవారి జీతములను వృద్ధిచేయ రాదు. ఈ యుత్తరువు నొసంగిన పదునాలుగు దినములలో దానిని పార్లమెంటు వారియెదుట బెట్టవలయును.

(2) సివిలుసర్వీసు ఉద్యోగుల విషయమై చక్రవర్తిగారు గావించు నియమములన్నియూ ఆ యాశాఖల కన్వర్తించగలవు.

(3) స్టేటు సెక్రెటరీ కౌన్సిలువారు ఆయుద్యోగములను నిర్ణయముచేయుట, జీతములను వృద్ధిచేయుట, ఉద్యోగులను తీసివేయుట, మున్నగు కార్యములను జేయవలెను.

18. (స్టేటుకౌన్సిలు ఉద్యోగుల పింఛను, ఉపకారభృతులు, మొదలగు వానినిగూర్చి యీ సెక్షనులో వ్రాయబడినది.)

19. కంపెనీవారి హయాములోగాని తరువాతగాని యిండియా దేశమునందు సివిల్ మిలిటరీ యుద్యోగములు చేసినవారి సంతానమునకు సైనికోద్యోగములలో పూర్వమువలెనే ప్రత్యేక సదుపాయముల నేర్పాటుచేయవలెను.

## సైనికోద్యోగములు.

19. (ఎ) ఈచట్టము ప్రకారము సెక్రెటరీకిని ఆయన కౌన్సిలుకును తమ యాజమాన్యాధికారములక్రింద యిండియా పరిపాలన క్రమముగా జరుగునట్లు జూడవలసిన బాధ్యతగలదు. ఆవిషయములో వారు 1919 సం॥ యి. గ. ఆక్టును అమలు జరుపుట కనువగునట్లు లేక అవశ్యకమయినట్లు కొన్ని నియమముల నేర్పాటుజేయ వచ్చును. ఈనియమములు ప్రజాయత్త పరిపాలనా శాఖలుగాక తక్కినవానికి సంబంధించియున్న యెడల వానిచిత్తు ముసాయిదాను ముందుగా

పార్లమెంటువారు జూచి సవరించి ఉభయవర్గములును మంజూరు జేసినపిదపగాని యవి అమలులోనికి రాగూడదు. ప్రజాయత్త శాఖలకు సంబంధించిన నియమము లైనచో వానిని తయారు జేసి అమలు ప్రారంభించిన తర్వాత పార్లమెంటు యెదుట బెట్టవలెను. అట్లు బెట్టిన ముప్పది దినములలోగా పార్లమెంటువారు కోరే యెడల వానిని చక్రవర్తిగారు రద్దుచేయవచ్చును. లేక మార్చవచ్చును. కాని యీరద్దు మార్పులకు బూర్వము జరిగిన అమలున కేమియు భంగము గలుగరాదు.

—♦రెండవ భాగము.♦—

20. (1) ఇండియా దేశముయొక్క ఆదాయములనెల్ల చక్రవర్తిగారి పేరవసూలుచేసి యిండియా దేశపరిపాలనకై వెచ్చింపవలయును.

(2) ఇండియా దేశపు రాబడిలో నుండి ఖర్చు పడవలసిన బాపతులు:—

(ఎ) యీస్టిండియా కంపెనీవారి ఋణములన్నియు,

(బి) 1858 వ సంవత్సరమునకు బూర్వము కుంభిణీవారు సంధి పత్రములు, యొడంబడికలు, దఖలు పత్రములు, మున్నగువాని ప్రకారము చెల్లించుచుండిన మామూళ్ళన్నియు,

(సి) ఇండియా దేశ పరిపాలనకై న్యాయశాస్త్రానుసారము జేసిన యావత్తు ఋణములును, బాకీలును,

(డి) ఈచట్టము ననుసరించి చేయవలసిన ఖర్చులన్నియు,

(3) "ఇండియా దేశపురాబడి" యనగా ఇండియా గవర్నమెంటువారికె జెందదగిన అన్నివిధములయిన ఆదాయములు, వరుమానములు, అని యర్థము. అందు ప్రత్యేకముగా:—

(i) 1858 సం॥కుపూర్వముకుంభిణీవారికి జెందుచుండిన కప్పము లు మొదలయిన వరుమానములును,

(ii) న్యాయవిచారణలో దోషులకు శిక్షార్థము విధించే జరిమానాలు, నష్టములు, వారియొద్దనుండి దీసికొను స్థిరచరాస్తులును,

(iii) నిర్వంశత్వము చేతగాని దిక్కులేని కారణముచేగాని బేవారసుగానున్న ఆస్తియు,

(4) 1858 సం॥ పు ఆక్టువలనగాని, యీ ఆక్టువలనగాని చక్రవర్తిగారికి సంక్రమించదగిన అన్ని బాపతులఆస్తి అయివజులను ఇండియా దేశపు రాబడిలో జేర్పవలయును.

21. దేశాదాయమునుండి బ్రిటీషు యిండియాలోగాని వెలుపలగాని జేసెడి ఖర్చులన్నియు స్టేటు సెక్రటరీ కౌన్సిలువారి పెత్తనమునకు లోబడి యుండవలయును. 1858 సం॥ పు చట్టము ననుసరించి గాని, యీ చట్టము ననుసరించిగాని, ఇండియాగవర్నమెంటు జేయుఖర్చులకును, కలుపుకొను ఆస్తికిని స్టేటుసెక్రటరీ కౌన్సిలువారి యంగీకారము బొందవలయును.

22. చక్రవర్తిగారి యిండియా రాజ్యముమీదికి దండెత్తివచ్చిన శత్రువులను బారద్రోలుటకును, లేక ఆకస్మికమైన యితర యావశ్యక కార్యములకును తప్ప యింకెన్నడును ఇండియాదేశపు సరిహద్దుల కావలజరుగు సమరసన్నాహ వ్యయములను పార్లమెంటువారి యనుజ్ఞ లేకుండా యిండియా ధనములోనుండిఖర్చు పెట్టరాదు,

23. 24. 25. (ఈ సెక్షనులలో స్టేటు సెక్రటరీగారు ఇంగ్లండు బ్యాంకుద్వారా వ్యవహారము జేయవలసిన విధానము నిర్ణయింపబడినది.)

26. (1) ప్రతిసంవత్సరము మే నెల 1 వ తేదీ తరువాత 28 దినము

లలోగా స్టేటుసెక్రటరీ కౌన్సిలువారు పార్లమెంటువారి యెదుట నీక్రింది లెఖ్ఖలజాబితాలనునివేదించవలయును:—

(ఎ) ముందటేడు యిండియా పరిపాలనలో రాష్ట్రిముల వారిగావచ్చిన నానా విధములయిన ఆదాయములును, జేసిన వ్యయములును దెలుపు జాబితా.

(బి) ఇటువంటిదే క్రిందటి సంవత్సరము తాలూకు ఆఖరు అంచనా జాబితా.

(సి) జరిగేసంవత్సరము తాలూకు అంచనా వేయబడిన అన్ని బాపతుల జమా ఖర్చులను వివరముగా దెల్పు అంచణాజాబితా.

(డి) .............

(ఇ) స్టేటు సెక్రిటరీ కార్య స్థానపు సిబ్బంది జాబితాతో వారికి చెల్లించవలసిన జీతభత్యముల పట్టీ.

(2) సదరు కార్యస్థానములో సంవత్సరమునకు 50 పౌనులు, అంతకుమించిన, జీతముగల క్రొత్తయుద్యోగముగాని, పింఛనుగాని, జీతమువృద్ధిగాని, యేర్పాటు జేయవలసివచ్చేయెడల ఆసంగతిని వివరములతో దెలుపుపట్టీ

(3) నానా విషయములలో ఇండియా దేశాభివృద్ధిని దెలిసికొనుట కనువగునట్లు పై వివరములను రాష్ట్రిములవారిగా తయారు జేయవలయును.

27. (స్టేటు సెక్రిటరీ ఆఫీసులో నుండి యిండియా లెక్కలను తనిఖీ జేయు ఆడిటరును, అతనిపనిని గూర్చియు, నీసెక్షనులో వ్రాయబడెను.)

—♦ మూడవ వ భాగము. ♦—

(ఇందు 28 మొదలు ఏశీ ఆఖరువరకు గల సెక్షనులలో ఇండియా గవర్నమెంటు తరఫున స్టేటు సెకటరీగారు ఆస్తినికొనుట,

తాకట్టుబెట్టుట, అమ్ముట, ఖరారునామాలు (వ్రాయుట, మున్నగు వ్యవహార సంబంధమగు లావాదేవీలన్నియు జరుగవలసిన క్రమము వివరింపబడినది.)

—♦ నాల్గవ భాగము. ♦—

గవర్నరుజనరలుగారి కౌన్సిలు

33. ఈచట్టములోని నియమముల ననుసరించి, గవర్నరుజనరలు కౌన్సిలువారు స్టేటు సెక్రటరీగారి ఉత్తరవులకు లోబడి యుండి యీ దేశముయొక్క సివిలు మిలిటరీ పరిపాలనకు సంబంధించిన యావత్తు వ్యవహారములను తమ యాజమాన్యాధికారముల క్రింద నడిపించవలయును.

34. చక్రవర్తిగారి స్వదస్తూరీ దస్కతుగల హుకుంనామావలన ఇండియా గవర్నరు జనరలుగారు నియమింపబడుదురు.

35. (ఈసెక్షనిపుడు తీసివేయబడెను)

గవర్నరు జనరలు గారి కార్యనిర్వాహక వర్గము.

36. గవర్నరు జనరలు గారి కార్యనిర్వాహక సభ్యులు చక్రవర్తిగారి స్వదస్తూరీ దస్కతు హుకుంనామా వలన నేర్పాటు జేయబడుదురు.

(2) ఈసభ్యుల సంఖ్య కొకపరిమితిలేదు. చక్రవర్తిగారి కుచితమని తోచినంతమంది నేర్పాటు చేయువచ్చును.

(3) వీరిలో కనీసము ముగ్గురు ఇండియా దేశమున పదిసంవత్సరములకు తక్కువగాకుండ ప్రభుత్వసేవలో నున్నవారు గావలయును. ఒకడు పదేండ్ల యనుభవముగల ఇంగ్లాండులేక ఐర్లాండు దేశముల బారిష్టరుగాని, లేక స్కాట్లాండు దేశపు న్యాయశాస్త్ర వేత్తగాని లేక హైకోర్టు ప్లీడరుగాని అయి యుండవలయును.

(4) ఇండియా దేశపు సర్వసేనాధిపతి తప్పతక్కిన సైనికోద్యోగి

యెవరైనను కార్యనిర్వాహక సభ్యుడైనయెడల అతడు సభ్యుడుగానున్నంత కాలమతనికి సైనికి వ్యవహారములతో సంబంధముండరాదు.

(5) పైనియమములు చాలనిసందర్భములో కార్యనిర్వాహక సభ్యత్వపు యోగ్యతలను గూర్చి క్రొత్త నియమములను జేయవచ్చును.

37. ఇండియా దేశపు సర్వసేనాధిపతి కార్యనిర్వాహక సభ్యుడుగా నున్నయెడల అతడే గవర్నరు జనరలుగారి తర్వాత హోదాలోను, అధికారములోను, ద్వితీయుడుగా నుండవలయును.

38. గవర్నరు జనరలుగారు తనకార్యనిర్వాహక వర్గములో నొక సభ్యుని ఉపాధ్యక్షునిగా నియమించ వలయును.

39 (1) ఇండియా దేశములో గవర్నరు జనరలు కౌన్సిలువారు నిర్ణయించే ప్రదేశములందు కార్యనిర్వాహక వర్గసమావేశములు జరుగవలయును.

(2) ఈ సమావేశములలో అధ్యక్షుడును (సర్వసేనాధిపతిగా నటువంటి) మరియొక సభ్యుడును (వెరసియిద్దరు సభ్యులు) హాజరైనను వారుకార్యనిర్వాహక వర్గధర్మముల నెల్ల నెరవేర్చవచ్చును.

40. (1) కార్యనిర్వాహక వర్గమువారి యుత్తరువు లన్నిటిమీదను ఇండియా గర్నమెంటు సెక్రటరీగాని, కౌన్సిలు నిర్ణయము ప్రకారము మరియొకరుగాని సంతకములు జేయుదురు. వీనిపై కౌన్సిలు వారిసంతకములు లేవని న్యాయస్థానములలో తగాదాలు పెట్టరాదు.

(2) కార్యనిర్వాహక వర్గమువారి వ్యవహారము లెక్కువసులువుగా నిర్వర్తించుటకు దగిన నియమవిధానములను గవర్నరు జనరలు గారు నిర్ణయించ వచ్చును. అట్టివానినెల్ల గవర్నరు

జనరలు కౌన్సిలువారు జేసినట్లు యెంచవలయును.

41.(1) కార్యనిర్వాహకవర్గ సమావేశములలో భిన్నాభిప్రాయములు గలిగినపుడు బహుజనాభీష్టమునే ( మెజారిటీ ) యందరు నంగీకరించవలయును. ఇరుపక్షములు సమానమైనప్పుడు గవర్నరు జనరలుగాని, అధ్యక్షుడుగానున్న మరియొకరుగాని, యింకొక ' వోటు ' నధికముగా నిచ్చియేదో పక్షమున నిర్ధారణ జేయవలయును.

(2) కార్యనిర్వాహక వర్గమువారి విచారణలోనికి దీసికొనిరాబడిన ఏవిషయమైనను, గవర్నరు జనరల్‌గారి దృష్టిలో బ్రిటిషు ఇండియాయొక్క ( లేక యేభాగముయొక్క ) క్షేమశాంతి ప్రయోజనములకు ముఖ్యముగా సంబంధించినదని తోచినప్పుడు, కార్యనిర్వాహక వర్గములోనిబహుజనులాయనతో నేకీభవించనియెడల, గవర్నరు జనరలుగారొక్కడే తన స్వంతబాధ్యతతోను, అధికారముతోను, అట్టి విషయమును అమలు జరిపించుట, ఆపివేయుట, రద్దుచేయుట, మార్చుట, మున్నగు సర్వాధికారములను చలాయించవచ్చును.

(3) అట్టి ప్రతిసందర్భములోను భిన్నాభిప్రాయులైన బహుజనులలో నేయిద్దరు సభ్యులైనను తమ వ్యతిరేకాభిప్రాయమును స్టేటు సెక్రిటరీగారికి దెలుపగోరినచో దానికి సంబంధించిన గ్రంథసామగ్రియొక్క నకళ్ళతోసహా ఆయనకు బంపవచ్చును.

42. అనారోగ్యము చేతనో మరి యేకారణముచేతనో గవర్నరు జనరలుగారు హాజరుకానట్టి కౌన్సిలు సమావేశమునకు ఉపాధ్యక్షుడో లేక హాజరైనవారిలో మొదటినభ్యుడో ( సర్వసేనాధిపతిగాక ) సంపూర్ణాధికారముతో సభాపతిగా నుండవలెను.

అయితే గవర్నరు జనరల్‌గారు కౌన్సిలు సమావేశమునకు హాజరుగాకుండ ఆ ప్రదేశమున నివసించి యున్నప్పుడు కౌన్సిలు వారు చేసిన తీర్మానములమీద ఆయన సంతకము చేయవలెను. ఒకవేళ నస్వస్థతచే సంతకము చేయజాలనిచో నిబ్బందిలేదు. కాని అయిష్టముతో నిరాకరించినచో ఆయన హాజరైనప్పుడు బహు జనులతో నేకీభవించనియెడల తానేమి చేయునో, అట్లేయిప్పుడును చేయవచ్చును.

43. (1) ఇండియాదేశములోని యేభాగమునైన గవర్నరు జనరల్ గారొక్కడే సందర్శించుట యుచితమని కార్యనిర్వాహక వర్గమువారు నిర్ణయించినప్పుడు వారి యుత్తరువు ప్రకారము అచటకివెళ్ళి తనకుచితమని తోచినట్లు కార్యనిర్వాహక వర్గముతో గూడిన గవర్నరు జనరలుగారి సర్వాధికారములను ఆయన యొక్కడే చలాయించవచ్చును.

(2) ఈ ప్రకారము కార్యనిర్వాహక వర్గము దగ్గర లేనప్పుడు తనకావ్యశకమని తోచినయెడల రాష్ట్రప్రభుత్వములకు గానిలేక (వారికి ముందుగా తెలుపకయే) వారిక్రింద పని చేయు ప్రభుత్వోద్యోగులకు గాని యేయుత్తరువులనైన గవర్నరు జనరలుగారొక్కడే జారీ చేయించవచ్చును. అట్టి యుత్తరువులు గవర్నరు జనరలు కౌన్సిలువారు చేసినట్లే యెంచబడును. వాని నకలును వెంటనే కారణములతో రాష్ట్రప్రభుత్వములకును స్టేటు సెక్రటరీకిని బంపవలెను.

(3) స్టేటు కౌన్సిలు సెక్రెటరీవారు ఈపైన వివరించిన గవర్నరు జనరల్‌గారి యధికారములను తమ యిష్టము వచ్చినంత వరకు ఆపివేయవచ్చును,

43. ఎ.

(1) గవర్నరు జనరలుగారు ఎస్సెంబ్లీ సభ్యులలో నుండి తన

యిష్టము వచ్చినవారిని కార్యనిర్వాహక సభ్యులకును మంత్రులకును సహాయము జేయుటకై కార్యదర్శులుగ నేర్పాటుచేయవచ్చును. ఆయన యనుగ్రహమున్నంత కాలము వారాయుద్యోగములో నుందురు.

(2) అట్టి కౌన్సిలు కార్యదర్శుల జీతములను ఇండియా శాసనసభవారు నిర్ణయించవలెను

(3) యెసెంబ్లీ సభ్యత్వము ఆఖరై పోయిన ఆరుమాసముల వరకే కౌన్సిలు కార్యదర్శి తన యుద్యోగములో నుండును.

యుద్ధము — సంధి.

44. (1) స్టేటుసెక్రటరీ కౌన్సిలువారి యుత్తరువు లేకుండా బ్రిటిషు గవర్నమెంటు తరఫున గాని వారి సంరక్షణలోనున్న యేసామంతరాష్ట్రాధిపతి తరఫునగాని యిండియాలోనెవరితోను యుద్ధములు ప్రకటించుటకుగాని సంధి చేసికొనుటకు గాని యిండియాగవర్నమెంటువారికి వీలులేదు. అయితే బ్రిటీషు ప్రభుత్వముమీదికి గాని వారియాధీనములోని సామంత ప్రభువుల మీదికిగాని యెవరైనా దండెత్తి వచ్చినను, సమరసన్నాహము జేసినను నీపైనీయమమునకు విరుద్ధముగాగవర్నరు జనరల్ కౌన్సిలువారు అట్టివారితో ఎదురుయుద్ధ సన్నాహములను జేయవచ్చును.

(2) (ఈసెక్షనులో యీ దేశములోని సామంత ప్రభువులతో జరిపెడి సంధియుద్ధములను గూర్చి వ్రాయబడినది.)

(3) అట్టి యుద్ధమునుగాని సంధిని గాని ఇండియా గవర్నమెంటువారు ప్రారంభించగానే ఆవివరములను కారణములను స్టేటు సెక్రెటరిగారికి దెలుపవలెను.

—♦ ఐదవ భాగము ♦—

## రాష్ట్రీయ ప్రభుత్వములు.

45. (1) ఈ చట్టము ననుసరించి రాష్ట్ర ప్రభుత్వములన్నియు ఇండియా ప్రభుత్వమువారి యాజ్ఞలకు లోబడి యెప్పటి కప్పుడు తమ కార్యవిధానముల నెల్ల వారికి నివేదించుకొనుచు వారి యాజమాన్యాధి కారముల క్రింద తమతమ రాష్ట్రములను బాలించు కొనుచుండ వలెను.

(3) ఏరాష్ట్రములో నైనను గవర్నరు జనరలుగారున్నందు వలన ఆరాష్ట్రప్రభుత్వాధి కారమున కేమియు భంగము గలుగనేరదు.

45. (ఎ) ఈ సెక్షనులో ఇండియా ప్రభుత్వమువారి యాధీనములో నుండవలసిన పరిపాలనా శాఖలయొక్కయు రాష్ట్రీయ పరిపాలనా శాఖయొక్కయు, విభాగములకు సంబంధించిన కొన్ని యేర్పాటులు మున్నగు నవిగలవు.

46. (ఈసెక్షనులో గవర్నరు యుద్యోగమును గూర్చి నిర్ణయములుగలవు.)

47. (1) గవర్నరుగారి కార్యనిర్వాహక సభ్యులను చక్రవర్తిగారు నియమింతురు. సభ్యులసంఖ్య నలుగురికి మించకుండా స్టేటు కౌన్సిలువారు నిర్ణయించవలెను.

(2) వారిలో నొక్కరైనను ఉద్యోగసమయమునకు పూర్వము కనీసము పండెండు సంవత్సరములు ఇండియాలో ప్రభుత్వ సేవజేసిన వాడుగా నుండవలెను.

(3) ..........................................................

48. ప్రతి గవర్నరు తన కార్యనిర్వాహక సభ్యులలో నొకరి నుపాధ్యక్షునిగా నియమించుకొనవలెను.

49. (కార్యనిర్వాహక వర్గముతోను మంత్రివర్గముతోను గూడి

గవర్నరుగారు నిర్వర్తించే వ్యవహారమునుగూర్చి యీ సెక్షను లోనున్నది.)

50. (1) కార్యనిర్వాహక వర్గమువారి విచారణలోనికి వచ్చిన యే విషయమును గూర్చియైనను భేదాభిప్రాయములు గలిగినప్పుడు బహుజనాభిప్రాయమే (మెజారిటీ) యంగీకృతము కావలయును. ఉభయపక్షములును సమానముగా నున్నప్పుడు గవర్నరుగాని అధ్యక్షుడుగాని యింకొక 'వోటు' నధికముగా నిచ్చి యేదో పక్షమును నిర్ధారణ జేయవలయును.

2 కార్యనిర్వాహక వర్గమువారి విచారణలోనికి వచ్చిన యేవిషయమైనను గవర్నరుగారి దృష్టిలో తనరాష్ట్రముయొక్క క్షేమశాంత ప్రయోజనములకు ముఖ్యముగా సంబంధించినదని తోచినప్పుడు, తన కార్యనిర్వాహక వర్గములోని బహుజనులు తనతో నేకీభవించనియెడల, వారి యంగీకారముతో నిమిత్తములేకుండ గవర్నరుగారు తన స్వంత బాధ్యతమీద నావిషయమును పూర్తిగానో, కొంతభాగమో అమలులో బెట్టుట, త్రోసివేయుట, ఆపివేయుట మున్నగు సర్వాధికారములను చెలాయించవచ్చును. ఈప్రకారమాయన వ్రాతమూలముగా నాజ్ఞాపించవలెను.

3. అట్టి ప్రతి సందర్భములోను గవర్నరును తక్కిన హాజరైన సభ్యులును తమ యభిప్రాయములను పరస్పరము వ్రాతమూలముగా దెలుపుకొనవలెను. ఈయుత్తర ప్రత్యుత్తరములెల్ల రహస్యముగా వారి సభావృత్తాంత గ్రంథములో వ్రాయబడును. గవర్నరుగారి యుత్తరువుమీద నాయనతోపాటు తక్కిన సభ్యులుకూడ సంతకము చేయవలెను.

4. ............

51. అస్వస్థతచేతనో మరి యేకారణముచేతనో గవర్నరు, కార్యనిర్వాహక సమావేశములకు హాజరుకానియెడల, ఉపాధ్యక్షుడు

గాని, లేనిచో హాజరైన వారిలో మొదటి సభ్యుడుగాని, సంపూర్ణాధికారములతో సభాపతిగా నుండవలెను.

(42 వ సెక్షను ప్రకారము గవర్నరు జనరలుగారు హాజరు లేని సమావేశములలో ఆయన యెట్లు ప్రవర్తించునో యట్లే గవర్నరుకూడ ప్రవర్తించును.)

52. మంత్రుల నియామకము:— గవర్నరుగారు, కార్యనిర్వాహక సభ్యులును, యితర యుద్యోగులును, కానటువంటి వారిని, ప్రజాయత్తశాఖలను బరిపాలించుటకై మంత్రులుగా నియోజింపవచ్చును. అట్టి మంత్రు లాయనచిత్తము వచ్చినంతవర కాపదవిలో నుందురు. మంత్రుల జీతము కార్యనిర్వాహక సభ్యుల జీతముతో సమానముగా నుండవచ్చును. (లేదావీరికి శాసన సభవారు తక్కువజీతము నిచ్చుటకుగూడ తీర్మానించవచ్చును.)

(2) (ప్రజలచే నెన్నుకొనబడిన) ఎన్నిక శాసన సభ్యుడు కాని వాడు ఆరుమాసముల కంటె నెక్కువగా మంత్రిపదవిలో నుండకూడదు.

(3) ప్రజాయత్త శాఖల పరిపాలన విషయములో గవర్నరు మంత్రుల సలహాననుసరించ వలెను. తగిన కారణ మున్నపుడు తాను వారితో నేకీభవించక వారిసలహాకు వ్యతిరేకముగా ప్రవర్తించవచ్చును.

ఆవశ్యక సందర్భములలో ప్రజాయత్తశాఖను పరిపాలించు మంత్రియొక్క స్థానము కాళీగానున్నపుడు అట్టి శాఖను తాత్కాలికముగా పరిపాలించుటకు తగిన నియమములను విడిగా నేర్పాటు చేయవలెను.

(4) ఉద్యోగులుకానట్టి శాసన సభ్యులలోనుండి కార్యనిర్వాహక సభ్యులకును, మంత్రులకును సహాయముచేయుటకై, గవర్నరు తన యిష్టమువచ్చిన వారిని కౌన్సిల్ సెక్రిటరీలుగా నియమించవచ్చును. శాసనసభా తీర్మానము ప్రకారము

వారి జీతములు నిర్ణయించబడును. శాసన సభ్యత్వము ఆఖరైన ఆరు మాసములవరకు మాత్రమే కౌన్సిల్ సెక్రెటరీ తన యుద్యోగములో నుండును.

52. (ఏ) (ఇండియా గవర్నమెంటువారు నూతనరాష్ట్రములను నిర్మించుట, ప్రాతరాష్ట్రములను మార్చుట మొదలగు విషయములనుగూర్చి యీ సెక్షనులో వ్రాయబడెను.)

(బి) (ఇండియా ప్రభుత్వమువారుగాని, రాష్ట్ర ప్రభుత్వములుగాని గావించిన చర్యలను, ఉత్తరువులనుగూర్చి న్యాయస్థానములలో తగాదాలు పరచకూడదను విషయ మీ సెక్షనులో వ్రాయబడెను.)

(53. మొదలు 62. ఆఖరువరకు గల సెక్షనులలో లెఫ్టినెంటు గవర్నరు పదవులు, వారియాధీనములో నుండు చిన్నరాష్ట్రములు, వానిపరిపాలనాక్రమము, రాష్ట్రముల సరిహద్దులు మొదలగు వానినిగూర్చి వివరింపబడినవి.)

—♦ 6 వ భా గ ము ♦—

ఇం డి యా శా స న ని ర్మా ణ ము.

63. ఈశాసనముయొక్క నిబంధనల ప్రకారము 1 గవర్నరు జనరల్ గారును, 2 స్టేటు కౌన్సిలును, 3 లెజిస్లేటివ్ ఎసెంబ్లీయు, గలిసి ఇండియా శాసనసభ యనబడును.

ఏచట్టమునైనను సవరణలతోగాని లేకుండగాని యీ రెండు సభలును అంగీకరించిననేగాని యది శాసన మనిపించుకొనుటకు వీలులేదు.

63.(ఏ) స్టేటు కౌన్సిలు.

(1) ఈ స్టేటు కౌన్సిలులో ఎన్నిక సభ్యులుగాని నియోజిత సభ్యులుగాని మొత్తము అరువదిమంది కంటె నెక్కువగా నుండరాదు. వారిలో ఇరువదిమంది కంటె నెక్కువగా ఉద్యోగ సభ్యు లుండరాదు.

(2) స్టేటు కౌన్సిలు సభ్యులలో నుండి యొకరిని సభాధ్యక్షుడుగాను, మరికొందరిని తాను జెప్పెడి సందర్భములలో నధ్యక్షత వహించునట్లును, నియమించుకొనే యధికారము గవర్నరు జనరల్ చేతిలో నున్నది.

(3) ఈస్టేటు కౌన్సిలు సభ్యులను సమావేశపరచి వారితో గవర్నరు జనరలుగారు ప్రసంగించవచ్చును.

63.(బి) లెజిస్లేటివ్ ఎసెంబ్లీ

(1) ఈయెసెంబ్లీలోని యెన్నిక సభ్యులుగాని నియోజిత సభ్యులుగాని యీ శాసనముప్రకారము జేసిన నియమముల ననుసరించి యేర్పడినవారై యుండవలయును.

(2) ఇందు మొత్తము నూట నలుబదిమంది సభ్యులుండవలయును. యెన్నికసభ్యులు కానివారు నలుబదిమంది ఉండవలయును. వీరిలో 26 మంది ఉద్యోగసభ్యులు. ఎన్నిక సభ్యులు నూరుమంది.

(కాని యవకాశమున్న యెడల యెసెంబ్లీ సభ్యులసంఖ్యను వృద్ధిజేయవచ్చును.) మొత్తమున 5/7 యేడింట 5 వంతులమంది యెన్నిక సభ్యులుగాను, మిగిలినవారిలో కనీసము మూడవవంతు అనుద్యోగసభ్యులుగ నుండవలయును.

(3) ఎసెంబ్లీ సభ్యులను సమావేశపరచి వారితో గవర్నరు జనరలుగారు ప్రసంగించవచ్చును.

63.సి. —♦ యెసెంబ్లీకి అధ్యక్షుడు. ♦—

(1) యెసెంబ్లీకి మొదటి యధ్యక్షుని గవర్నరు జనరలుగారే నియోజించవలయును. ప్రథమ సమావేశ దినము మొదలు నాలుగేండ్లవరకు అతడే అధ్యక్షుడుగా నుండును. తరువాత యెసెంబ్లీ సభ్యులందరును గలిసి తమలో నొకరి నధ్యక్షుడుగా నెన్నుకొందురు. ఈయెన్నికను గవర్నరు జనరల్ గా

రామోదించవలయును. మొదటి యధ్యక్షునిగడువు నాలు గేండ్లు పూర్తియగుసరికి యెస్సెంబ్లీ సమావేశము జరుగు చున్న యెడల ఆసమావేశము సాంతమయ్యేవరకు అతడే యధ్యక్షత వహించును. తరువాత సమావేశములో క్రొత్త యధ్యక్షుని యెన్నిక జరుగును.

(2) అధ్యక్షుడు హాజరుకానప్పుడు సభాపతిత్వము వహించుటకై యెస్సెంబ్లీ సభ్యులు తమలో నొకరిని డిప్యూటి ప్రసి డెంటుగా నెన్నుకొందురు. ఈయెన్నికను గవర్నరు జన రలుగా రామోదించవలయును.

(3) గవర్నరు జనరలుగారు నియమించిన మొదటి యధ్యక్షుడే మరల ప్రసిడెంటు యెన్నిక జరిగేవరకు అధ్యక్షుడుగా నుం డును. ఈలోగా అయన స్వదస్తూరితో గవర్నరు జనరలు గారి పేర రాజీనామా వ్రాసి యివ్వవచ్చును. లేదా గవ ర్నరు జనరల్ గారే ఆయనను తీసివేయవచ్చును. కొరవడిన కాలమునకు మామూలుగానే మరియొక యధ్యక్షుని గవ ర్నరు జనరల్ గారు నియమింతురు.

(4) ఎన్నిక ప్రసిడెంటు (అధ్యక్షుడు) గాని, డిప్యూటి ప్రసిడెంటు గాని తాము యెస్సెంబ్లీలో సభ్యులుగా నున్నంతవరకే అ ధ్యక్షులుగా నుందురు. వారు గవర్నరు జనరలుగారి పేర తమ యుద్యోగమునకు రాజీనామా వ్రాసియివ్వవచ్చును. లేదా యెస్సెంబ్లీవారి తీర్మానము ప్రకారము గవర్నరు జన రల్ గారి అంగీకారముతో వీరినీ యుద్యోగమునుండి తొల గించవచ్చును.

(5) వీరిలో ఎన్నిక జరిగినవారికి శాసనసభ వారి తీర్మానముప్ర కారమును, నియోజితులకు గవర్నరు జనరల్ గారి యిష్టప్ర కారమును జీతములు నిర్ణయించబడును.

—◆ సమావేశములు కాలపరిమితి. ◆—

63.(డి) (1) సాధారణముగా మొదటి సమావేశము మొదలుకొని స్టేటు కౌన్సిలు అయిదు సంవత్సరములు వరకును యెస్సెంబ్లీ మూడేండ్లవరకు నుండును.

(ఎ) అయితే యీరెండు సంఘములను వాని పరిమితి కాలములోగానే గవర్నరు జనరలుగారు రద్దుచేయవచ్చును.

(బి) తనకవసరమని తోచినయెడల గవర్నరు జనరలుగారు వాని కాలపరిమితిని వృద్ధి జేయవచ్చును.

(సి) ఈరెండు సంఘములలో దేనినైనను గవర్నరుజనరల్ రద్దుచేసినచో ఆతేదీమొదలు ఆరు మాసముల లోగాను స్టేటుసెక్రటరీ యనుమతితో తొమ్మిది మాసములలోగాను, తరువాతసమావేశము జరుగునట్లు ఆయన యేర్పాటు జేయవలయును.

(2) గవర్నరు జనరల్ తన యిష్టప్రకారము శాసనసభా సమావేశములయొక్క స్థలకాలములను, నిర్ధారణజేయు వచ్చును. అప్పటికప్పుడు ప్రకటన ద్వారాగాని మరియొక విధముగా గాని, ఆయన యీ సమావేశముల నాపి వేయవచ్చును.

(3) శాసనసభా సమావేశమేదైనను జరుగు చున్నప్పుడు దాని కధ్యక్షుడుగా నున్నవారా సమావేశము నాపి వాయిదా వేయవచ్చును.

(4) ఈ శాసన సభల విచారణలోనికి వచ్చే అన్ని విషయములును సభాధ్యక్షుడుగాక తక్కిన సభ్యులయొక్క బహుజనాభిప్రాయము (ఎక్కువ వోట్లు) ననుసరించి తీర్మానము గావలెను. రెండు పక్షములును సమానమైనపుడు మాత్రము అధ్యక్షుడు తన నిర్ధారణాభిప్రాయము (కాస్టింగువోటు) నిచ్చి యేదో పక్షమును తీర్మానించును.

(5) ఇండియా శాసనసభల (రెంటిలోను) లో కాళీలున్నప్పటికిని సభాకార్యములు మామూలుగా జరిగి పోవచ్చును.

—♦ రెండు శాసన సభలలో సభ్యత్వము. ♦—

63 ఇ. (1) అసెంబ్లీలోగాని, స్టేటు కౌన్సిలులోగాని, ప్రభుత్వోద్యోగిఎవరును ఎన్నిక సభ్యుడుగానుండ నర్హుడుగాడు. అట్టియెన్నిక సభ్యత్వము లభించిన తరువాత నెవరైనను ప్రభుత్వోద్యోగము నంగీకరించిన యెడల ఆతని శాసనసభ్యత్వస్థానము కాళీయగును.

(2.3.) అసెంబ్లీలోను, స్టేటు కౌన్సిలులోను, ఒక్క మనిషియే సభ్యుడుగా నెన్నుకొనబడే యెడల ఈరెంటిలోను ఆతని యిష్టమువచ్చిన ఒక్కసభలోనే సభ్యుడుగానుండి రెండవ దానిలో తన సభ్యత్వమును మానుకొనవలయును. ఈపని వ్రాతమూలముగా జేయువలయును. అప్పుడా రెండవ సభ్యత్వము కాళీయగును.

(4) గవర్నరు జనరలుగారి ప్రతికార్యనిర్వాహక సభ్యుడును, ఈరెండు శాసన సభలలో నేదోయొక దానిలో మాత్రము నియోజిత సభ్యుడుగా నుండవలయును. కాని రెండు సమావేశములకును హాజరై మాట్లాడవచ్చును. ఒక్క సభలో మాత్రమే సభ్యుడుగానుండి వోటివ్వవలెను.

64. (1) ( ఇందు అసెంబ్లీ స్టేటు కౌన్సిలు సభ్యులయొక్క యెన్నికలు మొదలగు వానింగూర్చి యున్నది. )

(2) ఇండియాలోని స్వదేశసంస్థానపు ప్రజలలోనుండిగాని ప్రభువులలోనుండిగాని యేమనిషినైనను అసెంబ్లికో స్టేటు కౌన్సిలుకో నియోజిత సభ్యునిగా గవర్నమెంటువారు జేయవచ్చును.

65. (1) ఇండియా శాసన సభలకీక్రింది వానికి సంబంధించిన శాసనములను జేయుట కధికారము గలదు.

(ఎ) బ్రిటిషు యిండియాలోని అందరు ప్రజలకును, అన్ని న్యాయస్థానములకును, అన్ని ప్రదేశములకును, అన్ని

విషయములకును.

(బి) ఇండియాలోని ఇతర ప్రదేశములందున్న చక్రవర్తి గారి ప్రజలు, ప్రభుత్వసేవకులు అందరికిని.

(సి) బ్రిటిషు యిండియాలోను, వెలుపలనుగల చక్రవర్తి గారి యిండియా దేశీయ ప్రజలందరికిని.

(డి) ప్రభుత్వోద్యోగులు, యోధులు, వైమానికులు, మొదలగు వారికి.

(యి) రాయల్ యిండియన్ నావికా యుద్యోగములలో నున్నవారికి

(ఎఫ్) అదివర కములులోనున్న యేచట్టములైనను మార్చుటకుగాని రద్దుచేయుటకుగాని.

(2) అయితే.

(i) 1860 వ సంవత్సరమునకు దరిమిలాను బ్రిటిషు యిండియాకుగూడ వర్తించునట్లు పార్లమెంటువారు నిర్మించెడి యేచట్టమునైనను, (సైన్యచట్టము, వైమానిక చట్టములతో సహా)

(ii) యిండియా ప్రభుత్వముకొరకు యింగ్లాడులో ధనమును సమకూర్చుటకై స్టేటు సెక్రటరీ కధికార మొసంగుచు పార్లమెంటునిర్మించు మరియేచట్టమైనను.

మార్చుటకుగాని, రద్దు చేయుటకుగాని పార్లమెంటు వారి యనుమతిలేకుండా యిండియా శాసనసభల కధికారములేదు.

మరియు పార్లమెంటువారి యధికారములకును, యింగ్లండు, స్కాట్లాండు, ఐర్లాండు దేశములలోని సాంప్రదాయ శాసనములకును, బ్రిటిషు యిండియాలోని చక్రవర్తిగారి సార్వభౌమత్వమునకును, భంగకరమైన యేశాసనమును ఇండియా శాసన సభలు నిర్మించరాదు.

(3) ఐరోపాఖండములో జన్మించిన చక్రవర్తిగారి ప్రజలకుగాని వారి సంతానమునకుగాని మరణదండన విధించే యధికారము హైకోర్టునకు మాత్రమే గలదు. అంతకంటె క్రిందికోర్టులకీ యధికారము నొసంగుటకుగాని, లేక అసలే హైకోర్టులను తీసివేయుటకుగాని స్టేటుసెక్రిటరీ కౌన్సిలువారి యనుమతిలేకుండ యిండియా శాసనసభల కధికారము లేదు.

66—(ఇందు రాయల్ యిండియన్ మెరైను సర్వీసునుగూర్చిన నియమములున్నవి.)

67(1) (శాసనసభా సమావేశములు జరుగవలసిన క్రమము, సభాధ్యక్షత, కోరం, మున్నగు వానింగూర్చి ప్రత్యేకనియమములు జేయవలెనని యిందున్నది.)

(2) ముందుగా గవర్నరు జనరలుగారి యనుమతి బొందకయే ఇండియా శాసనసభలు రెండును ఈ క్రింద వివరించిన విషయములను దమ విచారణలోనికే దీసికొని రాకూడదు.

(ఎ) ఇండియా దేశపు ఋణము, ఆదాయము, దేశాదాయములో జేయవలసినఖర్చు, వీనికి సంబంధించినవి.

(బి) ఇండియాలోని చక్రవర్తిగారి ప్రజలలోనే తెగవారి యొక్క మతమునకైనను మతాచారములకైనను సంబంధించినది.

(సి) చక్రవర్తిగారి సైనిక, నావికా, వైమానిక దళముల పోషణశిక్షణములను గూర్చి.

(డి) ప్రభుత్వమువారికి అన్య సంస్థానములతోను, సంస్థానాధిపతులతోను గల సంబంధములనుగూర్చి గాని

(లేక యాక్రిందివానింగూర్చిన చట్టములనుగాని ప్రవేశపెట్టరాదు)

(1) రాష్ట్రీయ ప్రభుత్వమువారి యధికారమునకు సంబంధించిన పరిపాలనావిషయములు.

(ii) రాష్ట్రీయ శాసన సభలంగీకరించిన శాసనములను సవరించుట, రద్దుజేయుట.

(iii) గవర్నరు జనరలుగారు జేసిన చట్టములను, ఉత్తరువులను సవరించుట, రద్దుజేయుట.

(2ఎ) అసెంబ్లీలోగాని స్టేటు కౌన్సిలులోగాని యేదైనా యొక చట్టమునో, సవరణనో, తీర్మానమునో, ప్రవేశ పెట్టినప్పుడుగాని లేక ప్రవేశ పెట్టదలంచినప్పుడుగాని అందేదైనను గవర్నరు జనరల్‌గారి యభిప్రాయములో బ్రిటీషు యిండియా యొక్కగాని, అందలి యేభాగము యొక్కగాని శాంతి క్షేమములకు భంగకరమని తోచిన యెడల అట్టివాసింగూర్చి విచారణ విమర్శనలేమియు జరుగకుండగనే ఆయన యాపివేయవచ్చును. ఈ సంగతిని ఆయన వ్రాతమూలముగా ధృవపరచవలయును.

(3) ఈ రెండు శాసన సభలలో నొక సభావారొక చట్టమును తీర్మానించిన ఆరుమాసములలోగా రెండవ సభవారు కూడ దానినే (ఉభయులకు నంగీకారముగానుండు సవరణలతోగాని) లేకుండాగాని అంగీకరించని యెడల, గవర్నరు జనరల్ గారి కుచితమని తోచినచో ఆయన యుభయ సంఘములను గలిపి సమావేశపరచి భేదాభిప్రాయములను విమర్శించుకొని తీర్మానించుట కవకాశమును గల్పించవచ్చును.

(4) ఉభయ శాసన సభలును తీర్మానించిన చట్టమును గవర్నరు జనరలుగారు పునర్విచారణకై వారికే తిరిగి పంపివేయవచ్చును.

(5;6) ...........

(7) ఏ శాసన సభ్యుడైనను సభా సమావేశములలో జెప్పిన

యుపన్యాసమునకుగాని, ప్రకటించిన యభిప్రాయమునకు (వోటు) గాని, అతనిపై న్యాయస్థానములలో నెట్టి చర్యలును దీసికొనరాదు. రెండు శాసన సభలలోను వాక్స్వతంత్ర్యము గలదు.

—♦ దేశాదాయవ్యయపట్టిక లేక బడ్జెట్టు. ♦—

67ఎ (1) ప్రతిసంవత్సరము దేశముయొక్క ఆయవ్యయముల అంచనాపట్టిక నీరెండు సంఘముల యెదుటను బెట్టవలయును.

(2) గవర్నరు జనరల్‌గారి శిఫారసు లేని యేవిషయములకును దేశాదాయములను వినియోగించుటకు ఆలోచించరాదు.

(3) గవర్నరు జనరల్ కౌన్సిలువారు సూచించెడి యీక్రింది ఖర్చు పద్దులతో రెండు శాసన సంఘములకు నేమియు సంబంధములేదు. గవర్న జనరలుగారి యిష్టములేనిచో వానినిగూర్చి ప్రతియేటను జరుగు బడ్జెటు చర్చలో ఏశాననసభవారును విచారించుట కేయధికారము లేదు:—

(i) ఋణముల మీద వడ్డీ, వాయిదాబందీ ఋణములు.

(ii) ఏదైనా చట్టము ప్రకారముగా నిర్ధారణ జేయబడిన ఖర్చులు.

(iii) చక్రవర్తి, స్టేటు సెక్రిటరీగార్ల చేతగాని లేక వారి యనుమతితోగాని, యేర్పాటు చేయబడిన ఉద్యోగుల జీతములు, పింఛనులు.

(iv) చీఫ్ కమీషనర్ల జీతములు; జ్యుడిషల్ కమీషనర్ల జీతములు.

(v) గవర్నరు జనరలుగారు (a) క్రైస్తవ మతమునకు
(b) రాజకీయ విషయములకు (c) దేశరక్షణకు
అనిపేర్లు బెట్టి నిర్ణయించిన పద్దులును

(4) ఏపద్దయినను పైనవివరించినవానిలో జేరునాలేదాయనిప్రశ్న గలిగి నప్పుడు, ఆవిషయమై గవర్నరు జనరల్‌గారి నిర్ణయమే ఆఖరు తీర్పు.

(5) ఈపైన నుదాహరించిన బాపతులలో జేరని ఖర్చులను యెస్సెంబ్లీ వారియెదుటబెట్టి వారి యంగీకారమును బొంద వలయును.

(6) యెస్సెంబ్లీ వారిందులో నేపద్దునైనను తీసి వేయ వచ్చును, మార్చవచ్చును, తగ్గించవచ్చును, అంగీకరించ వచ్చును.

(7) ఇట్లు యెస్సంబ్లీలో నంగీకరించ బడిన మొత్తములను కార్య నిర్వాహక సంఘము వారాలోచించి, యెస్సంబ్లీలో నిరాకరించ బడిన లేక తగ్గించబడిన యేపద్దులైనను, తమ పరిపాలనా ధర్మ నిర్వాహణమున కావశ్యక మని, గవర్నరు జనరలుగారు నమ్మి ప్రకటించినచో, అట్టివానినెల్ల యెస్సంబ్లీ అంగీ కరించినట్లే భావించవలయును.

(8) ఇవి యన్నియుగాక అత్యంతావశ్యక సందర్భము లందు బ్రిటిషు ఇండియాయొక్క శాంతి భద్రతలకు నావశ్యకమని గవర్నరుజనరల్‌గారు నమ్మినచో ఏఖర్చుపద్దునైన ఆయన మంజూరు జేయుట కధికారము గలదు.

—♦ శాసన మోడిపోయినప్పుడు గతి. ♦—

67. బి (1) ఈ రెండుశాసనసభలును, గవర్నరు జనరలుగారు కోరిన ప్రకారము ఏచట్టమునైనను తీర్మానించకపోయినను, అసలు విచారణకే యంగీకరించకపోయినను, గవర్నరు జనరల్‌గారు దానిని బ్రిటిషు ఇండియా యొక్క శాంతి

క్షేమ ప్రయోజనముల కావశ్యకమైనదని, ధృవపరచి (సర్టిఫై చేసి) మంజూరుచేయవచ్చును.

(ఎ) ఒకసభవా రంగీకరించిన చట్టమును రెండవసభవా రంగీకరించకపోయినప్పటికిని గవర్నరు జనరలుగారి దస్కతుకాగానే అది మామూలుగా శాసనమైపోవును.

(బి) ఒకసభవారు తోసివేసిన చట్టమును రెండవసభ వారియెదుటబెట్టి వారి యంగీకారమును బొందిన తరువాత గవర్నరు జనరలుగారి దస్కతుతో నది శాసనమగును. రెండు సభలును నిరాకరించిన చట్టము, ఒక్కగవర్నరు జనరలుగారి దస్కతుతోనే శాసనమైపోవును.

(2) ఇట్లు గవర్నరు జనరలుగారు నిర్మించిన ప్రతిశాసనమును గూర్చియు ముందు ప్రకటింపవలెను. తరువాత దానిని సాధ్యమైనంత త్వరలో పార్లమెంటువారి యెదుటవారి సమావేశకాలమునకు కనీసము ఎనిమిది దినములు ముందుగాబెట్టి, చక్రవర్తిగారి యంగీకారమును బడయవలయును. అంతవరకు నీశాసనములు లోనికిరాదు. చక్రవర్తిగారి యంగీకారముకాగానే యిది తక్కిన వానితోపాటు మామూలుగా శాసనమనిపించుకొనును. అయితే చక్రవర్తిగారి యంగీకారము బొందకుండానే అత్యంతావశ్యక సందర్భములలో వెంటనే గవర్నరు జనరలు తానే దానినమలులోబెట్టించవచ్చును. అప్పుడైనను దానిని నిరాకరించు అధికారము చక్రవర్తిగారి చేతిలోగలదు.

వ రా:— ఈ సెక్షనులోని "బ్రిటిషు ఇండియాయొక్క

శాంతిక్షేమ ప్రయోజనము" లను చోట 'ప్రయోజన' ము (interest) ను మాటను దీసివేయవలెనను సవరణ (ఈ యసాధారణాధికారమును గవర్నరు జనరలుగారు దుర్వినియోగము జేయుట తటస్థించుచుండుటచే) ఈ జూలై నెలలో మొన్నజరిగిన యెసెంబ్లీ సమావేశములోనే యంగీకరింపబడినది.

శాసనసభ లంగీకరించిన చట్టములకు గవర్నరు జనరలుగారి

—♦ యంగీకారము ♦—

68 (1) ఉభయ శాసనసభలును దీర్మానించిన చట్టమును గవర్నరు జనరల్‌గారు గూడ అంగీకరించవచ్చును. లేదా నిరాకరించవచ్చును లేదాచక్రివర్తిగారియామోదమునకై ఆపియుంచవచ్చును.

(2) ఉభయ శాసన సభలును దీర్మానించి నంతమాత్రమున ఏ బిల్లును (చిత్తుచట్టము) గవర్నరుజనరల్‌గారి యంగీకారమును బొందకయే శాసనము గానేరదు. లేదా మంత్రివర్గముతో గూడిన చక్రివర్తిగారి యామోదమునైన వడసినట్లు గవర్నరు జనరలుగారిచే ప్రకటింపబడనిదే శాసనముగానేరదు.

—♦ చక్రివర్తి శాసనములను రద్దుచేయుట. ♦—

69. (1) ఇండియా శాసన సభలచే దీర్మానింపబడి, గవర్నరు జనరలుగారి యంగీకారమును వడసిన, శాసనముయొక్క సరియైన నకలును స్టేటు సెక్రిటరీగారికి బంపవలయును. మంత్రివర్గముతో గూడిన చక్రవర్తిగారు దానిని జూచి రద్దుచేయుటకధికారము గలదు.

(2) ఈప్రకారము రద్దుచేయబడిన సంగతి గవర్నరు జనరల్‌గారు వెంటనే ప్రకటించవలయును. అప్పటినుండి యది యమలు జరుగనేరదు.

70 (తీసివేయబడెను.)

(అసాధారణమైన) ఉత్తరువులు,

—♦ నియమములు. ♦—

71. (1) బ్రిటీషు యిండియాలోని యేరాష్ట్రీయ ప్రభుత్వమైననుతమ రాష్ట్రములో శాంతమును సత్పరిపాలనమును, నెలకొల్పుటకై కొన్ని యసాధారణమైన యుత్తరువులను జారీచేయించుడని యిండియా గవర్నమెంటు వారిని గోరవచ్చును.

(2) అందుపైన విచారించి అట్టి యుత్తరువులను గవర్నరుజనరల్ గారును ఆయన కౌన్సిలువారును అంగీకరించినపుడు ఇండియా గెజట్టులోను, స్థానిక గెజిట్టులోను, ప్రకటించగానే యవి మామూలు శాసనము లయిపోవును. వీనినిగూడ చక్రవర్తిగారు మామూలు ప్రకారము రద్దు చేయవచ్చును

(3) ఇట్టి యుత్తరువులకు సరియైన నకళ్లను స్టేటు సెక్రిటరీకి బంపవలయును.

(3ఎ) .........

(4) స్టేటుసెక్రటరీగారు తమ కౌన్సిలు తీర్మానము ప్రకారము బ్రిటిషు యిండియాలో నేభాగమునకైనను ఈసెక్షనువర్తించునట్లు జేయవచ్చును. దీనియమలు నాపి వేయవచ్చును.

72. అత్యంతావశ్యక సందర్భములలో బ్రిటిషు యిండియాలోగాని అందలి యేభాగములోనైనగాని, శాంతమును సత్పరిపాలనమును నెలకొల్పుటకై, ఆరుమాసములకు మించకుండ అమలుజరిగేటట్లు గవర్నరు జనరల్ గారొక్కడే అసాధారణ నియమములను జారీచేయవచ్చును. ఇవిమామూలు శాసనములవలెనే అమలు జరుగును. వీనినిగూడ చక్రివర్తిగారు రద్దుజేయువచ్చును.

—♦ రాష్ట్రీయ శాసన నిర్మాణము ♦—

(గవర్నరు అధిపతిగానున్న రాష్ట్రముల సంగతి.)

72. ఎ. (1) ప్రతి గవర్నరుయొక్క రాష్ట్రములోను, కార్యనిర్వాహక సభ్యులు, ఎన్నికసభ్యులు, నియోజిత సభ్యులు అను

మూడువిధములైన సభ్యులతో గూడిన శాసనసభయొకటి యుండవలయును.

గవర్నరుగారీశాసనసభలో సభ్యుడుగానుండరాదు. కాని సభను సమావేశపరచుటకును, వారితో ప్రసంగించుటకును, ఆయన కధికారము కలదు.

(2) ఈచివర నుదహరించిన మొదటి షెడ్యూలు ప్రకారము సభ్యులసంఖ్య నిర్ణయము కాబడినది. ప్రతిశాసన సభ లోను నూటి కిరువదిమందికంటె నెక్కువగా నుద్యోగ సభ్యులుండరాదు. ఎన్నికసభ్యులు కనీసమునూటికి డెబ్బది మంది యుండవలయును.

(ఎ) అయితే పైనవివరించిన హామీషాయిలకు భంగము లేకుండ షెడ్యూలులోకంటె నెక్కువమంది సభ్యులను జేర్చుకొనుటకు నియమములేర్పరచు కొనవచ్చును.

(బి) శాసనసభా విచారణలోనికివచ్చినట్టిగాని, రాబోవునట్టిగాని, యేచట్టమునుగూర్చి యైననుప్రత్యేకానుభవజ్ఞానము గలవారినెవరైనను,అదనముగా గవర్నరుగారు నియోజించవచ్చును. ఇట్టి సందర్భములో అస్సాము రాష్ట్రమునకొక్కరిని, తక్కిన రాష్ట్రముల కిద్దరిని చొప్పున నియమించ వచ్చును.

(సి) ..........

(3) ఒక శాసనసభలో కాళీలున్నప్పటికిని సభావ్యవహారములు మామూలుగా జరిగిపోవచ్చును.

(4) ..........

(5) యిండియాలోని స్వదేశసంస్థానపు ప్రజలలో నుండిగాని ప్రభువులలో నుండిగాని యేయునిషియైనను రాష్ట్రీయ శాసన సభలో నియోజిత సభ్యుడుగా నుండవచ్చును.

72. బి (1) ప్రతిరాష్ట్రీయ శాసనసభయు, ప్రథమ సమావేశ దిన
ము మొదలుకొని మూడేండ్లవరకు సాధారణముగా
జీవించి యుండవలయును.

యితే:—

(ఏ) గవర్నరుగారు దానిని లోగానే రద్దు చేయవచ్చును.

(బి) ప్రత్యేక స్థితిగతులలో గవర్నరుగారికి అవసర
మనితోచేయెడల, గవర్నమెంటువారి గెజిట్టులో
సహేతుకముగా ప్రకటనజేసి, శాసనసభా కాలపరిమి
తిని మామూలు 3 సం॥ లు గాక మరియింకొక్క
సంవత్సరమధికముగా సాగునట్లా జ్ఞాపించవచ్చును.

(సి) శాసనసభను రద్దుచేసిన తర్వాత మరల శాసనసభా
యెన్నికలు జరుగుటకు ఆరునెలలకు లోపుగా నొక
తేదీని గవర్నరుగారు నిర్ణయము జేయవలెను. లేదా
స్టేటు సెక్రిటరీగారి యనుజ్ఞతో తొమ్మిది నెలల
లోగా నొకతేదీని నిర్ణయము జేయవలెను.

(2) గవర్నరుగారు తన యిష్టప్రకారము శాసనసభా సమా
వేశముయొక్క స్థలకాలములను నిర్ధారణ జేయవచ్చు
ను. మరియు ప్రకటనద్వారాగాని, మరియొక విధము
గాగాని, గవర్నరుగారు ఈసమావేశము నాపి వాయిదా
వేయవచ్చును.

(3) ఏదైన రాష్ట్రీయశాసనసభా సమావేశము జరుగుచున్న
ప్పుడు దాని అధ్యక్షుడుగానున్నవా రాసమావేశమును
ఆపి వాయిదా వేయవచ్చును.

(4) శాసనసభా విచారణలోనికివచ్చే అన్ని విషయములను
సభాధ్యక్షుడుగాక తక్కిన సభ్యులలో బహుజనాభిప్రా
యము (ఎక్కువవోట్లు) ననుసరించి తీర్మానించవలెను.
రెండుపక్షములు సమానమైనప్పుడు మాత్రము అధ్య

క్షుడు తన నిర్ధారణాభిప్రాయము (కాస్టింగువోటు) నిచ్చి యేదో పక్షమునకు తీర్మానించును.

—• రాష్ట్రీయ శాసన సభాధ్యక్షులు. •—

72 సి (1) మొదట గవర్నరుగారే రాష్ట్రీయ శాసన సభాధ్యక్షుని నియమించును. ఈచట్టము ప్రకారము క్రొత్తగా నేర్ప డు శాసనసభయొక్క ప్రథమ సమావేశము మొదలు నాలుగేండ్లవరకు నితడే యధ్యక్షుడుగా నుండును. తరువాత వచ్చేఅధ్యక్షుడు అప్పటి శాసనసభ్యులచే నె న్నుకొనబడి గవర్నరుగారి యామోదమును బడసిన యెన్నిక శాసనసభ్యుడయి యుండవలయును.

ఈ నాలుగు సంవత్సరము లాఖరయ్యే సరికి శాసనసభా సమావేశము జరుగుచున్నయెడల ఇతడే ఆసమావేశాంతము వరకు అధ్యక్షుడుగా నుండును. తరువాత జరిగే సమావేశారంభములో మొట్టమొదటి శాసన సభాధ్యక్షుని యెన్నిక జరగవలయును.

(2) ఈ శాసనసభకు ఉపాధ్యక్షుడు (డిప్యూటి ప్రసిడెంటు) గూడ నింకొకడుండును. శాసన సభ్యులు తమలో నొకరి నీపదవికి నెన్నుకొందురు. ఈయెన్నిక గవర్నరు గారి యామోదమును బడయవలయును. అధ్యక్షుడు హాజరులేని సందర్భములలో నీయుపాధ్యక్షుడే సభాపతి గానుండును.

(3) అధ్యక్షుని మొదటియెన్నిక యీ చట్టము ప్రకారము జరిగేవరకు గవర్నరుగారిచే నియోజింపబడిన అధ్యక్షు డీ పదవి యందుండును. కాని యీయన స్వదస్తూరీతో గవర్నరుగారిపేర రాజీనామా వ్రాసి పంప వచ్చును. లేదా యీయనను గవర్నరుగా రాపదవినుండి తొలగించ వచ్చును. ఇట్లేప్రకారముగానైనా గదు

వుగోపల తటస్థించే కాళీల నీప్రకారముగానే కొర వడిన కాలమునకు మరియొకరిని నియమించి భర్తీజేయ వలెను.

(4) ఎన్నుకొనబడిన అధ్యక్షుడును ఉపాధ్యక్షుడును శాసన సభ్యులుగా నున్నంతవరకే యీ యుద్యోగములలో నుందురు. వారు గవర్నరుగారిపేర స్వదస్తూరితో రాజీ నామాలు వ్రాసి పంపవచ్చును. లేక గవర్నరుగారి యీ మోదముతోజేసిన సభాతీర్మానము ప్రకార మీ యధ్యక్షులను దీసివేయవచ్చును.

(5) ప్రసిడెంటు, డిప్యూటిప్రసిడెంటులలో ప్రభుత్వ నియో జితులకు గవర్నరుగారు జేయునేర్పాటు ప్రకారమును, ఎన్నుకొనబడిన వారికి కౌన్సిలుతీర్మానముప్రకారమును జీతములు నిర్ణయించబడును.

72. డి (1) ............

(2) ప్రతిసంవత్సరము రాష్ట్రముయొక్క ఆదాయ వ్యయ ముల అంచనాపట్టికను అంకణా జాబితాగా (బడ్జెటు యెస్టిమేటు) తయారుజేసి ఆరాష్ట్రీయ శాసనసభవారి యెదుట బెట్టవలయును. రాష్ట్రీయ ప్రభుత్వములు ఆసంవత్సరములో తమ రాష్ట్రాదాయమును, ఇతర ద్రవ్యములను ఎట్లు వినియోగించదలచినది సూచించుచు శాసనసభవారి యంగీకారమునకై నివేదించవలయును. ఆపట్టీని సభవారంగీకరించుట, నిరాకరించుట, యేపద్దు నైన తగ్గించుట, తీసివేయుట, మార్చుట మొదలగు పనులను తమయిష్టమువచ్చినట్లు జేయవచ్చును.

అయితే,

(ఎ) శాసనసభవారు నిరాకరించినట్టి లేక తగ్గించినట్టి యేపద్దు అయినా రిజర్వుడు శాఖలకు జెందినదై

గవర్నరుగారు తన పరిపాలనా ధర్మనిర్వహణమున కది యావశ్యకమని నమ్మి యాప్రకారము వ్రాత మూలముగా ధృవపరచినచో (అనగా సర్టిఫై చేసినచో) దానిని సభవా రంగీకరించినట్లో లేక మార్పుచేయునట్లో భావించి గవర్నమెంటువా రమలు జరుపుకొనవచ్చును.

(బి) అత్యంతావశ్యక సందర్భములలో నేదైనా యొక ఖర్చుపద్దు రాష్ట్రముయొక్క శాంతభద్రతలకుగాని యేడిపార్టుమెంటునైన పరిపాలించుటకుగాని అవసరమని గవర్నరుగారు నమ్మినయెడల దానిని తానే (సభవారంగీకరించక పోయినను) మంజూరు జేసి అమలుజరిపించే యధికారమాయనకుగలదు.

(సి) గవర్నరుగారి సభవారికి శిఫారసుజేసి పంపినవిషయములకు తప్ప తక్కినపనుల కీరాష్ట్రాదాయములనుగాని, యితరధనమునుగాని వినియోగించుటకు బ్రయత్నించరాదు.

(3) ఈ క్రింది ఖర్చులకు సంబంధించిన పద్దులను శాసనసభవారికి దెలియజేయుటయే యవసరములేదు.

(i) రాష్ట్రీయ ప్రభుత్వమువారు ఇండియా గవర్నమెంటున కియ్యవలసిన విరాళములు.

(ii) ఋణములపై వడ్డీలు, వాయిదాబందీగా చెల్లించేబాకీలు.

(iii) ఏదైనా శాసనముప్రకారము నిర్ధారణ జేయబడినఖర్చు మొత్తము.

(iv) చక్రవర్తిగారిచేతగాని స్టేటు సెక్రటరీగారిచేతగాని లేక వారి యంగీకారముతోగాని, యేర్పాటు జేయబడిన ఉద్యోగులు, జీతములు, పింఛనులు.

**(V) హైకోర్టు జడ్జీలు, అడ్వకేటు జనరలుయొక్క జీతములు.**

ఏదైనా యొకపద్దు పైన వివరించినవానిలో జేరునా లేదా యని ప్రశ్న వచ్చినప్పుడు ఆవిషయములో గవర్నరుగారి నిర్ణయమే ఆఖరు తీర్పుగానుండును.

(4) శాసనసభా విచారణలోనికి వచ్చినట్టి లేక రాబోవునట్టి చట్టమును (బిల్లు) లేక అందలి భాగమును, లేక సవరణను గవర్నరుగారు తన రాష్ట్రముయొక్క గాని రాష్ట్ర భాగముయొక్కగాని లేక మరియొక రాష్ట్రము యొక్కగాని శాంతిక్షేమములకు భంగకరముగా నుండు ననినమ్మి యాప్రకారము వ్రాతమూలముగా ధృవపరచి (సర్టిఫైచేసి) యావిషయమై యెట్టివిచారణ విమర్శన లును జరుగకుండ ఆపివేయ వచ్చును.

(5) ప్రసిడెంటు డెప్యూటీ ప్రెసిడెంటు లిరువురును హాజరు లేనప్పుడెవరు అధ్యక్షతవహించవలెనో, సభావేశ సమయమున ఉండవలసిన క్రమధర్మములు, సభయొక్క అన్యూనసంఖ్య(కోరం) ప్రశ్నలు వివాదములు జరుపుట ఆపుట, మున్నగు వానినిగూర్చి నియమములు వేరుగా నేర్పరచబడును.

(6) సభావ్యవహారములను నిర్వర్తించుట కనుగుణ్యముగా ఎప్పుడును ప్రమాణముగా నుండే స్థిర నియమములను మొదట కార్య నిర్వాహకసభతో గూడిన గవర్నరుగారే నిర్మింతురు కాని గవర్నరుగారు అంగీకరించేయెడల వానిని శాసనసభవారు మార్చవచ్చును. శాసనము ప్రకారము గావించిన నియమములకు విరుద్ధముగా నున్నంతవరకు ఆప్రమాణ నియమములు నిరర్థకము లగును.

(7) సభానియమములకు లోబడి శాసనసభలలో సభ్యులకు

వాక్స్వాతంత్ర్యము పూర్తిగాగలదు. ఈసభలో నొసంగిన యుపన్యాసమును బట్టిగాని దెల్పిన అభిప్రాయమును బట్టిగాని వ్రాసిన వ్రాతను బట్టిగాని యేసభ్యునిపైన న్యాయస్థానములలో నెట్టిచర్యలను జరుపగూడదు.

—♦ రాష్ట్రీయశాసనసభవారు ♦—

(రాష్ట్రీయశాసనసభలో నేచట్టమైనను తీర్మానము కానప్పుడు) మార్గాంతరము.

72 యి. (1) రిజర్వుడుశాఖకు చెందిన యేచట్టమునైనను గవర్నరుగారు శిఫారసు చేసినప్రకారము రాష్ట్రీయశాసనసభవారు తీర్మానించకపోయినను లేక అసలువిచారణకే అంగీకరించకపోయినను గవర్నరుగారు తన పరిపాలనాధర్మ నిర్వహణమున కవసరమని దానిని ధృవపరచి (సర్టిఫైచేసిన) దస్కతు చేసినంతమాత్రముతో మామూలుగా శాసనమయిపోవును.

(2) ఈ ప్రకారముగా గవర్నరుగారు నిర్మించిన ప్రతిశాసనమునకు సరియైన నకలును తక్షణమే గవర్నరుజనరలుగారికి పంపవలెను. ఆయన దానిని చక్రవర్తిగారికి బంపి శ్రీవారి యంగీకారమును బొందినట్లు ప్రకటించగానే యది మామూలుగా శాసనసభవారి యామోదమును బడసిన శాసనమువలెనే అమలులోనికి వచ్చును. అయితే గవర్నరుగా రిట్లు అసాధారణముగా శాసనమును నిర్మించుటకు దగినంత యావశ్యకత గలిగినదని గవర్నరుజనరలుగా రభిప్రాయ పడినయెడల చక్రవర్తిగారికి పంపకుండా తన యంగీకారముతోనే దానిని శాసనముగా జేయవచ్చును. అప్పటికిని దానిని రద్దుచేయుటకు చక్రవర్తిగారి కధికారముగలదు.

(3) ఈపై నియముప్రకారము (చక్రవర్తిగారి యామోదములేకుండా) నిర్మించి శాసనమును సాధ్యమైనంత

త్వరలో పార్లమెంటులోని ఉభయ పక్షములయెదుటను బెట్టవలయును. చక్రవర్తిగారి యామోదమునకు పంపే శాసనము యొక్క నకళ్లను శ్రీవారికి నివేదించుటకు ముందు ఎనిమిది దినములకు తక్కువ గాకుండా పార్లమెంటులోని యుభయ పక్షముల వారి యెదుటను బెట్టవలయును.

78 మొదలు 80 ఆఖరువరకును గల సెక్షనులలో, లెప్టినెంటు గవర్నరు, చీఫుకమీషనర్ల, యాజమాన్యము క్రిందనుండు చిన్న రాష్ట్రములలో జరుగవలసిన శాసన సభలు, కార్యనిర్వాహక సభలుమున్నగు పరిపాలనావిధానములను గూర్చి వివరింపబడినది.)

—♦ రాష్ట్రీయశాసన సభాధికారములు ♦—

80. ఎ. (1) రాష్ట్రీయ శాసనసభలు తమరాష్ట్ర సరిహద్దులలో ప్రజలయొక్క నెమ్మదికిని సత్పరిపాలనకును వలసిన శాసనములను నిర్మించుకొనవచ్చును.

(2) ఈక్రిందరాబోవు నియమములకు లోబడి యీశాసనమమలులోనికి వచ్చిన తర్వాతగాని, దీనికి పూర్వముగాని, గావింపబడెడియేశాసనమైనను, తమరాష్ట్రమునకు సంబంధించి నంతవరకు ఆరాష్ట్రీయ శాసనసభవారు మార్చుకొనవచ్చును లేక రద్దుజేసికొనవచ్చును. ఇది రాష్ట్రీయ శాసనసభవారు దీర్మానించిన శాసనములకు మాత్రము వర్తించదు.

(3) గవర్నరు జనరలుగారి యనుజ్ఞముందుగా బొందకుండ రాష్ట్రీయ శాసనసభ వారీక్రింది శాసనములను నిర్మించకూడదు విచారణలోనికి దీసికొని రాగూడదు.

(ఎ) ఈశాసనము ప్రకారము మినహాయింపు చేయబడిన పన్నులుగాక తక్కినయే క్రొత్త పన్నైనా విధించుట

గాని, విధించే యధికారము నొసంగుటగాని, లేక

(బి) దేశ ఋణమునకుగాని, దిగుమతిసుంకమునకుగాని, ఇండియా దేశ వ్యవహారముల కై గవర్నరుజనరలుగారి యధికారముతో విధింపబడిన మరియొక పన్నునకు సంబంధించే లేక నష్టము గలిగించే శాసనమునుగాని

(సి) చక్రవర్తిగారి సైనిక నావికా విమాన దళముల శిక్షా పోషణాధర్మములకు భంగముగలిగించే శాసనమునుగాని

(డి) ఈ గవర్నమెంటువారికి విదేశప్రభువులతోను సంస్థానాధి పతులతోనుగల సంబంధమునకు భంగముగలిగించే శాసనమునుగాని

(ఇ) ఇండియాగవర్నమెంటు వారియధికారములోని (కేంద్ర పరిపాలనా) విషయములను గూర్చిన శాసనమునుగాని

ఎఫ్) యిండియా శాసనసభ వారి యాధీనములో ప్రత్యేకముగా జేర్చిన యేరాష్ట్రీయ విషయమును గూర్చిగాని

(జి) ఏశాసనముప్రకారమైనను ఇండియాగవర్నమెంటు వారి కిచ్చివేసిన యధికారమునకు భంగముగలిగించే శాసనమునుగాని

హెచ్) * * *

(ఐ) ఈ శాసనము అమలులోనికి వచ్చినపిమ్మట నిర్మింపబడిన యిండియా గవర్నమెంటు వారి చట్టములోని యేభాగమునైన మార్చుటకుగాని రద్దుచేయుటకుగాని (ఆచట్టముప్రకారము ముందుగా అనుమతిబొందకుండా రాష్ట్రీయశాసనసభలకు అధికారములేని శాసనములనుగాని నిర్మించకూడదు.

ఒకచట్టమునుగాని లేక అందొక నియమమునుగాని రాష్ట్రీయ శాసనసభ వారు నిర్మించిన తర్వాతదానిని గవర్నరుజనరలుగారు అంగీ

కరించినచో నావిషయమై ఆయన యనుజ్ఞముందుగా బయకపోయి నను అవి చలామణి కావచ్చును.

(4) ఏరాష్ట్రీయ శాసనసభలకును పార్లమెంటువారి శాసనమును మార్చునట్టి లేకరద్దుచేయునట్టి చట్టమును నిర్మించు నధికారము లేదు.

—♦ రాష్ట్రీయ శాసనసభలోని ఖాళీలు ♦—

80 సి. ప్రభుత్వోద్యోగు లెవరును శాసనసభలలో ఎన్నిక సభ్యులుగానుండరాదు రాష్ట్రీయశాసనసభలలోనుండు అనుద్యోగసభ్యుడు ( నియోజితుడుగాని యెన్నికసభ్యుడుగాని ) ఏదైన గవర్నమెంటుద్యోగము నంగీకరించినయెడల అతని సభ్యత్వస్థానము ఖాళీయగును.

ఈనియమము మంత్రిపదవి నంగీకరించిన వారికను వర్తించదు.

80 సి. రాష్ట్రాధిపతియొక్క యనుజ్ఞముందుగా బొందకుండ రాష్ట్రీయ శాసనసభ్యులెవ్వరును రాష్ట్రాదాయమునకు సంబంధించినట్టి గాని లేకయీ రాబడిని ఖర్చుచేయునట్టి గాని యేచట్టమును లేక తీర్మానమును శాసనసభలో ప్రవేశపెట్టుటకే వీలులేదు.

—♦ చట్టముల నంగీకరించుట ♦—

81 (1) ఒక రాష్ట్రీయశాసనసభలో దీర్మానించిన చట్టము నా రాష్ట్రాధిపతి యంగీకరించవచ్చును లేదా నిరాకరించవచ్చును

(2) రాష్ట్రాధిపతి యంగీకరించని చట్టము శాసనముగానేరదు

(3) రాష్ట్రాధిపతి యంగీకరించిన చట్టమునకు సరియైన నకలును వెంటనే గవర్నరు జనరల్‌గారికి పంపి యాయన యామోదమును గూడ బడసి రాష్ట్రాధిపతిచే ప్రకటింపబడేవరకు యీశాసనము చెలామణియగుటకు వీలులేదు.

(4) గవర్నరుజనరల్ గా రంగీకరించనియెడల నాయన వ్రాత

మూలముగా తన కారణములను రాష్ట్రాధిపతికి దెలియ జేయవలయును.*

—♦ చిత్తుచట్టముల పునర్విమర్శనాదులు. —♦

81. ఎ (1) రాష్ట్రీయ సభలో దీర్మానింపబడిన యొక చట్టమును రాష్ట్రాధిపతి (గవర్నరు) అంగీకరించి శాసనము జేయుటకు, బదులుగా నిరాకరించి దానిని బూర్తిగానో కొంత భాగమునో తనసూచించిన సవరణలతోగాని, లేకుండగాని, శాసనసభవారి పునర్విచారణకు దిరిగి పంపివేయువచ్చును. లేదా గవర్నరు జనరలుగారి విచారణకొరకు ఆపియుంచవచ్చును.

(2) ఒకచట్టము నిట్లు గవర్నరు జనరలుగారి విచారణకొరకాపియుంచినపు డీక్రింది నియమములు దానికి వర్తించవలయును:—

(ఎ) ఆచట్టము నాపియుంచిన తేదీమొదలు ఆరు నెలలలోగా గవర్నరు జనరలుగారి యనుమతితో, ఆశాసన సభవారి పునర్విచారణకై దానిని సవరణలతోగాని లేకుండగాని తిరిగి పంపివేయువచ్చును.

(బి) రాష్ట్రాధిపతుల శిఫారసులతో తిరిగివచ్చిన చట్టమును సభవారు పునర్విచారణచేసి సవరణలతోగాని లేకుండాగాని దానినే తిరిగి ధృవపరచినచో నట్టిచట్టమును రాష్ట్రాధిపతుల యంగీకారమునకు మరల బంపవలయును.

(సి) గవర్నరు జనరల్‌గారి యామోదమునకై ఆపియుంచబడిన యేచట్టమైనను ఆరు మాసములలోగా ఆయన యంగీకారమును బడిసినట్లు ప్రకటించబడగానే యది మామూలుగా

* రాష్ట్రాధిపతి యనగా గవర్నరు గాని, చీఫ్ కమీషనర్ గాని గావచ్చును.

శాసనమై పోవును. ఆరుమాసములలోగా నీపని జరుగనిచో నాచట్టము రద్దైపోవును.

అయితే

(i) రాష్ట్రాధిపతులచే నీవాయిదాలోగా సభవారి పునర్విచారణకొరకు బంపబడియున్నను, లేక

(ii) ఈయారు మాసములు సాంతమగునప్పటికి శాసనసభా సమావేశము జరుగుచుండనిచో రాబోవు సమావేశములో పునర్విరచాణ చేయబడునని ప్రకటించినను,

ఈపై కాల దోష నియమ మీచట్టమునకు వర్తించదు.

(3) రాష్ట్రీయ శాసనసభలో నంగీకరించబడిన చట్టమునకు గవర్నరు జనరల్‌గారు తన యామోదము నొసంగకుండ దానిని చక్రవర్తిగారి చిత్తమునకు నివేదించుటకై ఆపియుంచినపుడు అది చక్రవర్తిగారి యామోదమును బొందినట్లు ప్రకటింపబడేవరకు అమలులోనికి రాదు.

—♦ రాష్ట్రీయ శాసనములను చక్రవర్తిగారు నిరాకరించుట.♦—

82. (1) గవర్నరు జనరలుగా రంగీకరించిన చట్టమునకు సరియైన నకలును వెంటనే స్టేటు సెక్రటరీగారికి బంపవలెను. మంత్రివర్గముతో గూడిన చక్రవర్తిగారు ఆశాసనమును రద్దుచేయుట కధికారము గలదు.

(2) చక్రవర్తిగారిచే నిట్లురద్దుచేయబడిన శాసనమును గూర్చి రాష్ట్రాధిపతులు వెంటనే ప్రకటన చేయువలెను. ఆ తేదీ మొదలు ఆశాసనము రద్దైపోవును.

83. (తీసి వేయబడెను)—

84. (ఇండియా శాసనముల చలామణి విషయములో గలుగుసందేహములనుగూర్చి ఈ సెక్షనులో (వ్రాయబడినది.)

—♦6 ఎ. భాగము.♦—

84. ఎ (1) ఈ చట్టము (1919 సం॥ యిండియా గవర్నమెంటు ఆక్టు) తీర్మానమైనది మొదలు పది సంవత్సరములు గడచిన తరువాత పార్లమెంటువారి యనుజ్ఞతో, చక్రవర్తిగారి యంగీకారమునకై యిండియా వ్యవహారములను విమర్శించెడి (కమీషను) విచారణ సంఘములో నుండదగిన సభ్యులపేర్లను స్టేటుసెక్రిటరీగారు నివేదించవలయును.

(2) చక్రవర్తిగారిచే నంగీకరింపబడిన వారందరు గలిసి విచారణ సంఘముగా నుందురు. ఈ సంఘమువారు బ్రిటిషు ఇండియాలోని, పరిపాలనా విధానము, విద్యాభివృద్ధి, ప్రజాప్రతినిధి సంస్థల విజృంభణము, తత్సంబంధమైన సర్వవిషయములను చక్కగా విచారించి యీ దేశములో బాధ్యతాయుత స్వపరిపాలనా విధానము నెంతవరకు స్థాపించవలయునో ఉన్నవానిని మార్చవలెనో, తగ్గించవలెనో, హెచ్చించవలెనో, రాష్ట్రీయ శాసన సభలలో ఇండియా శాసన సభలోవలె మరియొక విభాగమునుకూడ నిర్మించుట యెంతవరకు వాంఛనీయమో, మున్నగు వానింగూర్చి తమ శిఫారసులను నివేదించ వలయును.

(3) ఈ సంఘమువారు బ్రిటిషు యిండియాకును అందలి రాష్ట్రములకును సంబంధించిన యే వ్యవహారమునైన చక్రవర్తిగారి యాజ్ఞ ప్రకారము విచారించి నివేదికను ప్రకటించ వలయును.

—♦ ఏడవ భాగము ♦—

85 మొదలు 94 ఆఖరువరకును గల సెక్షనులలో గవర్నమెంటు ఉద్యోగుల జీత, భత్యములు, సెలవులు, గైరుహాజరులు, తా

త్కాలికపు ఖాళీలు, శాసనసభలలో ఖాళీలు మున్నగు వానిం గూర్చి వ్రాయబడినది.)

95. (1) స్టేటుసెక్రటరీ కౌన్సిలువారి తీర్మానము ప్రకారము యిండియా దేశములో సైనికోద్యోగుల నియామకము వారి, జీతముల యభివృద్ధి, మున్నగువానింగూర్చి నియమము లేర్పాటు చేయబడును. ఒకసారి యుద్యోగమునుండి తొలగించినవారిని తిరిగి యుద్యోగములలో జేర్చుకొనవచ్చును.

(2) ... ... ...

96. బ్రిటిషుయిండియా దేశీయుడుగాని, లేక యిచట నివాసముగానున్న చక్రవర్తిగారి ప్రజలలో నెవరైననుగాని, మతము, జన్మస్థానము, వంశము, శరీరవర్ణము, దీనిలో నేకారణముచేతను ప్రభుత్వోద్యోగమున కనర్హుడు కాకూడదు.

96. ఎ. యిండియా గవర్నమెంటువారు స్టేటుసెక్రటరీ కౌన్సిలువారి యనుమతితో స్వదేశసంస్థానపు ప్రజలలోనుండిగాని, ప్రభువులలోనుండిగాని ఏమనిషినైనను బ్రిటిషుయిండియాప్రజలతో పాటుగ, సివిలు మిలిటరీయుద్యోగముల కర్హుడని ప్రకటించవచ్చును. అదేవిధముగా యిండియాలోని స్వతంత్రసంస్థానములలోనుండిగాని, చుట్టుపక్కలనున్న యితరజాతులనుండిగాని, యేమనిషినైనను సైనికసేవలో జేర్చుకొనవచ్చును.

## 7 ఎ. భాగము

### ఇండియాలో సివిలుసర్వీసు.

96. బి. (1) ఈశాసనము ననుసరించియు, దీనిప్రకారము గావించిన యితర నియమముల ననుసరించియు, ఇండియాలో సివిలు సర్వీసునందునున్న ప్రతివాడును చక్రవర్తిగారి యనుగ్రహ మున్నంతకాల మాయుద్యోగములో నుండును. తగిన యధికారముగల వానిచే సివిలుసర్వీసు ఉద్యోగి

యుచితరీతిని నియమింపబడుచుండును. అతని కుద్యోగ మిచ్చినవానికంటె తక్కువ యధికారముగలవా రెవరును అతని యుద్యోగమును దీసివేయరాదు. ఒకసారి యుద్యోగమునుండి తీసివేయబడినవానికే తగిన కారణమున్నయెడల స్టేటు సెక్రటరీగారు తిరిగి యుద్యోగమియ్యవచ్చును.

ఒక గవర్నరుగారి రాష్ట్రములో, స్టేటుసెక్రటరీచే నీప్రకారము నియమింపబడిన యొక సివిలియ నుద్యోగికి తనపై యధికారి యాజ్ఞవలన తనకు అక్రమము జరిగినట్లుదోచిన ఆయధికారికే సరియయిన అర్జీపెట్టినను న్యాయము గలుగలేదని అతడునమ్మినప్పుడు ఆగవర్నరుగారే ఆఫిర్యాదును నిష్పక్షపాతముగా విచారించి న్యాయముగలుగ జేయవలెను.

(2) ఇండియాలోని సివిలు సర్వీసు ఉద్యోగులలో తరగతులు, వారిని జేర్చుకొనువిధము, వారి యుద్యోగపు షరతులు, జీతము, భత్యము, వారినడత మొదలగువానిని గూర్చిన నియమములనెల్ల స్టేటు సెక్రటరీ కౌన్సిలువారు జేయవచ్చును. ఒకప్పుడు వారికుచితమని తోచినంతవరకు అట్టినియమములను నిర్మించేయధికారమును, గవర్నరుజనరలుగారి కౌన్సిలుకు, రాష్ట్రీయ ప్రభుత్వములకు, ఇండియా శాసనసభలకు, రాష్ట్రీయ శాసనసభలకును, ఇచ్చివేయవచ్చును.

అయితే యీశాసనమునకు బూర్వము స్టేటు సెక్రటరీగారిచే నియమింపబడిన సివిలు సర్వీసు ఉద్యోగికిగల హక్కులన్నియు యథాప్రకారముగానే యుండును. లేదా యొకప్పుడు వాని కభ్యంతరము గలిగినచో స్టేటు సెక్రటరీగారి కుచితము, న్యాయమునని తోచిన నష్టపరిహారము నతడు బొందవలెను.

(3) స్టేటు సెక్రటరీ కౌన్సిలుచే ఇండియాలో నియమింపబడిన అందరు సివిలుసర్వీసు ఉద్యోగులయొక్క పించను షరతులు

ఇదివరకు వాడుకలోనున్న నియమములప్రకారమే చలామణి యగుచుండవలయును. అయితే ఆనియమములలో స్టేటు సెక్రటరీ కౌన్సిలువారు మార్పులు జేయవచ్చును. కాని యామార్పులు అంతకుపూర్వమే యుద్యోగములో నున్న వారి కేమియు బ్రతికూలము గలుగజేయగూడదు.

1874 వ సంవత్సరపు, యీస్టిండియా యాన్యూయిటీఫండు ఆక్టు, అను చట్టముప్రకారము ఎవరికే హక్కులుగలిగినను వారికి పైన వివరించిన నియమములేమియు భంగము గలిగింపనేరవు.

(4) ఇండియాలో సివిలు సర్వీసునుగూర్చి యీశాసనమునకు బూర్వము గావింపబడియున్న నియమములన్నియు సరియైన యధికారముతోనే జేయబడినవనిధృవపరచుచు, వానిని సందర్భానుసారముగా మార్చుకొనుటకును, జేర్చుకొనుటకును, ఈసెక్షనుప్రకారము అవకాశముగలదు.

96. సి. (1) స్టేటు సెక్రిటరీ కౌన్సివారు పబ్లికుసర్వీసు కమీషను అను ఇండియాలో నెక పంచాయితీసంఘము నేర్పాటు జేయవలయును. ఇందు అయిదుగురికంటె నెక్కువమంది సభ్యులుండరాదు. వీరిలో నొకరు అధ్యక్షుడు. ప్రతిసభ్యుడు నీహోదాలో అయిదేండ్లుండును. అనంతరము తిరిగి యీపదవి వహించవచ్చును. ఏసభ్యునినైనను అతని గడువులోపల సభ్యత్వమునుండి తొలగించరాదు అయితే స్టేటు సెక్రటరీగారి ఆజ్ఞతోమాత్రము తొలగించవచ్చును. ఈసభ్యత్వమునకును, అధ్యక్షత్వమునకును వలసిన యోగ్యతలు,జీతము,పింఛను (ఉంటే)మున్నగు వానిని స్టేటు సెక్రటరీకౌన్సిలువారొనర్చిన నియమముల ననుసరించి ఏర్పాటు జేయవలయును.

(2) ఈవిచారణ సంఘమువారు సివిలు సర్వీసు ఉద్యోగులను జేర్చుకొనుట, ఉద్యోగములలో నున్నవారిపై అజమాయ

పీ జేయుట, మొదలగు పనులను స్టేటు సెక్రటరీ కౌన్సిలు వారి నియమానుసారముగా జేయవలయును.

9 i. డి (1) స్టేటు సెక్రిటరీ కౌన్సిలువారు ఇండియాలో నొక ఆడిటర్ జనరల్‌ను ఏర్పాటు జేయవలయును. చక్రవర్తి గారి యనుగ్రిహ మున్నంతకాల మతడా యుద్యోగము లోనుండును. ఇతని జీతము, అధికారము, విధాయకములు, ఉద్యోగపుషరతులు, ఉద్యోగ ధర్మనిర్వహణము, తాత్కాలికపు ఖాళీ, గైరుహాజరుమున్నగు వానిం గూర్చి కౌన్సిలువారే నియమము లొనర్చవలయును.

(2) పబ్లికు సర్వీసు ఉద్యోగములు క్రొత్తవి నిర్మించుటకు గాని ప్రాతవి రద్దుచేయుటకుగాని, ఉద్యోగులకిచ్చే వరుమానమును మార్చుటకుగాని, కౌన్సిలువారు నిర్మించే యే నియమముల ప్రకారమును సాధారణముగా వీలులేదు. అయితే యీ విషయమై నియమింపబడు ఆర్థికశాస్త్రాధికారి సంప్రతింపుతో నీపనులు జేయవచ్చును.

96. (యి) శాసన భాగమునకు సంబంధించిన నియమములను నిర్మించునపుడు కౌన్సిలు సభ్యులలోని బహుజనాభిప్రాయమును బట్టియే జేయవలయునుగాని మరియొక విధముగా వనికి రాదు.

—♦ ఎనిమిదవ భాగము ♦—

(97 మొదలు 100 ఆఖరువరకు గల సెక్షనులలో ఇండియన్ సివిలుసర్వీసు పరీక్షలు అందు జేర్చుకొనబడు వారి యోగ్యతలు మున్నగు వానినిగూర్చి వ్రాయబడినది.)

—♦ తొమ్మిదవ భాగము ♦—

ఇండియా దేశపు హైకోర్టులు.

101. (1) ఈశాసనములో జేర్కొన్న హైకోర్టులన్నియు ఆది శాస

నముల ప్రకారము ( Letters Patent ) స్థాపింపబడినవై యుండును.

(2) ప్రతిహైకోర్టునకు నొక ప్రధాన న్యాయమూర్తియు, చక్రవర్తిగారి చిత్తమువచ్చినంత మంది యితర న్యాయాధిపతులు నుందురు.

అయితే (i) ఏహైకోర్టులోనైనా రెండు సంవత్సరములకు మించకుండ పనిచేయుటకు యుండినూ గవర్నమెంటువారు అధికముగా న్యాయాధిపతులను నియమించవచ్చును. వీరికి చక్రవర్తిగారిచే నియమింపబడిన వారితో సమానముగనే యధికారము లుండును.

(ii) ఒకహైకోర్టులో ప్రధాన న్యాయమూర్తితోసహా నిరువది మందికంటె నెక్కువగ న్యాయాధిపతు లుండరాదు.

3) హైకోర్టుజడ్జి కీక్రింది యోగ్యతలుండ వలయును.

(ఎ) ఐదు సంవత్సరములకు తక్కువలేని యనుభవముగల యింగ్లాండు ఐర్లాండు దేశముల బారిష్టరుగానో, స్కాట్లాండు దేశపు న్యాయశాస్త్రవేత్తగానో యుండ వలయును, లేక

(బి) పది సంవత్సరముల యుద్యోగానుభవమును గలిగి కనీసము మూడేండ్లైనను జిల్లాజడ్జీ యధికారముల చలాయించిన యిండియన్ సివిలు సర్వీసులోని వాడైనా గావలయును, లేక

(సి) అయిదు సంవత్సరములకు తక్కువలేని యనుభవము గల సబ్ జడ్జీగానో, స్మాల్ కాజ్ జడ్జీగానో పని జేసి యుండవలెను. లేదా

(డి) పది సంవత్సరములకు తక్కువ లేకుండా హైకోర్టులో ప్లీడరై యుండవలయును.

(4) హైకోర్టు న్యాయాధిపతులందరిలో మూడవ వంతుమందికి తక్కువ లేకుండగ బారిస్టర్లో అడ్వకేట్లో యై యుండవలెను. కనీసము మూడవవంతు సివిలుసర్వీసు వారుండవలయును. వాయువ్య సరిహద్దు పరగణాలకు అలాహాబాదు హైకోర్టనియు, బంగాళములోని హైకోర్టునకు కలకత్తా హైకోర్టనియు పేర్లు.

102. (1) హైకోర్టు జడ్జీలందరు చక్రవర్తిగారి చిత్తమువచ్చినంతకాల మాపదవిలో నుందురు. (2) ఏ హైకోర్టు జడ్జియైనను తన యుద్యోగమునకు రాజీనామా నియ్యవచ్చును. కలకత్తా వారు యిండియా గవర్నమెంటు వారికిని, తక్కినవారు తమ రాష్ట్రీయ ప్రభుత్వములకును, తమ రాజీనామాలను బంపవచ్చును.

103. (1) ఒక హైకోర్టులోని ప్రధాన న్యాయమూర్తి తక్కిన న్యాయాధిపతు, లందరిలోను గౌరవాధికారములం దగ్రగణ్యుడుగానుండవలయును.

(2) తక్కిన న్యాయాధిపతు లందరికిని తమ యుద్యోగ నియామకము ననుసరించి స్థానక్రమము నిర్ణయించబడును.

104. (1) హైకోర్టుజడ్జీల జీతములు, భత్యములు, సెలవులు, పింఛనులు, ప్రయాణపు ఖర్చులు మొదలైనవానిని స్టేటు సెక్రటరీ కౌన్సిలువారు నిర్ణయించవచ్చును. కాని వారి నిర్ణయము అంతకు పూర్వమే నీయుద్యోగములో నున్న వారికి వర్తింపదు.

(2) ఒక న్యాయాధిపతి తన యుద్యోగ ధర్మము నిర్వర్తించుటకు ప్రారంభించి నప్పటినుండి జీతభత్యములను బొందుచుండును.

(3) ఒక హైకోర్టుజడ్జి తన యుద్యోగ్యమును స్వీకరించుటకై యింగ్లాండునుండి యిండియాకువచ్చే ప్రయాణములోగాని లేక యిచటకు వచ్చిన ఆరుమాసములలో గాని కాలధర్మము నొందినయెడల, అతని వారసులకు స్టేటు సెక్రటరీగారు యిండియా ధనమునుండి మరణకాలమువరకు అతనికి ముట్టిన సొమ్ముతోగలిపి మొత్తమొక సంవత్సరపు జీతమిచ్చి వేయువలెను.

(4) ఒక హైకోర్టుజడ్జీ యిండియాకువచ్చినది మొదలుకొని ఆరుమాసముల యనంతరము చనిపోయిన యెడల స్టేటుసెక్రటరీగారతని వారసులకు అతనికి రావలసిన జీతము తాలూకు బాకీగాక, మరియొక ఆరుమాసముల జీతము నధికముగ నివ్వవలెను

105. (1) హైకోర్టులోని ప్రధానన్యాయమూర్తిస్థానము ఖాళీకాగానే, కలకత్తావిషయములో ఇండియా గవర్నమెంటువారును, తక్కిన రాష్ట్రములలో ఆయా రాష్ట్రాధిపతులును, మిగిలిన న్యాయాధిపతులలో నొకరిని ప్రధానన్యాయమూర్తిగా నియమించవలెను. చక్రవర్తిగారిచే నియోజింపబడిన ప్రధాన న్యాయమూర్తి వచ్చి తనయుద్యోగధర్మములో ప్రవేసించేవరకు నితడే యాపదవిలోనుండును.

(2) (తక్కిన న్యాయాధిపతుల స్థానములు ఖాళీయైనపుడు జరుగవలసిన కార్యక్రమమిందు వివరింపబడినది.)

(106 - మొదలు 113 ఆఖరువరకును గల సెక్షనులలో హైకోర్టు అధికారముల సరిహద్దులు, వారికి క్రిందికోర్టులపై గల యధికారము, ఈవిషయములో యిండియా గవర్నమెంటువారి సంబంధము, మున్నగుసంగతులు వ్రాయబడినవి)

114. (1) బంగాళము మదరాసు బొంబాయి రాజధానులకు ఒక్కొక్క అడ్వకేటు జనరలు చక్రవర్తిగారిదస్కతు ముద్రతోనూ

మాతో ఏర్పాటుచేయబడును. (ii) ఇంగ్లాండులో అట్టర్నీ జనరల్ గారువలె నీ అడ్వకేటుజనరలు తన రాజధానిలో చక్రవర్తిగారి తరఫున కొన్నియధికారములను చలాయించ వచ్చును.

(iii) (ఈ అడ్వకేటు జనరలుస్థానము కాళీ అయినప్పుడు జరుగవలసినపద్ధతి యింగు వ్రాయబడినది.)

—♦ 10 వ భాగము. ♦—

క్రైస్తవమతమునకు సంబంధించినది.

115, 116, 117. సెక్షనులలో కలకత్తా, బొంబాయి, మదరాసులలోనుండు క్రైస్తవ మతాధికారులైన బిషప్పుల నియామకము, అధికారము, విధాయకములు, మున్నగునవిందుదెలుపబడెను.

118. (1) ఈ పైన వివరించిన బిషప్పులకు ఇండియాదేశపు ఆదాయములోనుండి స్టేటు సెక్రటరీ కౌంసిల్ వారు నిర్ణయించిన ప్రకారం జీత భత్యముల నొసంగవలెను.

(ii) ఈ ఆర్చిబిషప్పులు మొదలగువారు తమ యుద్యోగ ధర్మము నారంభించినప్పటినుండి, అన్నివిధములైన ప్రతిఫల ప్రయోజనములను బొందుచుండ వలెను.

(iii) వీరు దేశసంచారము చేయునప్పుడు ఇండియా రాబడిలోనుండి యీ స్టేటు సెక్రెటరీ కౌంసిల్ వారి నిర్ణయమును మీరకుండా ప్రయాణపు ఖర్చు లొసంగబడును.

119. (1) తన యుద్యోగ ధర్మమును స్వీకరించుటకై ఇంగ్లాండునుండి ఇండియాకు జేరేలోపుగా కలకత్తా బిషప్పు మార్గమధ్యమున చనిపోయినప్పుడును, కలకత్తా బొంబాయి మదరాసు బిషప్పులు ఇక్కడకు వచ్చిన ఆరు మాసములలోగా చనిపోయినప్పుడును, వారి వారసులకు ఇండియా దేశపు

రాబడిలోనుండి స్టేటు సెక్రిటరీగారు మొత్తమున ఒక సంవత్సరపు జీతము నిచ్చివేయువలెను.

(2) కలకత్తా మదరాసు బొంబాయి బిషప్పులు యిచటికి వచ్చి ఆరు మాసములు ఉద్యోగము చేసినతరువాత చనిపోయిన యెడల వారికి చెందవలసిన బాకీలుగాక, ఆరుమాసముల జీతము అధికముగా స్టేటు సెక్రిటరీగారు ఇండియా దేశపు ధనములో నుండి వారివారసుల కివ్వవలెను.

120. చక్రివర్తిగారి దస్కతుగల హుకుంనామామీద స్టేటు సెక్రిటరీగారు గూడ దస్కతుచేసి, ఇండియా దేశపు రాబడినుండి ఇండియా దేశములో పది సంవత్సరములు కాపురముండిన కలకత్తా బిషప్పునకు, సంవత్సరమునకు 1500 పౌనులకు మించకుండాను, కలకత్తా బొంబాయి మదరాసు బిషప్పులు ఏడు సంవత్సరములీ దేశములో నివసించిన యెడల, ఒక్కొక్కరికి సాలుకు వేయి పౌనులకు మించకుండాను, వారే అయిదు సంవత్సరములు నివసించినచో సాలుకు 750 పౌనుల చొప్పునను, మదరాసు బొంబాయి బిషప్పులు 15 సంవత్సరములీ దేశములో నివసించినయెడల, మనిషికి సాలుకు 800 పౌనులకు మించకుండాను, ఫించనులిచ్చుటకు ఉత్తరువు చేయవచ్చును.

121. కలకత్తా బొంబాయి మదరాసు బిషప్పులకు డాక్టరు సర్టిఫికెట్టుమీద సెలవు మంజూరుచేయు విషయమై చక్రవర్తిగారు తగిన నియమము లేర్పరచ వచ్చును.

122. (ఈ సెక్షనులో ఆర్చిబిషప్పుల తాబేదార్లుగా నుండువారి జీతములు, ఉద్యోగ ధర్మములు, మొదలగు వానినిగురించి (వ్రాయబడినది)

123. స్టేటు సెక్రటరీ కౌన్సిల్‌వారి యనుమతితో ఇండియా గవర్నమెంటువారు క్రైస్తవమతమునకు సంబంధించిన ఏశాఖకైనను,

ఏ సంఘమునకైనను (ఇంగ్లండు, స్కాట్లెండు ఛర్చిలకు సంబంధించినవిగాక ) మతబోధ కొరకుగాని, ఈశ్వరారాధనప్రదేశములను నిర్వహించుట కొరకుగాని వారికుచితమని తోచినంత మొత్తమును, మంజూరు చేయవచ్చును. ఈశాసనమున వారికేమియు నభ్యంతరము గలిగించ రాదు.

—♦ 11 వ భాగము ♦—

నేరములు, చర్యలు, శిక్షలు.

124. ఇండియాలో చక్రవర్తిగారికొలువులోనున్న ఏయుద్యోగియైనను

**(i)** తన యధికారమును చలాయించుటలోగాని, తన యధికారము క్రిందనున్నట్టిగాని, బ్రిటిషుప్రజల నెవరినైనను, హింస పెట్టినట్లయితేను,

**(ii)** స్టేటు సెక్రటరీగారి వుత్తరువులను బుద్ధిపూర్వకముగా నుల్లంఘించి నట్లయితే లేక ఉపేక్షించి నట్లయితే,

**(iii)** తన యుద్యోగ ధర్మమునకును లేక బాధ్యతకును, బుద్ధిపూర్వకముగా భంగము కలిగించి నట్లయితేను,

**(iv)** గవర్నరు జనరలుగాని, గవర్నరుగాని, లెప్టినెంటు గవర్నరుగాని, ఛీప్ కమీషనరుగాని, కార్యనిర్వాహకసభ్యుడుగాని, మంత్రిగాని, శిస్తువసూలునకో న్యాయవిచారణకో నియమింపబడిన మరియొకయుద్యోగిగాని, తన లాభముకొరకో తనవారి లాభముకొరకో ఇండియా దేశములోనేదైన వ్యాపారముగాని వ్యవహారముగాని, చేయుచుండి నట్లయితేను, (జాయింటు స్టాకుకంపెనీలో భాగస్వామిగా మాత్రముండవచ్చును.)

**(v)** ఆతడు తన యుద్యోగధర్మమును నిర్వర్తించుటలో ధనరూపములోగాని, మరియొకరూపములోగాని, దానము, ప్రీతి

ఫలము బహుమానము, మొదలగువానిని స్వీకరించినట్లయి తేను, (బారిస్టర్లు, సర్జనులు, మొదలగువారికిచ్చే ప్రతిఫలములకుగాని, స్టేటు సెక్రిటరీగారు చేసిన నియమములకు లోబడి స్వీకరించే బహుమానములకుగాని యిది వర్తించదు)

అట్టి యుద్యోగి నేరస్థుడుగా నెంచబడును. బహుమాన ప్రతిఫలాదులు స్వీకరించినట్లు నిర్ణయించి అతనికి శిక్షవేసిన యెడల, అట్టి బహుమానాదుల పూర్తిఖరీదు చక్రవర్తిగారికిగాని, ఫిర్యాదికి గాని, నేరము పట్టుకొనిన వారికిగాని, ఒసంగిన వానికిగాని పూర్తిగానో కొంతభాగమో కోర్టువారి చిత్తమువచ్చినట్లిప్పించవచ్చును.

అయితే గవర్నరు జనరలుగారి కార్యనిర్వాహక సభ్యుడుగాని లేక రాష్ట్రీయ ప్రభుత్వములోని యేసభ్యుడుగాని తనకా యుద్యోగము లభించుసమయమునకు, ఇండియాలో నేదైననువర్తక వ్యాపారములలో జేరియున్న యెడల ఆయాసందర్భములను బట్టి గవర్నరు జనరలుగారి యొక్కగాని గవర్నరుగారి యొక్కగాని వ్రాతమూలకమైన యనుమతినిబొంది, ఇండియా గవర్నమెంటు వారు విధించు షరతులకును నియమములకును లోబడి తనకా వ్యాపారములోగల భాగసంబంధమును వదలుకొనకుండా నుండవచ్చును. అయితే నాయుద్యోగమందున్నంతకాలము ఆవ్యాపారములో తనకెట్టి పెత్తనముగాని పరిపాలనా సంబంధముగాని, యుండరాదు.

125. స్టేటు సెక్రటరీ కౌన్సిలుయొక్కగాని ఇండియా గవర్నమెంటు యొక్కగాని, లేక రాష్ట్రీయ ప్రభుత్వము యొక్కగాని, వ్రాతమూలకమైనయనుజ్ఞలేనిదే ఐరోపియన్ బ్రిటీషు పౌరుడెవరును ఈ క్రింది కార్యములు చేయరాదు.

(ఎ) ఇండియాలో స్వదేశ సంస్థానాధిపతులకుగాని చిన్న చిన్న

సామంత ప్రభువులకుగాని, ధనమునుగాని, విలువగల వస్తువునుగాని, బదులిచ్చుట:

(బి) అట్టి సంస్థానాధిపతికి పెట్టుబడి పెట్టుటలేక ఋణమును సమకూర్చుటలేక అట్టిఋణమును తీర్చువిషయములో హామీగా నుండుట;

(సి) అట్టి సంస్థానాధిపతులకు ఋణమిచ్చుటకై మరియొకరికి తాను ధనమునుగాని విలువగల వస్తువునుగాని బదులిచ్చుట;

(డి) అట్టి సంస్థానాధిపతులు తమ ఋణమునకు హామీగా నొసంగిన పత్రములు ముచ్చిలికాలు మొదలగువానిని తీసికొనుట;

(ఇ) ఇందుకు వ్యతిరేకముగా ఐరోపియను బ్రిటీషు పౌరులు తీసికొనియున్న పత్రములు హామీ దస్తావేజులన్నియు చెల్లుబడి కాగూడదు.

126. ఈసెక్షనులో శాంతి క్షేమములకు భంగముగా స్వదేశ సంస్థానాధిపతులతోగాని, విదేశ ప్రభుత్వాధికారులతోగాని రహస్యముగా అపాయకరమైన ఉత్తర ప్రత్యుత్తరములను జరుపువారిని బంధించి విచారించి శిక్షించే విధానము వ్రాయబడినది. ఇండియాలో చక్రవర్తిగారి కొలువులోనున్న యుద్యోగులెవరైనను తమయధికారములో నున్న ప్రజలకపకారము చేసినయెడల విని విచారించి తీర్పుచెప్పుటకు ఇంగ్లండులోని హైకోర్టుప్రధాన న్యాయమూర్తికి అధికారము గలదు.

**(ii)** ... ... ... ...

128 బ్రిటీషు ఇండియాలో నేరారోపణ జేసిన ఆరు సంవత్సరములలోగా కేసు విచారణచేసి శిక్షింపవచ్చును.

129 (ఇట్టి నేరస్థులకు విధించుశిక్షలనుగురించియిందు వ్రాయబడినది.)

—♦ 12 వ భాగము ♦—

129 (ఎ) ఈశాసనము ప్రకారము ప్రత్యేకముగా గావింపబడవలసిన విధి నియమములను గురించి యిందు వ్రాయ బడెను.

130 ఈశాసనము ప్రకారము రద్దు చేయబడిన శాసనములు, శాసన భాగములు మున్నగువానిని గూర్చి యిందు దెలుపబడెను.

131 (1) ఇండియా ప్రభుత్వము విషయములో చక్రవర్తి గారికిని స్టేటు సెక్రటరీ కౌన్సిలువారికిని గలయధికారములను హక్కులను ఈశాసనము తగ్గింపజాలదు. ఇండియా గవర్నమెంటువారి తీర్మానములను ఆజ్ఞలను మార్చుటకుగాని రద్దు చేయుటకుగాని, బ్రిటీషు ఇండియా వాసుల కొరకు శాసనముల నిర్మించుటకుగాని, పార్లమెంటువారికి పూర్ణమైన అధికారము గలదు,

132 (3) ఈశాసనారంభ సమయమునకు నిలిచియున్న ఈస్టు ఇండియా కంపెనీవారి ఒడంబడికలు, చెల్లించవలసిన బాధ్యతలు. బాకీలుమొదలైనవానికి చక్రివర్తిగారు బద్ధులై యుండవలెను. ఈస్టు ఇండియా కంపెనీ హయాములో చేయబడిన ఉత్తరువులు నియమములు ఈశాసనారంభకాలమునకు నిలిచియున్నవన్నియు స్టేటు సెక్రటరీ కౌన్సిలువారిచే చేయబడినట్లే యెంచబడును.

(134 ఈశాసనములో వచ్చిన కొన్ని శబ్దముల నిర్వచనమిందు వ్రాయబడెను.)

135 ఈచట్టమునకు ఇండియాగవర్నమెంటు శాసనమని పేరు.

# అనుబంధము

## 1 వ భాగము.

### కొన్ని శాసనసభా నియమములు.

3 మదరాసు శాసనసభా నిర్మాణము:—

(1) కార్యనిర్వాహక సభ్యులందరును ఉద్యోగరీత్యా శాసనసభ్యు లగుదురు.

(2) ఎన్నిక సభ్యులు 98 మంది.

(3) (కార్యనిర్వాహక సభ్యులతో గలిసి) గవర్నరుగారిచే నియోజింప బడిన (నామినేటెడ్) సభ్యులు మొత్తము 29 మంది. ఇందు (ఎ) ప్రభుత్వోద్యోగులు 19 మందికంటె నధికముగా నుండరాదు. (బి) ఆరుమంది నీక్రింది విధముగా నియోజింపవలెను.

(i) పరయనులు, పల్లనులు, వల్లువనులు, మాదిగలు, మాలలు, చక్కిలి యనులు, తొట్టియనులు, మున్నగు నిమ్నజాతుల తరఫున 5 మందిని,

(ii) వెనుకబడిన ప్రదేశములలో నివసించువారకొక ప్రతినిధిని నియో జింపవలెను.

నిమ్నజాతులలో గవర్నరుగారి చిత్తమువచ్చిన సంఘమునుండి సభ్యుల నేరుకొనవచ్చును.

## 2 వ భాగము.

5 (1) ఈ క్రింద నుదహరించబడిన వారు ఎన్నికసభ్యులుగా నుండుట కనర్హులు.

(ఎ) బ్రిటిషు పౌరుడు కానివాడు.

(బి) స్త్రీలు,

(సి) ఇదివరకే కౌన్సిలు మెంబరుగా నున్నవాడుగాని, లేక యీచట్టము ప్రకారము మరియొక శాసనసభ్యుడుగా నున్నవాడుగాని,

(డి) కోర్టువారిచే తనవృత్తి జేసికొనకుండా డిస్మిస్‌గాని సస్పెంషన్‌గాని చేయబడినన్యాయవాదియు,

(ఇ) అస్వస్థచిత్తుడని కోర్టువారిచే నిర్ణయింపబడినవాడును,

(ఎఫ్) ఇరువదియైదు సంవత్సరములలోపు వయస్సు గలవాడును,

(జి) విడుదలకాని దివాలాకోరును, (హెచ్) విడుదలైన దివాలాకోరు, దుష్ప్రవర్తనచే గాక దురదృష్టముచే తనకు దివాలా తటస్థించినదని

కోర్టువారిచే సర్టిఫికెట్టు పొందని యెడలను,

ఈ పైన (డి) సెక్షన్‌లోని దోషమును గవర్నమెంటువారు రద్దుచేయ వచ్చును.

(2) ఒక క్రిమినల్‌కోర్టులో ద్వీపాంతరవాస శిక్షగాని, ఆరుమాసములకు మించిన ఖైదుగాని విధింపబడినవాడు, ప్రభుత్వముచే క్షమింపబడని యెడల, శిక్షానంతర మయిదు సంవత్సరములవరకు ఎన్నికకు నర్హుడు కాడు.

3 వ భాగము.

(7) (1)(ఎ) బ్రిటిషుపౌరుడు కానివాడు, (బి) స్త్రీ (సి) అస్వస్థచిత్తుడు (డి) 21 సంవత్సరముల వయస్సులోపువాడు.

(2) ఆరుమాసములకు మించిన ఖైదుబొందినవాడు, వోటరుగా నుండరాదు.

4 వ భాగము

(17) ఎన్నికల ఫలితమును బ్రకటించినతరువాత నెలలోపుగ ప్రతిసభ్యర్థియు, తప్పీలుగా వ్రాసిన తన ఎన్నికఖర్చులజాబి తాను ప్రమాణపూర్వకముగా ధృవపరచుచు, ప్రభుత్వమువారికి బంపుకొనవలెను.

5 వ భాగము.

(20) 2 వ భాగములోని 5 వ నియమము ప్రకారము ఎన్నికసభ్యుడుగా నుండుటకే యనర్హతలు సూచింపబడినవో, అవియే నియోజిత సభ్యునియెడల గూడ వర్తించును.

6 వ భాగము.

(22) ప్రతిశాసనసభ్యుడును ఎన్నుకొనబడినను, నియోజితుడైనను, శాసనసభలలో తనస్థానము నాక్రమించుకొనుటకు ముందు చక్రవర్తిగారియెడల తనకుగల విశ్వాసమును దెలుపుచు నీ క్రింది విధముగా ప్రమాణపత్రమును సభాసమావేశములో నొసంగవలెను.

ప్రమాణపత్రము :—

"ఫలానియల్లయ్య అను నేను ఈ సభకు ఎన్నికసభ్యుడుగా లేక నియోజితుడుగా వచ్చితిని, గనుక ఇండియాదేశపు చక్రవర్తిగారి యెడలను, శ్రీవారి వారసుల, స్థానీయుల, యెడలను, నిజమైన విశ్వాసముగలవాడనై, నేనిపుడంగీకరింపబోవు ధర్మమును, విశ్వాసముతో నిర్వహింతునని యిందుమూలమున ఈశ్వర సాక్షిగా ప్రమాణము జేయుచున్నాను"

## 8 వ భాగము.

మదరాసు శాసనసభా యెన్నికసభ్యుల విభాగమీక్రింది విధముగా నుండవలెను. ఇందు ప్రత్యేకస్థానములను నవి బ్రాహ్మణేతరులకు ప్రత్యేక ప్రాతినిధ్యము క్రింద లభించినవి.

### సామాన్య ప్రాతినిధ్యము.

(3) యిరోపియనుడు, ఆంగ్లో యిండియను, దేశీయ క్రైస్తవుడు, మహమ్మదీయుడు, కాని వారందరు నీక్రింది నియమములననుసరించి మహమ్మదీయేతర యెన్నిక ప్రదేశమునందు వోటరుగా నుండవచ్చును. తాను వోటీయదలచుకొన్న ప్రదేశములో నా క్రిందటి సంవత్సరమున 120 దినములకు తక్కువలేకుండ నివసించి యుండవలెను.

(4) మద్రాసునగరములో వోటరుగానుండు వానికీక్రింది యోగ్యతలలో నొకటియైన నుండవలెను. (ఎ) ఆక్రిందటిసంవత్సరమువృత్తి పన్నుగాని ఆస్తిపన్నుగానియిచ్చినవాడును,

(బి) క్రిందటిసంవత్సరము, సంవత్సరమునకు 60 రూపాయలకు తక్కువ గాని అద్దెయిచ్చేయింట్లో కాపురముండినవాడను,

(సి) ఆక్రిందటివత్సరము ఆదాయపుపన్ను చెల్లించినవాడును,

(డి) చక్రవర్తిగారి సైనికసేవలో నుండి ఫించను పుచ్చుకొనినట్టిగాని, విడుదల చేయబడినట్టిగాని యారోగుడు లేక సైనికోద్యోగి.

(5) మద్రాసుకాని తక్కిన పట్టణములలోనుండు వోటర్లకు నుండవలసిన యోగ్యతలు:—

(ఎ) క్రిందటి సంవత్సరము మొత్తమున మూడురూపాయలకు తక్కువలేని ఆస్తిపన్నుగాని. వృత్తిపన్నుగాని, కంపెనీపన్నుగాని, చెల్లించియుండవలెను లేదా,

(బి) సాధారణపు వోటరుతోపాటు భూవసతి యుండవలెను. లేదా, మదరాసు వోటరువలె తక్కిన యోగ్యతలలో నేదైన నుండవలెను.

(6) గ్రామప్రాతినిధ్యములోని (సాధారణ) వోటరుయొక్క లక్షణము లీక్రిందివిధముగా నుండవలెను.

(ఎ) సాలుకు పదిరూపాయలకు తక్కువలేనిశిస్తు నిచ్చే భూవసతి గలిగిన రైతువారీ పట్టాదారుడుగాని, లేక యీనాందారుడుగాని, లేక

(బి) సాలుకు పదిరూపాయలకు తక్కువలేని శిస్తునిచ్చే భూమిని, రైతువారీ పట్టాదారుని యొద్దనో, యీనాందారువద్దనో, రిజిష్టరు కవులు ద్వారా అనుభవమునకు దీసికొనినవాడుగాని, లేక

(డి) సాలుకు పదిరూపాయలకు తక్కువలేని అమరకము వచ్చే భూమిని సాగుచేయువాడుగాని, లేక తక్కిననియమములు మదరాసు వోటరుతో సమానముగా నున్నవాడుగాని, సామాన్యవోటరుగా నుండవచ్చును.

## మహమ్మదీయ ప్రత్యేక ప్రాతినిధ్యము.

పల్లెటూరులోగాని బస్తీలోగాని యుండే యొక మహమ్మదీయవోటరు ఆక్రిందటి సంవత్సరమున కనీసము 120 దినములకు తక్కువలేకుండా ఆప్రదేశములో నివసించినవాడును, మదరాసు వోటరుతో పాటుగాని, సామాన్యవోటరుతో పాటుగా గాని, తక్కిన యోగ్యతలలో నేదయినను గలిగియుండవలెను.

దేశీయక్రైస్తవ ప్రత్యేకప్రాతినిధ్య విషయములోగూడ నిట్లే వోటరు క్రైస్తవుడై తక్కిన యోగ్యతలుగలవాడై యుండవలెను.

ఒకఆస్తి యొక సమిష్టికుటుంబమునకు గాని జాయింటు పట్టాదారులకు గాని జెందియున్నపుడు వారిలో బహుజనులచే నంగీకరింపబడినవాడుగాని, కుటుంబయజమానిగాని, వోటరుగానుండుట కర్హుడు.

## జమీందారీప్రాతినిధ్యము,

ఒక జమీందారీవోటరు (లాండుహోల్డరులేకభూస్వామి) తాను వోటిచ్చే ఎన్నికప్రదేశమున నాక్రిందటి సంవత్సరములో 120 దినములకు తక్కువ లేకుండా కాపురముండినవాడై యీ క్రింది యోగ్యతలలో నేదైన నొకటి గలిగియుండవలెను.

(ఎ) మదరాసురాష్ట్రములో సాలుకు 3 వేలరూపాయలకు తక్కువలేని రాబడివచ్చే యస్టేటుదారుడుగాని లేక,

(బి) మదరాసు రాజధానిలో 1500 రూపాయలకు తక్కువలేని శిస్తు చెల్లించే భూమిఖామందుగాని, లేక

(సి) సాలుకు 3 వేల రూపాయలకు తక్కువలేని జీవితభృతిని (అలవెన్సు) ప్రభుత్వమువారి యొద్దనుండి దీసికొనువాడుగాని,

## విశ్వవిద్యాలయపు ప్రాతినిధ్యము.

23 ఇండియాదేశములో నివాసముగలవాడై, సెనేటుసభ్యుడుగాని, లేకవిశ్వవిద్యాలయమునకు జెందిన గౌరవ విద్వాంసుడుగాని (Honorary fellow) లేక ఏడుసంవత్సరములకు మించిన యనుభవముగల మదరాసు విశ్వవిద్యాలయపు పట్టపరీక్షలో నుత్తీర్ణుడైనవాడుగాని (Graduate) వోటరుగా నుండవచ్చును.

## శాసనసభలు.

10 శాసనసభలలో నొక ప్రశ్న యడిగినతరువాత విశేషాంశములను తెలిసికొనుటకై సభ్యులింకొక యనుబంధప్రశ్ననుగూడ వేయవచ్చును.

13 శాసనసభలకు 30 మందిసభ్యులు హాజరయినయెడల సభా వ్యవహారములను నిర్వర్తించుట కవసరమయిన అన్యూనసంఖ్య లేక కోరం అగును.

14 సభా వ్యవహారములన్నియు నింగ్లీషు భాషలోనే జరుగవలెను. ఇంగ్లీషుభాష ధారాళముగా మాట్లాడజాలని యొకసభ్యుడు ఆరాష్ట్రములోని యేదేశభాషలో నైన సభాపతియనుజ్ఞతో మాట్లాడవచ్చును.

గవర్నరుగారు శాసనసభా విచారణలోనున్న యొక బిల్లునుగాని, అందలి భాగముగాని యొక సవరణగాని తనరాష్ట్రముయొక్క క్షేమశాంతములకు భంగకరమని నమ్మి వ్రాతమూలముగా ధృవపరచినయెడల (Certify) దానిని గురించి జరుగుచున్న విచారణ విమర్శనలన్నియు నంతటితో నాగిపోవలెను.

24 శాసనసభ వారంగీకరించిన ప్రతితీర్మానయొక్క నకలును గవర్నమెంటువారికి పంపవలెను. గవర్నమెంటువా రాతీర్మానమును శిఫారసుగా మాత్రమే భావింతురు.

ప్రతిసమావేశముయొక్క మొదటిగంటలో ప్రశ్నోత్తరములకు వీలుండును. శాసనసభలో నడుగుప్రశ్నలకు ముందుగా కనీసము ఏడురోజులు గడువుండవలెను.

ఏదైనా ప్రశ్నగాని, బిల్లుగాని, తీర్మానముగాని, సభలో ప్రవేశపెట్టకుండా సభాపతిగాని గవర్నరుగాని యభ్యంతర పెట్టవచ్చును.



| ప్రదేశము | తరగతి | ప్రదేశవిస్తీర్ణత | | సభ్యుల సంఖ్య | ప్రత్యేక స్థానములు |
|---|---|---|---|---|---|
| మద్రాసునగరము | పట్టణవాసులగు మహమ్మదీయేతరులు | మద్రాసునగరమంతయు (16553)* | ... | 4 | 2 |
| మధురనగరము | ,, | మధుర మ్యునిసిపాలిటి (6583) | ... | 1 | ,, |
| తిరుచునాపల్లి శ్రీరంగములు | ,, | తిరుచునాపల్లి శ్రీరంగముల మ్యునిసిపాలిటీలు (4507) | ... | 1 | ,, |
| కాకినాడ నగరము | ,, | కాకినాడ మ్యునిసిపాలిటీ (1287) | ... | 1 | ,, |
| విశాఖపట్టణ నగరము | ,, | విశాఖపట్టణపు మ్యునిసిపాలిటీ(992) | ... | 1 | 1 |
| తిరునల్వేలి, పాలంకోట | ,, | తిన్నెవేలి, పాలంకోట మ్యునిసిపాలిటీలు (3156) | | 1 | 1 |
| అనంతపురము | గ్రామనివాసులగు మహమ్మదీయేతరులు | అనంతపురముజిల్లా (23199) | ... | 2 | 1 |
| ఉత్తరార్కాడు | ,, | ఉత్తరార్కాడుజిల్లా (8686) | ... | 3 | 1 |
| దక్షిణార్కాడు | ,, | దక్షిణార్కాడుజిల్లా (58970) | ... | 3 | 1 |
| బళ్లారి | ,, | బళ్లారిజిల్లా (27376) | ... | 2 | 1 |
| చెంగల్పట్టు | ,, | చెంగల్పట్టుజిల్లా (43426) | ... | 2 | 1 |
| చిత్తూరు | ,, | చిత్తూరుజిల్లా (39897) | ... | 2 | 1 |
| కోయంబుత్తూరు | ,, | కోయంబుత్తూరుజిల్లా (57075) | ... | 3 | 1 |
| కడప | ,, | కడపజిల్లా (25156) | ... | 2 | 1 |
| గంజాము | ,, | గంజాము ఏజన్సీజిల్లాలుకలిసి(65761) | ... | 3 | 1 |

| ప్రదేశము | తరగతి | ప్రదేశవిస్తీర్ణత | | సభ్యుల సంఖ్య | ప్రత్యేక స్థానములు |
|---|---|---|---|---|---|
| గోదావరి | ,, | కాకినాడ మ్యునిసిపాలిటీ మినహా ఏజన్సీలు కలిసి గోదావరి జిల్లా (44281) | ... | 2 | 1 |
| గుంటూరు | ,, | గుంటూరుజిల్లా (83014) | ... | 3 | 1 |
| దక్షిణకనరా | ,, | దక్షిణ కనరాజిల్లా (21739) | ... | 2 | 1 |
| కృష్ణ | ,, | కృష్ణాజిల్లా (87669) | ... | 4 | 2 |
| కర్నూలు | ,, | కర్నూలుజిల్లా (27666) | ... | 2 | 1 |
| మధుర | ,, | మధురజిల్లా (మధురనగరపు మ్యునిసిపాలిటీగాక) (65489) | ... | 3 | 1 |
| మలబారు-అంజంగోలు | ,, | మలబారు అంజన్గోజిల్లాలు (26901) | ... | 2 | 1 |
| నెల్లూరు | ,, | నెల్లూరుజిల్లా (51795) | ... | 2 | 1 |
| రామనాథం | ,, | రామనాథంజిల్లా (46689) | ... | 2 | 1 |
| సేలము | ,, | సేలముజిల్లా (59323) | ... | 2 | 1 |
| తంజావూరు | గ్రామనివాసులగు మహమ్మదీయేతరులు | తంజావూరుజిల్లా (54733) | | 3 | 1 |
| తిరునల్వేలి | ,, | తిరునల్వేలి, పాలముకోట మ్యునిసిపాలిటీలుమినహా జిల్లామొత్తమున (44110) | ... | 2 | 1 |
| తిరుచునాపల్లి | ,, | (తిరుచునాపల్లి శ్రీరంగముల మ్యునిసి పాలిటీలు మినహా) మిగిలిన జిల్లా (45445) | ... | 2 | 1 |

| ప్రదేశము | తరగతి | ప్రదేశవిస్తీర్ణత | సభ్యుల సంఖ్య | ప్రత్యేక స్థానములు |
|---|---|---|---|---|
| విశాఖపట్టణము | ,, | మ్యునిసి పాలిటీగాక విశాఖ పట్టణపు జిల్లా ఏజన్సీ కలిసి (70628) ... | 2 | 1 |
| నీలగిరి | ,, | నీలగిరిజిల్లా (1291) ... | 1 | 1 |
| మద్రాసునగరము (మహమ్మదీయులు) | పట్టణవాసపు మహమ్మదీయులు | మద్రాసు నగరమంతయు ... | 1 | ,, |
| మధుర తిరచునాపల్లి శ్రీరంగములు | ,, | మధుర, తిరుచునాపల్లి, శ్రీరంగముల మ్యునిసిపాలిటీలు ... ... | 1 | ,, |
| ఉత్తర సర్కార్లు (మహమ్మదీయులు) | గ్రామనివాసులగు మహమ్మదీయులు | గంజాము, విశాఖపట్టణము, గోదావరిజిల్లాలు ... ఏజన్సీలు, కృష్ణాజిల్లాయు గలిసి ... | 1 | ,, |
| తూర్పు తీరము (మహమ్మదీయులు) | ,, | గుంటూరు, నెల్లూరు, చిత్తూరుజిల్లాలు ... | 1 | ,, |
| దత్తమండలములు | ,, | కడప, కర్నూలు, బళ్లారి, అనంతపురము జిల్లాలు | 1 | ,, |
| ఉత్తర ఆర్కాడు చెంగల్పట్టు | ,, | ఉత్తర ఆర్కాడు, చెంగల్పట్టు జిల్లాలు ... | 1 | ,, |
| మధ్యజిల్లాలు (మహమ్మదీయులు) | ,, | సేలము, కోయంబత్తూ, నీలగిరి, దక్షిణ ఆర్కాడు జిల్లాలు ... | 1 | ,, |
| తంజావూరు మహమ్మదీయులు | ,, | తంజావూరుజిల్లా ... ... | 1 | ,, |
| మధుర, తిరుచునాపల్లి | పట్టపట్టణవాసులు | మధుర, తిరుచినాపల్లి, శ్రీరంగములమ్యునిసిపాల్టీలు గాక | | |

| ప్రదేశము | తరగతి | ప్రదేశవిస్తీర్ణత | సభ్యుల సంఖ్య | ప్రత్యేక స్థానములు |
|---|---|---|---|---|
| | అయిన మహమ్మదీయులు) | జిల్లా మొత్తముమీద ... | 1 | ,, |
| రామనాథ్ తిరునల్వేలి | ,, | రామనాథ్ తిన్నెవేలి జిల్లాలు ... ... | 1 | ,, |
| మలబారు అంజన్గో | ,, | మలబారు అంజన్గో జిల్లాలు ... ... | 2 | ,, |
| దక్షిణకన్నడ | ,, | దక్షిణ కన్నడ జిల్లా ... ... | 1 | ,, |
| ఉత్తర జిల్లాలు | భారతీయ క్రైస్తవులు | గంజాము, విశాఖపట్టణము, గోదావరిజిల్లాలు ఏజన్సీలును, కృష్ణా, గుంటూరు, నెల్లూరుజిల్లాలు | 1 | ,, |
| మధ్యజిల్లాలు | ,, | కడప, కర్నూలు, బళ్లారి, అనంతపురము, చిత్తూరు, చెంగల్పట్టు మద్రాసు, దక్షిణఆర్కాడు ఉత్తరఆర్కాడు జిల్లాలు ... ... | 1 | ,, |
| పడమటితీరము | ,, | సేలము, కోయంబుత్తూరు, నీలగిరి, మలబారు, అంజన్గో, దక్షిణ కన్నడజిల్లాలు ... ... | 1 | ,, |
| తంజావూరు, తిరుచునాపల్లి మధుర, | ,, | తంజావూరు, తిరుచునాపల్లి,మధురజిల్లాలు ... | 1 | ,, |
| రామనాథ్, తిన్నెవేలి, | | రామనాథ్ తిరునల్వేలిజిల్లాలు | 1 | ,, |
| ఐరోపియనులకు | ఐరోపియనులు | మద్రాసు రాష్ట్రమంతయును ... ... | 1 | ,, |
| ఆంగ్లోయిండియనులకు | ఆంగ్లోయిండియనులు | ,, ... ... | 1 | ,, |

| ప్రదేశము | తరగతి | ప్రదేశవిస్తీర్ణత | సభ్యుల సంఖ్య | ప్రత్యేక స్థానములు |
|---|---|---|---|---|
| 1 ఉత్తరజిల్లాల భూస్వాములు | జమీందారులు | గంజాము, విశాఖపట్టణజిల్లాలు ... ... | 1 | ,, |
| 2 ,, | ,, | గోదావరిజిల్లా, ఏజన్సీలు; కృష్ణా గుంటూరుజిల్లాలు | 1 | ,, |
| ఉత్తర మధ్యజిల్లాలు | ,, | చిత్తూరు, కడప, కర్నూలు, బళ్లారి, అనంతపురము, నెల్లూరు, మద్రాసు, చెంగల్పట్టుజిల్లాలు ... | 1 | ,, |
| దక్షిణ మధ్యజిల్లాలు | ,, | సేలము, కోయంబత్తూరు, ఉత్తరఆర్కాడు, దక్షిణఆర్కాడు జిల్లాలు ... ... ... | 1 | ,, |
| దక్షిణ జిల్లాలు | ,, | తంజావూరు, తిరుచునాపల్లి, మధుర, రామనాథ్ తిన్నేవేలి జిల్లాలు ... ... ... | 1 | ,, |
| పడమటితీరము | ,, | మలబారు, అంజన్గో, దక్షిణకన్నడ, నీలగిరి, జిల్లాలు | 1 | ,, |
| | | స్థలనిర్ణయములేనివి. | | |
| మద్రాసు విశ్వ విద్యాలయము- విశ్వవిద్యాలయము | | ,, ... ... ... | 1 | ,, |
| మద్రాసుతోట యజమానులు - తోటకూలీలు | | ,, ... ... ... | 1 | ,, |
| Chamber of commerce | మద్రాసు వర్తక సంఘము | ,, ... ... ... | 2 | ,, |
| మద్రాసువర్తక సంఘము | | ,, ... ... ... | 1 | ,, |
| దక్షిణయిండియావర్తకసంఘము | | ,, ... ... ... | 1 | ,, |
| నాటు కోటిశెట్లు | | ,, ... ... ... | 1 | ,, |

సరా:— ఈపైన కుండలీ కరణము ( * ) లోనున్న యంకెలు గడచిన యెన్నికలకు తయారుచేసిన పట్టీదాఖలా ఆయా ప్రదేశములలోనున్న వోటరులమొత్తమును దెలియ జేయును. ఇది మద్రాసుశాసనసభ్యులపట్టీ.

## ఇండియా గవర్నమెంటువారి ఖర్చుల జాబితా.

| | 1919–1920 సం॥ సరియైనలెఖ | 1920-21 వ సం॥ పు రెండవసారి బడ్జెటు | 1921–1922 సం॥ అంచనా |
|---|---|---|---|
| | రు. | రు | రు |
| వ్యయము:— | | | |
| ఆదాయమునుండి ఖర్చగు ముఖ్యమైన పద్దులు ... ... | 3,50,93,737 | 3,90,96,000 | 4,93,51,000 |
| ఇనుపదారులు, వడ్డీ మొదలగు చిల్లరఖర్చులు ... ... | 17,95,97,900 | 21,13 94,000 | 23,17,13,000 |
| వ్యవసాయము ... ... ... ... ... | 18,18,368 | 11,97,000 | 11,76,000 |
| పోస్టు, టెలిగ్రాములు (తపాలా, తంతి)... ... ... | 60,13,961 | 1,73.40,000 | 98,02,000 |
| దేశఋణములు ... ... ... ... ... | 13,58,92,647 | 13,77,38,000 | 13,08,61,000 |
| సివిల్ పరిపాలన ... ... ... ... | 8,00,04,809 | 9,18,96,000 | 8,43,18,000 |
| కరెన్సీ, టంకసాల, మారకము ... ... ... | 96,50,031 | 3,77,66,000 | 4,18,80,000 |
| కట్టడములు, రహదార్లు, చిల్లరపనులు ... ... ... | 1,49,89,301 | 1,78,15,000 | 1,51,11,000 |
| ఇతర బాపతులు.... ... ... | 3,99,99,390 | 4.52,34,000 | 4,24,37,000 |
| నిక వ్యయము | 87,25,32,243 | 74,36,79,000 | 66,31,10,000 |
| రాష్ట్రీయ ప్రభుత్వములతో లెక్కలు సరిజూచుకొన్న బాపతు | 63,24,000 | 63,24,000 | 62,84,000 |
| మొత్తముఖర్చు. ... ... | 1,38,19,16,487 | 1,34,94,69,000 | 1,27,60,43,000 |
| నాదుహెచ్చు. ... ... | ... | ... | 71,00,000 |
| మొత్తము. ... ... | 1,38,19,16,487 | 1,34,94,69,000 | 1,28,31,43,000 |

## ఇండియా గవర్నమెంటువారి ఆదాయపు జాబితా.

| రాబడి (ముఖ్యమైనవి):— | 1919-1920 సం॥ సరియైనలెక్క | 1920-1921 వసం॥ రెండవసారి అంచనా | 1921-1922వ సం॥ బడ్జటు అంచనా |
|---|---|---|---|
| | రు. | రు. | రు. |
| ఎగుమతి దిగుమతి పన్నులు. ... ... ... ... | 21,46,69,935 | 32,37,80,000 | 37,73,28,000 |
| ఆదాయపు పన్ను. ... ... ... ... | 22,43,41,180 | 19,77,78,000 | 18,58,07,000 |
| ఉప్పు పన్ను. ... ... ... ... ... | 5,70,83,914 | 6,14,93,000 | 7,00,66,000 |
| నల్లమందుమీద పన్ను. ... ... ... ... | 4,55,61,793 | 3,62,31,000 | 3,72,85,000 |
| ఇతర బాపతులు. ... ... ... ... | 2,28,51,068 | 2,34,01,000 | 2,44,80,000 |
| మొత్తము. ... | 56,45,07,890 | 64,26,83,000 | 69,49,66,000 |
| రైల్లు (నికరాదాయము.) ... ... ... ... | 31,76,99,344 | 25,69,32,000 | 27,25,63,000 |
| మాగాని సేద్యము నికరాదాయము. ... ... ... | 4,77,574 | 4,23,000 | 4,24,000 |
| తపాలాతంతుల నికరాదాయము. ... ... ... | 2,95,81,944 | 1,68,64,000 | 2,08,74,000 |
| ఋణములు. డొ ... ... ... | 4,22,99,265 | 3,74,30,000 | 3,49,09,000 |
| సివిల్ పరిపాలన. ... ... ... ... | 62,16,507 | 75,08,000 | 76,35,000 |
| కరెన్సీ, టంకశాల, మారకము. ... ... ... | 5,71,29,369 | 2,86,06,000 | 49,73,900 |
| కట్టడములు రహదా చిల్లరబాపతులు. ... ... | 10,04,444 | 11,42,000 | 10,38,000 |

## ఇండియా గవర్నమెంటువారి ఆదాయపు జాబితా

| | 1919-1920 సం॥ సరియైనలెఖ్ఖ | 1920-1921 వ సం॥ రెండవసారి అంచనా | 1921-1922వ సం॥ బడ్జెటుఅంచనా |
|---|---|---|---|
| ఇతరబాపతులు. ... ... ... ... | 1,74,58,075 | 2,13,00,000 | 7,52,76,000 |
| సైనికాదాయము. ... ... ... ... | 3,90,52,245 | 3,37,02,000 | 4,11,10,000 |
| రాష్ట్రప్రభుత్వము లొసంగు విరాళములు. ... ... | 9,83,00,000 | 9,83,00,000 | 12,93,75,000 |
| వెరశిరాబడి | 1,17,37,26,657 | 14,48,90,000 | 1,28,31,43,000 |
| తరుగు | 20,81,89,830 | 20,45,79,000 | |
| మొత్తము రు | 138,19,36,487 | 1,34,94,69,000 | 1,28,31,43,000 |



## కారాగృహములు.

ఈ దేశములోని కారాగృహములలో నెంతమంది ఖైదీలకు సరిపోవు నివాస సౌకర్య మున్నదో యీ క్రిందిపట్టీవలన దెలియునగును:—

| | | | |
|---|---|---|---|
| 1 | మద్రాసురాజధానిలోని జైళ్లలో మొత్తము | 12350 | మందికి |
| 2 | బొంబాయి ... ... | 7393 | ,, |
| 3 | బంగాళము ... ... | 15740 | ,, |
| 4 | ఆగ్రా అయోధ్య సంయుక్తపరగణాలు | 34219 | ,, |
| 5 | పంజాబు ... ... | 14687 | ,, |
| 6 | బర్మా ... ... | 18542 | ,, |
| 7 | బీహారు.ఒరిస్సా ... ... | 10777 | ,, |
| 8 | మధ్యపరగణాలు | 6990 | ,, |
| | వెరశి | 1,20,698 | మంది |

దేశముమొత్తమున సుమారు ఒకలక్ష ఇరువదివేలమంది ఖైదీలకుమాత్రమే జైళ్లలో నివసించదగిన యవకాశ మున్నదికావున అసహాయవాదు లెందరు ఖైదుకువెళ్లితే స్వరాజ్యము లభించునో పాఠకులే లెక్కవేసికొనుడు.

ఒక్క కృష్ణాజిల్లాయొక్క జనసంఖ్య 16 లక్షలు. ఇందు శాసనసభ్యుల నెన్నుకొనదగిన వోటర్లు 87669 మంది గలరు.

---

## 1922-1923 వ సం॥ మదరాసురాష్ట్రపు అంచనా రాబడి

| | | | |
|---|---|---|---|
| 2 | ఆదాయపుపన్ను | రు 521000 | మొత్తము |
| 5 | భూమిపన్ను | 64074000 | |
| 6 | ఎగుమతిపన్నులు | 48270000 | |
| 7 | స్టాంపులు | 25800000 | రు 147855000 |
| 8 | అటవీశాఖ | 5409000 | |
| 9 | రిజిస్ట్రేషనువలని ఆదాయము | 3782000 | |

## పంటకాల్వలు, పడవలకాల్వలు, వానికట్టలు

| | | | |
|---|---|---|---|
| 13 | ప్రత్యేకమూలధనముతో ప్రారంభించినపనులు | రు 8373000 | రు 8541000 |
| 14 | ప్రత్యేకమూలధనములేని మామూలుపనులు | 168000 | |

| | ఋణములు. | | మొత్తము. |
|---|---|---|---|
| 16 | వడ్డీ | రు 898000 | |

## సివిల్ పరిపాలన.

| | | | |
|---|---|---|---|
| 17 | న్యాయపరిపాలన ... | రు 973000 | |
| 18 | కారాగృహములు ... | 850000 | |
| 19 | పోలీసు ... | 748000 | |
| 20 | రేవుస్థానములు మొదలైనవి | 1000 | |
| 21 | విద్యాశాఖ ... ... | 632000 | |
| 22 | వైద్యశాఖ ... ... | 295000 | రు 5434000 |
| 23 | ప్రజారోగ్యము ... ... | 22000 | |
| 24 | వ్యవసాయము ... ... | 1384000 | |
| 25 | చేతిపనులు ... ... | 244000 | |
| 26 | తదితరశాఖలు | 285000 | |
| 30 | సివిల్ వర్క్సు ... ... | | రు 541000 |

## ఇతర బాపతులు.

| | | | |
|---|---|---|---|
| 33 | వార్ధక్యభృతి | రు 334000 | |
| 34 | అచ్చుఖర్చులు వగైరా సాదరు | 178000 | 609000 |
| 35 | ఇతరబాపతులు | 97000 | |

| | |
|---|---|
| కేంద్రప్రభుత్వమునుండి | 395000 |
| ఋణములు, డిపాజిట్సు, అడ్వాన్సులు | 16019000 |
| అసలు మొత్తము రు | 1,80,293,000 |

## 1922-1923 వ సం॥పు చెన్నరాష్ట్రపు వ్యయపు అంచనా.

| | | | మొత్తము |
|---|---|---|---|
| 5 | భూమి పన్ను | రు 17892000 | |
| 6 | ఎగుమతిపన్నులు | 3261000 | |
| 7 | స్టాంపులు | 676000 | రు 29048000 |
| 8 | అడవులు | 4911000 | |
| 9 | రిజిస్ట్రేషను | 2308000 | |

### పంటకాల్వలు, వానికట్టలు మొదలైనవి

| | | | |
|---|---|---|---|
| 14 | ప్రత్యేకమూలధనముతో ప్రారంభించిన సొమ్ముమీదివడ్డి | రు 3832000 | రు 7404000 |
| 15 | | 3572000 | |
| 16 | పంటకాల్వలు వానికట్టలు మొదలగుపనులకు | | రు 48000 |

### ఋణములు.

| | | | |
|---|---|---|---|
| 19 | సాధారణఅప్పుమీదవడ్డి | 712000 | రు 713000 |
| 20 | ఇతరఋణములవడ్డి | 1000 | |

### సివిల్ శాఖ.

| | | | |
|---|---|---|---|
| 22 | సాధారణపరిపాలన | రు 9176000 | |
| 24 | న్యాయపరిపాలన | 9706000 | |
| 25 | జైళ్లు | 3532000 | |
| 26 | పోలీసు | 19503000 | |
| 27 | కోటలు | 106000 | |
| 30 | శాస్త్రశాఖలు | 183000 | |
| 31 | విద్య | 16149000 | రు 734[illegible]000 |
| 32 | వైద్యము | 5751000 | |
| 33 | ప్రజాసౌఖ్యము | 2860000 | |
| 34 | వ్యవసాయము | 3171000 | |
| 35 | పరిశ్రమలు | 2230000 | |
| 37 | ఇతరశాఖలు (మొత్తముగా) | 1129000 | |

మొత్తము

## కరెన్సీ, టంకసాల.

| | | | |
|---|---|---|---|
| 40 | మారకము ... ... ... | | 16,52,000 |
| 41 | సివిల్ పనులు. ... ... ... | | 1,15,72,000 |

## ఇతర బాపతులు.

| | | | మొత్తము. |
|---|---|---|---|
| 43 | కరువు బత్తెములు ఇన్సూరు ... | 652000 | |
| 45 | ఫించనులు; వార్ధక్యభృతి. ... | 4632000 | |
| 46 | అచ్చువగైరా సాదరు.... ... | 2836000 | |
| 47 | ఇతరబాపతులు (మొత్తముగ) ... | 1626000 | |
| | మొత్తము. ... ... | | 9746000 |
| 51 | కేంద్ర ప్రభుత్వమునకు విరాళము ... | 34800000 | |
| 52 | | | |
| | మొత్తము వ్యయము. | | 168479000 |

| | | |
|---|---|---|
| 55 | పంటకాల్వలు పడవకాల్వలు ... ... | 1251000 |
| | అప్పులు, అడ్వాన్సులు. ... ... | 10211000 |
| | చివరకునిల్వ నగదు. ... ... | 3,52,000 |
| | అసలు మొత్తము. వ్యయము. | 180293000 |



## —♦ రిజర్వుడు సబ్జక్ట్సు ♦—

(1) మాంటెగ్ సర్దువిధానము ననుసరించి రాష్ట్రీయ ప్రభుత్వములో గవర్నమెంటు లేక కార్యనిర్వాహక వర్గమువారి యధీనమందుంచుకొనిన పరిపాలనా శాఖలు. వీనికే రిజర్వుడు సబ్జక్ట్సు అని పేరు:—

(7) జలదార్లు, మాగాని, కాలువలు, మురుగు, కట్టలు, నీటిని నిలువజేయుట, జలశక్తి మున్నగునవి రాష్ట్రాంతర సంబంధముగల విషయములలో మాత్రము (యిండియా గవర్నమెంటువారి శాసనము ప్రకారము)

(8) భూమిశిస్తు పరిపాలన (a) భూమి సిస్తు విధించుట, వసూలుచేయుట (b) భూమి సంబంధమైన రికార్డులను, హక్కులనుగూర్చిన రికార్డులను భద్రము జేయుట, భూముల మసాయతు, రైతులు, భూస్వాములు, శిస్తు వసూళ్ళు మున్నగువానినిగూర్చిన చట్టములు, (c) కోర్టు ఆఫ్ వార్డ్సు (Court of Wards) ప్రభుత్వమునకు వప్పగించిన యస్టేట్లు, సేద్యాభివృద్ధి, వ్యవసాయ ఋణములు, గవర్నమెంటు భూముల నమ్ముట యిచ్చివేయుట, గవర్నమెంటు యెస్టేటును పరిపాలించుట.

(9) క్షామవిమోచన.

(15) * భూమిని వశపరచుకొనుట.

(17) న్యాయవిచారణ (సివిల్ క్రిమినల్ కోర్టులనిర్మాణాధికారనిర్వహణాదులు.)

(18) రాష్ట్రీయ శాసన నివేదికలు (Law reports)

(19) * అడ్మినిస్ట్రేటర్ జనరలు, అఫిషియల్ ట్రస్టీలు.

(20) * న్యాయవిచారణకు సంబంధములేని స్టాంపులు,

(24) ఖనిజద్రవ్యాభివృద్ధి (స్టేటు సెక్రటరీగారు మంజూరుచేసిన నియమముల ప్రకారము)

(26) ఈక్రింద చేర్కొన్న పారిశ్రామికవిషయములు (1) ఫ్యాక్టరీలు, (2) కూలీలతగాదాల పరిష్కారము, (3) విద్యుచ్ఛక్తి, బాయిలర్లు గ్యాసు, పొగవలనియిబ్బంది, పాటక జనులకు ప్రావిడెంటు ఫండు వగైరాలు.

(30) * ఓడరేవులు.

(31) * అంతర్దేశ జలమార్గములు.

(32) పోలీసు, రైల్వేపోలీసు,

(33) ఈక్రింది వివిధ విషయములు.

జేలును, జూదముల నియమములు, జంతుహింస నివారణ, ఆటవిక పక్షిమృగ

( 20 పేజీచూడుడు )

## —♦ ట్రాన్సుఫర్డు సబ్జక్టు ♦—

రాష్ట్రీయ ప్రభుత్వములో మంత్రుల యధీనము జేసిన ప్రజాయత్తపరిపాలనా శాఖలు. వీనికే ట్రాన్సుఫర్డు సబ్జక్టు అని పేరు;—

(1) స్థానిక స్వపరిపాలన అనగా పట్టణ నగరపాలక సంఘములు, తాలూకా జిల్లాబోర్డులు, మొదలయినవి, (కొన్ని ఋణము జేయుటలోను కొన్ని క్రొత్తపన్నులు విధించుటలోను మాత్రము మినహాగా)

(2) ఆసుపత్రులు; ఔషధాలయములు; శరణాలయములు; వైద్యవిద్య; మొదలగువానితో గూడిన వైద్యశాఖ.

(3) ప్రజారోగ్యము; (అంటువ్యాధులు, సాంక్రమిక వ్యాధుల విషయములో మాత్రము యిండియా గవర్నమెంటువారి శాసనానుగుణ్యముగ నుండవలెను.

(4) బ్రిటిషు యిండియాలోని యాత్రస్థానములు.

(5) ఈక్రింది మినహాయింపులతో విద్యాశాఖ.

(ఎ) (కాశీ విశ్వవిద్యాలయము; యిండియా గవర్నమెంటువారు తమయాధీనములో జేర్చుకొనినట్లు ప్రకటించిన మరియేదైన క్రొత్త విద్యాలయమును; సంస్థానాధిపతుల కళాశాల; చక్రవర్తిగారి సైన్యముల కొరకు గాని లేక ఉద్యోగుల బిడ్డలకొరకు గాని యిండియాగవర్నమెంటువారు పోషించుచున్న విద్యాలయములను మినహా)

(బి) యిండియా గవర్నమెంటువారి శాసనములకులోబడి.

(i) ఈశాసనానంతరము బయలుదేరెడి విశ్వవిద్యాలయముల విధాననిర్మాణములును, (ii) ఒక విశ్వవిద్యాలయమునకు మరియొక రాష్ట్రములో గల యధికార నిరూపణమును (iii) ఈశాసనానంతర మైదు సంవత్సరములకు కలకత్తా విశ్వవిద్యాలయమును, బంగాళ రాష్ట్రములోని మధ్యమ విద్యాపరిపాలనమును, మంత్రులయధికారములో నుండవచ్చును.

(6) ప్రజోపయోగ కార్యములు (Public Works) రహదార్లు, వంతెనలు, చిన్నరేవులు, సొరంగములు (Tunnels) మొదలగు ప్రయాణ సౌకర్యములును; మ్యునిసిపల్ హద్దులలోని ట్రామ్‌బండ్లు, చిన్నచిన్న తేలిక రైలు మార్గములు, పెద్ద రైలుదారికి కలియునట్టిగాని, దానిప్రక్కనే బోవునట్టిగాని శాఖారైలు మార్గములు.

(10) వ్యవసాయము. (పరిశోధన శాలలు నూతన ప్రయోగ ప్రదర్శన క్షేత్రము క్రొత్తమార్గములను పయోగించుట, వ్యవసాయ శాస్త్రాభ్యాసము యిండి

## రిజిర్వుడు సబ్జక్టు.

( 18 పేజీ తరువాయి )

సంరక్షణ * విషపదార్థములు, * మోటారుబండ్లు, * నాటకప్రదర్శనములు సినిమెటు గ్రాఫులు.

(34) * వార్తాపత్రికలు, పుస్తకములు, ముద్రాక్షరశాలలు.
(35) Coronars.
(36) మినహాయింపు ప్రదేశములు.
(37) * నేరములు జేయు హీనజాతులు,
(38) * ఐరోపియను ద్రిమ్మరులు
(39) * కారాగృహములు, ఖైదీలు (రాజకీయఖైదీలు గాక) సంస్కరణాలయములు. ( రిఫర్ మేటరీలు )
(40) బందెల దొడ్లువగైరా.
(41) Treasure trove.
(43) రాష్ట్రీయ ప్రభుత్వముల ముద్రణాలయములు.
(44) రాష్ట్రీయ శాసన సభల యెన్నికలు.
(45) * వైద్యము మొదలైన వృత్తులకు యోగ్యతా ప్రమాణ నిర్ణయములు.
(46) లోకల్ ఫండు లెఖ్ఖల తనిఖీ.
(47) * సామ్రాజ్య ప్రభుత్వోద్యోగులను, రాష్ట్రీయ ప్రభుత్వోద్యోగులను అజమాయిషీలో నుంచుకొనుట.
(48) ఇదివరలో వివరింపబడని రాష్ట్రీయాదాయములు.
(49) రాష్ట్రముయొక్క పరపతిమీద ఋణముచేయుట,
(50) రాష్ట్రీయశాఖలకు సంబంధించిన శాసనముల నదులు జరుపుటకు జరిమానా లేక ఖైదు విధించుట.
(51) & (52) కేంద్ర ప్రభుత్వముచే నొసంగబడిన లేక యధికారమిచ్చిన యేశాఖయైనను.

షరా:— * యీగుర్తుగల శాఖలను యిండియా గవర్నమెంటువారి శాసనాను గుణ్యముగ పాలించవలయును.



## ట్రాన్స్‌ఫర్డు సబ్జక్ట్సు
(21 పేజీ తరువాయి)

గవర్న్‌మెంటువారి శాసనములకు లోబడి తెగుళ్ళు, మిడతలు మొదలగు సస్యారిష్టములు)

(11) సివిల్ పశువైద్యశాఖ. (పశువైద్య శాస్త్రాభ్యాసము; పశుజాత్యభివృద్ధి యిండియా గవర్న్‌మెంటువారి శాసనములకు లోబడి పశుబాధ్య నివారణ.)

(12) చేపలు.

(13) సహకార సంఘములు (కోపరేటివ్)

(14) * అరణ్యములు మృగరక్షణ. (ప్రత్యేకముగ పెరగనిచ్చిన అరణ్యమునను ఛేదించు విషయము)

(16) యెక్సైజ్ పన్ను సారా మొదలైన మత్తుపదార్థముల యుత్పత్తి, తయారు రవాణా, కొనుబడి, అమ్మకము మొదలగు వానిపై పన్నులు విధించుట, లైసన్సులిచ్చుట.

(నల్లమందు విషయములో మాత్రము మినహా)

(21) * దస్తావేజులు పత్రములు మొదలగు వాని రిజిస్ట్రేషను.

(22) * జనన మరణ వివాహములను నమోదు (రిజిష్టరు) జేసికొనుట.

(23) మతధర్మాదాయములు.

(25) పరిశ్రమల యభివృద్ధి (పారిశ్రామిక పరిశోధన కర్మవిద్యలతో సహా)

(27) నిల్వసరుకు, వ్రాతసామగ్రి (విదేశములనుండి దిగుమతిచేయు వాని విషయములో స్టేటు సెక్రటరీ కౌన్సిలువారి నియమముల ప్రకారము.)

(28) * ఆహార పదార్థములు మున్నగు వానిలో కల్తీ.

(29) తూనికలు తూనికరాళ్ళు.

(42) గ్రంథాలయములు (యింపీరియల్ లైబ్రరీ తప్ప) చిత్రవస్తు ప్రదర్శనాలయములు (కొన్నిమ్యూజియములు తప్ప) జీవజంతుప్రదర్శనోపవనములు.

షరా:— * ఈగుర్తుగల శాఖలను యిండియా గవర్న్‌మెంటువారి శాసనాను గుణ్యముగ పాలించవలయును.



## 1920 వ సంవత్సరములో నేర్పడిన క్రొత్త శాసనసభలు.

| శాసన సభల పేర్లు. | | ఎన్నుకొనబడినవారు. | నియోజితులు లేక ఉద్యోగులు. | ప్రత్యేకముగా నియోజింపబడినవారు | మొత్తం సభ్యులు. |
|---|---|---|---|---|---|
| ఇండియా శాసన సభలు | సేటుకౌన్సిలు … | 34 | 26 | 3 | 60 |
| | లెజిస్లేటివు అసెంబ్లీ … | 104 | 40 | 19 | 144 |
| మదరాసు శాసనసభ … … | | 98 | 29 | 17 | 127 |
| బొంబాయి ” … … | | 86 | 25 | 13 | 111 |
| బెంగాలు ” … … | | 115 | 24 | 32 | 139 |
| యూపి ” … … | | 100 | 23 | 10 | 123 |
| పంజాబు ” … … | | 65 | 22 | 7 | 87 |
| బిహార్ ఒరిస్సా ” … … | | 76 | 27 | 10 | 103 |
| మధ్యరాష్ట్రములు ” … … | | 37 | 33 | 5 | 70 |
| అస్సాము ” … … | | 39 | 14 | 3 | 53 |



—♦ రాష్ట్రములవారిగా యిండిశాసనసభలకు ప్రజాప్రతినిధులుగా బంపబడు యెన్నిక సభ్యుల వివరము. ♦—

| రాష్ట్రములు. | ఎస్సెంబ్లీ | స్టేటుకౌన్సిలు |
| --- | --- | --- |
| మద్రాసు | 16 | 5 |
| బొంబాయి | 16 | 6 |
| వంగదేశము | 17 | 6 |
| సంయుక్తరాష్ట్రములు | 16 | 5 |
| పంజాబు | 12 | 4 |
| బీహారు ఒరిస్సాదేశములు | 12 | 3 |
| మధ్యరాష్ట్రములు | 6 | 2 |
| అస్సాము | 4 | 1 |
| బర్మా | 4 | 2 |
| ఢిల్లీ | 1 | 1 |
| ఎన్నికసభ్యుల మొత్తము. | 104 | 34 |

1920 వ సం. పు యెన్నికలకు తయారుజేసిన వోటర్ల జాబితా.

| రాష్ట్రము. | | | వోటర్ల మొత్తము. |
| --- | --- | --- | --- |
| 1 మద్రాసు | ... | ... | 1258156 |
| 2 బొంబాయి | ... | ... | 548419 |
| 3 బెంగాలు (వంగదేశము) | | ... | 1021418 |
| 4 సంయుక్త సరగణాలు | | ... | 1347278 |
| 5 పంజాబు | ... | ... | 505361 |
| 6 బీహారు ఒరిస్సా రాష్ట్రములు | | ... | 327564 |
| 7 మధ్యరాష్ట్రములు | ... | ... | 144737 |
| 8 అస్సాము | ... | ... | 203191 |
| 9 బర్మా (సుమారుగ) | ... | ... | 2,500,000 |
| | | మొత్తము వోటర్లు. | 7856124 |

## —♦ సెన్ట్రల్ సబ్జక్ట్సు. ♦—

ఇండియా గవర్నమెంటువారి యాజమాన్యము క్రిందను పరిపాలనా శాఖలు.

1 (ఎ) ఇండియా దేశ సంరక్షణ. ఇండియా దేశములోనున్న చక్రవర్తిగారి సైనికదళ నావికాదళ వాయువిమానదళములు మొదలైనవానికి సబంధించిన వ్యవహారములన్నియును

(బి) నావికా సేనకును పదాతి దళమునకును సంబంధించిన నిర్మాణ కార్యములును సేనా నివాస స్థానములును.

2 ఇండియా దేశపు సరిహద్దుల కావల నున్న తీర్థయాత్రలు విదేశవ్యవహార సంబంధములును,

3 ఇండియాలోని స్వదేశ సంస్థానాధిపతులతోడి సంభంధములు.

4 రాజకీయ నేరములు

5 ఈక్రింద వివరించిన రాకపోకల సౌకర్యములు

(ఎ) ఇనుపదారులు అధికముగా వేసిన మునిసిపల్ ట్రాములు.

(బి) విమాన యానములు, తత్సంబంధములు

(సి) ఇండియా ప్రభుత్వమువారి యధికారములోనున్న జలమార్గములు

6. ఓడలు సముద్రయానములు. (యిండియా ప్రభుత్వము వారి యధీనములోనున్న యంతర్దేశ జలమార్గములను గూడ నిది వర్తించును)

7 కొడింస్తభములు (లైట్ హౌసు) దీపపుటోడలు మొదలైనవి.

8 రేవుపట్టణములయందు ప్రయాణీకులనుంచి పరీక్షచేయు ప్రదేశములు. (పోర్టు క్వారంటైన్) నావికా వైద్యశాలలు.

9 ఇండియా ప్రభుత్వము వారు నిర్ణయించిన ముఖ్యమైన రేవుస్థానములు. (కలకత్తా, బొంబాయి, కరాచి, ఏడెన్, రంగూను, మదరాసు.)

10 తపాలా, తంతి, టెలిఫోను, తీగలేని విద్యుద్వార్తాస్థానములు.

11 ఎగుమతి దిగుమతి పన్నులు, ప్రత్తి యీ దేశములో తయారగు వస్తువులపైవిధించు పన్నులు, ఆదాయపు పన్ను, ఉప్పు మొదలగు నఖిలభారతదేశమునకు సంబంధించిన యాదాయములు

12 కరెన్సీ, టంకశాల,

13 దేశఋణము.

14 సేవింగ్సు బ్యాంకులు.

15 ఇండియన్ ఆడిటు డిపార్టుమెంటు (లెక్కల తనిఖీ)

16 ఆస్తి హక్కులకు సంబంధించిన సివిల్ ధర్మ శాస్త్రములు.

17 వాణిజ్యము (బ్యాంకింగు, భీమాతో.)

18 వర్తక సంఘములు మొదలైనవి.
19 దేశజన క్షేమమునకై యిండియా ప్రభుత్వము వారు నిర్ణయముచేసిన పదార్థము లనుత్పత్తి జేయించి వ్యాపింపజేయు అధికారాధిపత్యములు.
20 దేశ క్షేమమునకై రాష్ట్రీయ ప్రభుత్వములతో సంప్రదించి తమ యాజమాన్యాధికారముల క్రింద వెంపొందింపజేయుటకు యిండియా ప్రభుత్వము వారు నిర్ధారణ చేసికొన్న పరిశ్రమలు.
21 నల్లమందును పైరుజేసి సరుకు జేయించి విక్రయించి, యెగుమతిచేయుట.
22 ఇండియా ప్రభుత్వమువారి పరిపాలనా శాఖల కావశ్యమైన స్వదేశివిదేశీవస్తు సామగ్రిని (స్టేషనరీ) దిగుమతిచేసి నిలువయుంచుట.
23 కిరోసినాయిలు, పెట్రోలియము మొదలగు సులభముగా మండు పదార్థములపై పెత్తనము.
24 భూగర్భశాస్త్ర పరిశోధన.
25 స్టేట్సు క్రటరీగారవకాశ మిచ్చినంతవరకు ఖనిజ పదార్థాభివృద్ధి.
26 వృక్షపరిశోధన
27 నూతన వస్తు సృజనాదులు (ఇక్ వెక్ షన్సు)
28 కాపీరైటు (సర్వస్వామ్యసంకలితము)
29 ఇతరదేశములకు (లేక నుండి) ప్రజల నిర్గమాగమములు
30 క్రిమినల్ లా (శిక్షాస్మృతి) క్రిమినల్ ప్రొసీజరు
31 దేశమొత్తమునకు సంబంధించిన పోలీసు దళనిర్మాణము
32 ఆయుధములు, మందుగుండు సామాను.
33 నూతన విషయ పరిశోధనా సంస్థలు.
34 క్రైస్తవమత శాఖాపరిపాలన. యిరోపియనుల శ్మశానములు.
35 ఇండియా దేశపు సర్వే,
36 పురాతన శిల్పపరిశోధన.
37 జంతుపరిశోధన.
38 కాలమాన పరిశోధన.
39 జనాభా మొదలైన లెఖ్ఖలు.
40 అఖిలభారత పరిపాలనకు సంబంధించిన యుద్యోగులు.
41 రాష్ట్రీయ పరిపాలనా విషయములలో యిండియా ప్రభుత్వమునకును సంబంధించిన భాగములు.
42 రాష్ట్రపు సరిహద్దులను మార్చుటకు సంబంధించినవ్యవహారములు
43 బిరుదులు, గౌరవపదవులు మొదలైనవి.
44 ఇండియా ప్రభుత్వమువారు సంపాదించి పోషించుచున్న స్థిరాస్థి.

45 పబ్లిక్సర్వీసు కమీషను.
46 రాష్ట్రీయ ప్రభుత్వాధికారములలో చేరని తక్కిన వ్యవహారము లన్నియు

## మదాసునుండిబోవు ఎన్నికసభ్యులు 16 మందికి వివరము.

| | మహమ్మదీయేతరులు | ఎసెంబ్లీకి | | స్టేటు కౌన్సిలుకు మద్రాసునుండి. |
|---|---|---|---|---|
| 1. | మద్రాసు నగరము | 1 | సభ్యుడు | మహమ్మదీయేతర స |
| 2. | గంజాము, విశాఖపట్టణం జిల్లాలకు | 1 | ,, | సభ్యులు 4 మంది |
| 3. | గోదావరి; కృష్ణా ,, | 1 | ,, | మహమ్మదీయుడు 1 |
| 4. | గుంటూరు; నెల్లూరు ,, | 1 | ,, | వెరశి 5 మంది |
| 5. | మద్రాసు, దత్తమండలములు, చిత్తూరు | 1 | ,, | |
| 6. | సేలము, కోయంబత్తూరు, ఉత్తరార్కాడు | 1 | ,, | |
| 7. | దక్షిణార్కాడు, చెంగల్పట్టు | 1 | ,, | |
| 8. | తంజావూరు, తిరుచునాపల్లి | 1 | ,, | |
| 9. | మధుర, రామనాథము, తిరునల్వేలి | 1 | ,, | |
| 10. | పశ్చిమతీరం, నీలగిరి జిల్లాలకు | 1 | ,, | |
| | మహమ్మదీయులు | | | |
| 11. | ఉత్తర మద్రాసు | 1 | ,, | |
| 12. | దక్షిణ మద్రాసు | 1 | ,, | |
| 13. | పశ్చిమతీరం, నీలగిరి | 1 | ,, | |
| 14. | మద్రాసు — ఆంగ్లేయసభ్యుడు | 1 | ,, | |
| 15. | ,, భూస్వాములసభ్యుడు | 1 | ,, | |
| 16. | ,, వర్తకసభ్యుడు | 1 | ,, | |
| | | 16 మంది. | | |

## క్రైస్తవమతమునకై ఖర్చు.

ఇండియా గవర్నమెంటువారు దేశాదాయమునుండి క్రైస్తవమత పోషణకై యేటేట నెంతధనము ఖర్చుపెట్టుచున్నారో యీ క్రింది యంకెలవలన దెలియు

గలదు. సివిలు మిలిటరీ కొలువులలోనున్న క్రైస్తవు లందరికొరకును మొత్తమున,

| | | | |
|---|---|---|---|
| 1913—14 సం॥ లో అయినఖర్చు | ... | రూ. | 19,15,000 |
| 1921—22 అంచనా | ... | | 31,11,000 |
| 1922—23 ,, | ... | | 33,83,000 |

ఇందు సైనికభాగములో క్రైస్తవేతర సైనికుల మతబోధకై వినియోగపడినది, 1913—14 లో రు. 34,000 లును; 1922—23 లో రు. 2,23,000లును మాత్రమే. హిందూమహమ్మదీయాది మతాంతరులందరు నిర్బంధముగా క్రైస్తవ మతపోషణకై పన్నులు చెల్లించుచున్నారన్నమాట. ఇండియా గవర్నమెంటు ఆక్టు ప్రకారము, మద్రాసు, కలకత్తా, బొంబాయి, బిషప్పులకును, వారి పరివారములకును సాలుకు జీతభత్యములు మొదలగునవి రు. 1,50,000 ము

వీరి పింఛనులు వగైరాలు 45,000

వెరశి రు. 1,95,000 లు మొత్తమున

ఖర్చగుచున్నది.

## సెలవుజీతాలు.

సెలవుమీద ఇంగ్లాండునకుబోవు తెల్లయుద్యోగులకు సెలవుజీతములు వగైరాలక్రింద ఖర్చుపడుచున్న యిండియాధనము:—

| | | | | |
|---|---|---|---|---|
| 1913—14 సం॥ లో | ... | ... | రు. | 1,02,000 |
| 1921—22 లో | ... | ... | | 5,74,500 |
| 1922—23 లో | ... | ... | | 5,70,000 |

## ఇండియా ఆఫీసు.

ఇంగ్లాండుదేశములో లండను నగరమునందు "వైట్‌హాలు" అనే భవనమును, ఇండియాస్టేటు సెక్రటరీగారి కార్యస్థానమునకై యిండియా ధనముతో నిర్మించిరి. దీనికొరకు 1861 వ సం॥ మొదలు 1870 వ సం॥ వరకు మొత్తము ఖర్చుపెట్టిన యిండియాధనము రు. 88,20,000 లు. ఏటేట దీని మరమ్మత్తు, అభివృద్ధి, అలంకారాదులక్రింద యిండియానుండి కొంతధనము పోవలసియున్నది. 1922—23 సం॥ లో నిందుకొరకై రు. 1,26,000 లు అంచనాలో జేర్చిరి. ఈ స్టేటుసెక్రటరీ అఫీసు ఇండియా లాభమునకుగాక ఇంగ్లాండు ప్రయోజనము కొరకేర్పడినదగుటచే నీఖర్చంతయు ఇంగ్లాండే భరించవలెనని మనవాదన. ఇప్పుడిందు కొంచెముమాత్రమే భరించుచున్నది. వలస రాష్ట్రముల కిట్టిఖర్చులు లేవు.

## రైళ్లు.

ఇనుపదారులు రెండు విధములు. (1) కంపెనీ రైల్వేలు. ఇవి ప్రైవేటు వర్తక సంఘములకు జెందినవి. వీరు ప్రభుత్వమువద్ద లైసెన్సు దీసికొని యీ దేశములో రైళ్లువేసి నడుపుకొందురు (2) స్టేటు రైల్వేలు. ఇవి ప్రభుత్వమునకు జెందినవి. వీనిలో గవర్నమెంటువారు స్వంతముగా వేసినవిగాని, లైసెన్సుగడువు తీరిన తర్వాత ప్రైవేటు కంపెనీలయొద్ద కొన్న బాపతుగాని యిందు జేరియుండును.

భూమి ఖరీదుగాక రైల్వేలమీద పెట్టిన పెట్టుబడి మొత్తము

—♦ మూలధనము ♦—

| | 1913–14 సం॥ లో | 1921–22 సం లో | 1923–24 సం॥ లో |
|---|---|---|---|
| (1) స్టేటురైల్వేలు | రు. 152 కో. 69 ల. | 180 కో. 73 లు | అంచనా. |
| (2) కంపెనీరైల్వేలు | 371 కో. 19 ల. | 425 కో. 25 లు. | |
| వెరశి మొత్తము | రు. 523 కో. 88 ల. | రు. 606 కోట్లు | రు, 661 కో. 37 లు. |
| రైల్వేలమీద రాబడి | 56 కో. $30\frac{3}{4}$ ల. | 81 కో. $69\frac{1}{4}$ లు. | 95 కో. $57\frac{1}{4}$ ల. |
| ఖర్చులు | రు. 30 కో. 1 ల. | 66 కో. 73 లు. | 67 కో. $50\frac{1}{4}$ ల. |
| నికరలాభము | రు 26 కో. $29\frac{1}{2}$ ల | 15 కో | 28 కో 27 ల |
| మొత్తము రైల్వే పొడవు మైళ్లు | 34,656 | ( 1920.21 లో ) | 37,029 మైళ్లు |

ఇండియా గవర్నమెంటువారి ఆఫీసుయొక్క సాధారణవ్యయము.

| | 1913–14 సం॥ | 1921–22 సం॥ | 1922–23 సం॥ |
|---|---|---|---|
| (1) గవర్నరు జనరలు గారు వారి సిబ్బందికి | రు. 10,63,000 | రు. 12,25,000 | రు. 12,82,800 |
| (2) వారి కార్య నిర్వాహక వర్గమునకు | రు. 5,50,000 | 5,40,000 | 5,33,000 |
| (3) ఇండియా శాసనసభలకు | 1,71,000 | 7,00,000 | 8,50,000 |
| (4) సెక్రటరీ వర్గమునకు | 34,05,000 | 64,52,000 | 70,31,500 |
| ఇంగ్లండులో ఖర్చుపౌను 1కి రు. 15 ల చొ॥ | 39,27,000 | 68,91,000 | 70,38,000 |
| మొత్తము | రు. 1,05,22,000 | రు. 1,90,22,000 | రు. 1,98,57,000 |

ఇదిగాక వైసురాయిగారి స్వంత యెస్టాబ్లిష్మెంటు క్రింద మిలిటరీ ఖర్చులలో నీక్రింది పద్దులను గలిపిరి.

| | 1922-23 సం॥ రు. | 1923-24 సం॥ లో వైసురాయిగారు తగ్గించుకొన్నది. రు. |
|---|---|---|
| (1) బ్యాండు | 1,22,000 | 42,000 |
| (2) ఆత్మరక్షకవర్గము (బాడీగార్డు) | 2,24,000 | 40,000 |
| (3) స్వంత పరివారము | 90,000 | |
| వెరశి రు. | 4,36,000 | |
| ఈయేడు తగ్గింపు | 82,000 | |
| 1923-24 లో ఖర్చు రు. | 3,54,000 | |

## రాష్ట్రీయ విరాళములు.

ప్రతి రాష్ట్రమును ఇండియా గవర్నమెంటు వారి దేశ మొత్తపు పరిపాలనా కార్యములకై యేటేట నీక్రింది లెక్క ప్రకారము మొత్తమున 9 కోట్ల 83 లక్షల రూపాయల విరాళము లొసంగవలసియున్నది. ఇందు నూటికి 19 బంగాళము, 18 యునా. పి.; 17 మద్రాసు, 13 బొంబాయి; 10 బీహారు; 9 పంజాబు; $6\frac{1}{2}$ బర్మా; 5 మధ్యపరగణాలు; $2\frac{1}{2}$ అస్సాము ఇవ్వవలసియున్నది.

## దేశఋణము ఆదాయము.

ఇండియా దేశముయొక్క మొత్తము ఋణము.

1914 సం॥ మార్చి నెలాఖరుకు రు. 411 కోట్లు.

1923 సం॥ మార్చి నెలాఖరుకు రు. 781 కోట్లు.

ఇదిగాక యింకను విడిగా 63 కోట్ల రూపాయల ప్రత్యేకపు బాకీలున్నవి. ఇందు ప్రతిఫలమేదో విధముగా వచ్చెడి ఋణము 557 కోట్లును, ప్రయోజనశూన్యమైనది 224 కోట్లును గలదు. మొత్తము దేశాదాయము. రు. 204 కోట్లు

ఈ అప్పు ఆదాయములను 31 కోటిమంది దేశీయులమీదను బంచినయెడల మనిషి 1 కి సుమారు రు. 25 ల. ఋణమును రు. 6-9-0 లు రాబడియు దేలుచున్నది. ఇది దేశముయొక్క అభివృద్ధియో క్షీణత్వమో యాలోచింపుడు.

## —♦ అసహాయోద్యమము—ఆంగ్లేయవిద్య. ♦—

అసహాయోద్యమము వలన 1920 — 21 సం॥ లో ఆంగ్లేయ విద్యాభ్యాసమునకు కొంత దెబ్బ తగిలినదని గవర్నమెంటు వారే యొప్పుకొనుచున్నారు. ఎట్లంటే :—

1919 — 20 సం॥ లో ఉన్నత విద్యాభ్యాసముజేయు పురుష విద్యార్థులు 51,458. వీరిసంఖ్య 1920—21 సం॥ లో 47,017 వరకు తగ్గిపోయెను. హైస్కూళ్ళలో జదువుకొను బాలురసంఖ్య 5,97,969 నుండి 5,66,678 వరకు తగ్గిపోయినది. మొత్తమున 36,000 మంది విద్యార్థులు ఆరేడు మాసాలకంటె తగ్గిపోయిరి.

## —♦ మన దిగుమతులు. ♦—

| | 1913 - 14 లో | 1920 . 21 లో | 1921 - 22 లో |
|---|---|---|---|
| దూదిసరుకు | రు 66 కోట్లు | రు 102 కోట్లు | రు 57 కోట్లు |
| పంచదార | ... | ... | 27½ కో |
| యంత్రసామగ్రి | 8¼ కో | 24 కో | 35½ కో |
| మోటారుకార్లు | 1 కో 13 ల | 7 కో 82 ల | 1 కో 74 ల |
| మొత్తము దిగుమతులు | 183 కో | 142 కో | 124 కో |
| ఎగుమతులు | 244 కో | 172 కో | 182 కో |

## ఇండియా గవర్నమెంటువారి ఆదాయపు పట్టీ.

| | | అంచనా 1922 - 23 సం॥ | 1923 - 24 సం॥ |
|---|---|---|---|
| 1. | ఎగుమతి పన్నులు | రు. 45,41,84,000 | |
| 2. | ఆదాయపు పన్ను | 22,11,39,000 | |
| 3. | ఉప్పు పన్ను | 6,86,03,000 | |
| 4. | నల్లమందు వలన | 3,09,30,000 | |
| 5. | ఇతర బాపతులు | 2,35,85,000 | |
| 6. | రైల్లు నికరాదాయము | 31,10,94,000 | |
| 7. | పంటకాల్వలపై నికరాదాయము | 7,22,000 | |
| 8. | తపాల, తంతి, | 1,75,78,000 | |
| 9. | వడ్డీ బాపతులు | 84,31,000 | |
| 10. | సివిలు పరిపాలనవలన రాబడి | 86,49,000 | |
| 11. | కరెన్సీ, టంకసాల, మారకము | 3,22,31,000 | |
| 12. | సివిలు వర్క్సు | 10,92,000 | |

| | |
|---|---|
| బాపతులు | 66,11,000 |
| ...కొదాయము | 5,54,14,000 |
| రాష్ట్రీయప్రభుత్వములవిరాళములు | 9,20,65,000 |
| రాబడి మొత్తము రు. | 133,22,78,000 |
| తరుగు | 9,16,28,000 |
| చేరశి రు | 142,39,06,000. |

## — ♦ ఇండియా గవర్నమెంటువారి ఖర్చుల పట్టీ. ♦ —

| | | అంచనా 1922-23 | 1923-24 |
|---|---|---|---|
| 1. | రైల్వే; వడ్డీ; యితరఖర్చులు రు. | 25,98,53,000 | |
| 2. | ఆదాయములో ప్రథమ వ్యయములు | 5,53,32,000 | |
| 3. | పంట కాల్వలు | 11,19,000 | |
| 4. | తపాలా తంతి | 97,32,000 | |
| 5. | ఋణములు వగైరా | 15,20,09,000 | |
| 6. | సివిలు పరిపాలన | 9,74,06,000 | |
| 7. | కరెన్సీ; టంకసాల; మారకము; | 10,81,72,000 | |
| 8. | సివిలు పనులు | 1,61,49,000 | |
| 9. | వివిధ ఖర్చులు | 4,05,91,000 | |
| 10. | సైనిక వ్యయము | 67,72,14,000 | |
| 11. | రాష్ట్రీయ ప్రభుత్వములతో లెక్క సరిపెట్టుకొనే చిల్లర బాపతులు | 63,29,000 | |
| | వ్యయము మొత్తము రు. | 142,39,06,000 | |

## శాసనసభ్యుల ప్రయాణపు ఖర్చులు.

శాసనసభ్యులు సభాసమావేశములకును, కమిటీ సమావేశములకును, శాసనసభలకు సంబంధించిన యితరపనులమీదను ప్రయాణము జేసినపుడెల్ల తను మామూలు నివాసస్థానమునుండి, గమ్యస్థానమువరకు రైలుమీద రెట్టింపు మొదటితరగతి రేటును ( దబులుఫస్టుక్లాసు ) రోడ్డుమీద మైలుకు నుప్పావలా చొ॥ నను దీని కొనవచ్చును. పబ్లికు మోటారు కారున్న రోడ్డుమీద ప్రయాణము జేసినయెడల

మామూలు మోటారు రేటుకు రెట్టింపుకంటె నధికముగా దీసికొనరాదు. నేయిూడబులు ఫస్టుక్లాసు రేటును $1\frac{3}{5}$ ఫస్టుక్లాసు రేటుగా మార్చిరి. శా డువచ్చినపని పూర్తియగువరకు దినమునకు రు. 10 చొ॥ భత్యము నిచ్చె.

శాసనసభలకు సంబంధించిన ఉత్తరప్రత్యుత్తరములన్నిటిని పోస్టుచీటీ అంటించకుండా శాసనసభ్యులు పంపుకొనవచ్చును. రాష్ట్రీయ శాసనసభ్యులకును, ఇండియా శాసనసభ్యులకును ప్రయాణపు ఖర్చురేటు సమముగానే యుండును. కాని ఇండియా శాసనసభ్యులకు భత్యఖర్చుమాత్రము దినమునకు ఇరు రూపాయలు.

షరా:— రైలుమీద మనమందరము ప్రయాణముచేయు మూడవ తరగతిరేటు మైలుకు 0-0-4 ఫస్టుక్లాసు రేటు మైలుకు సుమారు రు. 0-2-9 లు

ఉదాహరణము: బందరునుండి బెజవాడకు 3 వ తరగతి టిక్కెట్టు రు. 0—15—0 లు, మొదటితరగతి టిక్కెట్టు రు. 7—13—0.

శాసనసభ్యు లివ్వుడుజేయు బిల్లు టిక్కెటు 1 కి రు. 12.9.0 లు.

ముసుపు బిల్లు జేయు టిక్కెటు 1 కి రు. 15.10-0.



# శారద

యున సచిత్ర మాసపత్రిక.

130 పుటలు గలిగి రెండు త్రివర్ణ చిత్రపటములు ములు 60 వరకు సాధారణ చిత్రపటములు గలిగి సుప్ర ు ఆంధ్ర శేముషీ ధురంధరులచే విరచితములగు వ్యాస , నాటకములు, కథలు, ప్రహసనములు, గీతములు ఉత్తమభంగి మచిలీపట్టణమునుండి వెలువడుచున్నది.

సం॥ చందా రు 7 8 0

అర్ధసం॥ చందా 4 0 0

మానేజరు,

శారద

మచిలీపట్టణము.

---

# కమ్మపత్రిక.

ఇది రైతు జనులందరికిని మిక్కిలి యుపయుక్తకరమైనది. వ్యవసాయిక, ఆర్థిక, రాజకీయాది ముఖ్యవిషయము లన్నియు జక్కగా వ్రాయబడుచుండును. ప్రస్తుతము పక్షపత్రిక గానున్నది. కొలది దినములలో వార పత్రిక కాబోవుచున్నది. ఇందుముఖ్యముగా కమ్మ మహాజనుల సంఘాభివృద్ధి కవసరమగు పెక్కువిషయములు వ్రాయబడుచుండును. ప్రతిరయితును, ప్రతికమ్మ సాంఘికుడును దీని నాదరించుట ధర్మము.

| | |
|---|---|
| రాజపోషకులు. | రు.50—0—0 |
| పోషకులు. | 25—0—0 |
| అభిమానులు. | 10—0—0 |
| పక్షపత్రిక సంవత్సర చందా. | 3—0—0 |

వలయువారు :—

మేనేజరు,

కమ్మపత్రిక,

మచిలీపట్నము.

చెరుకువాడ వే...

(1) శాసనసభలు వెల ప్రతి 1 కి రు. 0-...
డిటో 6 ప్రతులు 3-12-0
డిటో డజను 6-12-0
(2) స్వరాజ్య దర్పణము ప్రతి 0-8-0
డిటో డజను 5-0-0
పై రెండుపుస్తకములు నొకేసారి తెప్పించుకొంటే 1-0-0
(3) ధన ప్రవాహము (తయారగుచున్నది)
(4) పింగళి నాగేంద్రరావుగారి జేబున్నిసా 1-0-0
(5) కొండిపర్తి వీరభద్రాచార్యులుగారి స్వరాజ్య వాణి (తగ్గించిన వెల) } 0-4-0
(6) తల్లాప్రగడ రామారావుగారి గాంధీ మహాత్ముని యుపదేశములు. } 0-12-0

తక్కిన వారికెల్ల పోస్టేజి వేరు, వర్తకులకు రేట్లు వేరు.

వలయువారు,
మేనేజరు,
## స్వరాజ్య గ్రంథనిలయము.
మచిలీపట్టణము.

---

## హరిశ్చంద్రోదయము.

5 అంకముల క్రొత్తనాటకము. (హరిశ్చంద్రుని జనన చరిత్ర) గ్రంథకర్త:- పండిత యడవల్లి వేంకట కృష్ణశాస్త్రిగారు

వెల రు 1—0—0 (పోస్టేజి విడిగా)

వలయువారు:—
గ్రంథకర్తపేర,
రామన్నపేట, చల్లపల్లి పోస్టు,
కృష్ణా జిల్లా (అని వ్రాయవలెను.)